# NEEVE PRAPANCHAM

- J. KRISHNAMURTI

Telugu Transalation of : "YOU ARE THE WORLD"
Translated into Telugu by : Dr. Aruna Mohan
(Authorised by Krishnamurti Foundation India)


'Vasanta Vihar' 64-65,
Green ways Road,
Chennai - 600 028.
E-mail : khhg@md2.vsnl.net.in

Published with Permission by : Pragati Publishers, Hyderabad

First Edition : June, 2002

No. of Copies : 1000

Price : **Rs. 50-00**

Sole Distributors :
Visalaandhra Publishing House,
Abids, Hyderabad - 500 001.
Email : Visalaandhraph@yahoo.com
Visalaandhra Book House.
(Abids, Sultan Bazar) -Hyderabad, Ananthapur,
Vijayawada, Visakhapatnam, Kakinada, Tirupati,
Hanmakonda, Guntur.

# విషయసూచిక

## ఇంతవరకు తెలుగులో వెలువడిన
## జిడ్డు కృష్ణమూర్తి రచనలు

1. కృష్ణమూర్తి తత్వం - పరిచయ సంపుటం
2. శ్రీలంక సంభాషణలు
3. గతం నుండి విముక్తి
4. ఈ విషయమై ఆలోచించండి
5. ముందున్న జీవితం
6. ధ్యానం
7. విద్య అందు జీవితమునకుగల ప్రాధాన్యత
8. మన జీవితాలు - జిడ్డు కృష్ణమూర్తి వ్యాఖ్యానాలు
9. స్వీయజ్ఞానం
10. స్వేచ్ఛ (ఆదిలోనూ-అంతంలోనూ)
11. నీవే ప్రపంచం

ప్రతులకు :

**కృష్ణమూర్తి ఫౌండేషన్, ఇండియా**

చెన్నై - 600 028.

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**

హైదరాబాద్ - 500 001.

# బ్రాండీస్ విశ్వవిద్యాలయంలో చేసిన ప్రసంగాలు

## I

### ప్రపంచం తిరిగి చూస్తున్నప్పుడు

మానవ సమస్యలు విభిన్నంగా కనిపిస్తున్నప్పటికీ, నిజానికి కొంత హెచ్చుతగ్గులతో అంతటా ఒకేలా ఉన్నాయనే స్పష్టంగా కనపడుతుంది. హింసా, దౌర్జన్యం, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలూ, నిజమైన మెరుగైన మానవ సంబంధాలనెలా నెలకొల్పాలి అనే సమస్యలు ఉన్నాయి. మనిషికీ మనిషికీ మధ్య సత్సంబంధాలు వుంటే, నిరంతరం తనలో తాను ఘర్షణకు లోనుగాకుండా ఉండడమే గాక తన పొరుగువారితోనూ ఘర్షణ లేకుండా ప్రశాంతంగా కొంత సఖ్యతగా జీవించవచ్చు. ఆసియా అంతటా వున్నట్లే పేదరికము, ఆకలిబాధ బీదరికపు నిస్పృహ అన్న సమస్యలు గూడ ఉన్నాయక్కడ. ఈ దేశంలోనూ, పశ్చిమ ఐరోపాలోనూ ఉన్నట్లే సంపన్నత అనే సమస్యా ఉన్నది. ఏ సమాజంలో నిరాడంబరత్వం లేకుండా సంపన్నత ఉంటుందో అక్కడ హింస, రకరకాల అనైతిక విలాసాలు వుంటాయి. పూర్తిగా భ్రష్టు పట్టి అవినీతిమయమైపోతుంది ఆ సమాజం

ఏది మనిషి లేదని వాదిస్తున్నాడో వ్యవస్థగా ఏర్పడిపోయిన ఆ మత సమస్య ప్రపంచ మంతటా వున్నది. ధార్మికమయిన మనసంటే ఏమిటి? ధ్యానమంటే ఏమిటి? అన్నవేవీ తూర్పుదేశాల గుత్తాధిపత్యంలో మాత్రమే లేవు. ప్రేమ, మరణం అనే ప్రశ్నలు ఇలా పరస్పర సంబంధమయిన సమస్యలెన్నో! ఈ వక్త భారతదేశానికో, మరొక దేశానికో సంబంధించిన భావనాత్మక ఆలోచనకుగానీ, సిద్ధాంతానికిగానీ ప్రతినిధి గాదు. ఈ సమస్యలన్నింటినీ మనం కలిసి మాట్లాడగల్గితే విషయాలను సరిగా అర్థం చేసుకోగలము. ఒక నిష్ణాతునితోనో, నిపుణునితోనో మాట్లాడినట్లు మాట్లాడడం గాదు, ఎందుకంటే, ఈ వక్త ఏదీకాడు. అయితే, భావ ప్రసారం సరిగా చేసుకోవడం సాధ్యపడుతుంది. బహుశ అప్పుడు పదం వస్తువుగాదు అన్నది, ఆ వర్ణన ఎంత విపులంగా, ఎంత జటిలంగా, ఎంత సహేతుకంగా అందంగా ఉన్నా అది వర్ణింపబడిన వస్తువు గాదు అన్నది మీ మనసులు తెలుసుకోవాలి.

హిందువుల, మహమ్మదీయుల, క్రైస్తవుల, కమ్యూనిస్టుల సిద్ధాంత విభేదాలతో పూర్తిగా విడదీయబడిన వారి వారి ప్రత్యేక ప్రపంచాలు లెక్కింప లేనంత హానిని, విద్వేషాన్ని, విరోధాన్ని తెచ్చిపెట్టాయి. సిద్ధాంతాలు మతపరమయినవయినా, రాజకీయ పరమయినవయినా అన్నీ మూర్ఖమయినవే. ఎందుకంటే వూహలు ఆధారంగా చేసిన ఆలోచనలు, మాటల రూపందాల్చిన వూహలు దురదృష్టవశాత్తూ మనిషిని విభజించాయి.

ఈ సిద్ధాంతాలు యుద్ధాలను తెచ్చిపెట్టాయి. మత సహనం ఉన్నా అది కొంతవరకే అది దాటితే వుండేవి వినాశనము, అసహనము, క్రూరత్వము, హింస - మతపరమయిః యుద్ధాలు. అదేవిధంగా సిద్ధాంతాలవలన, తెల్ల-నల్లవారు అంటూ వివక్షతలవలన

రకరకాల దేశీయ తెగల విభజనలున్నాయి.

ఈ ప్రపంచంలో అహింసాయుతంగా, స్వేచ్ఛతో, మంచితనంతో జీవించడం సాధ్యమా? స్వేచ్ఛ పూర్తిగా అవసరమే. అయితే స్వేచ్ఛ తనకిష్టమయినట్లు చేయడానికి గాదు. ఎందుకంటే, ఆతడు ఈ దేశంలోనో, భారతదేశంలోనో లేదా మరెక్కడో జీవిస్తున్నా ఆ సమాజమూ అక్కడి సంస్కృతీ అతని ఆలోచనల నిర్మాణపుతీరూ అతడిని నిబద్ధుడిని చేశాయి. ఈ నిబద్ధతనుండి స్వేచ్ఛను పొందడము సైద్ధాంతికంగానో, ఒక భావంగానో గాదు. యదార్థమయిన మానసిక స్వేచ్ఛను, అంతరంగ స్వేచ్ఛను పొందడం సాధ్యమా? కానప్పుడు ఎటువంటి ప్రజాస్వామ్యమయినా, సత్ప్రవర్తనయినా ఎలా వుండగలదో నాకవగతంగాదు. సత్ప్రవర్తన అన్నమాట చిన్న చూపు చూడబడుతున్నది. ఈ పదాలను అసలైన అర్థం స్ఫురింపచేయడానికి, ఎటువంటి అవహేళనా ధ్వనించడకుండా మన ముపయోగించుకుంటామని ఆశిస్తాను.

స్వేచ్ఛ అనేది ఒక భావంగాదు. స్వేచ్ఛ గురించి వ్రాసిన తత్త్వశాస్త్రం స్వేచ్ఛగాదు. తాను స్వేచ్ఛగా ఉన్నాడు లేదా లేడు. తాను ఒక కారాగారంలో ఉన్నాడు. దానినెంత అలంకరించినా అది కారాగారమే. కారాగారంలో లేనప్పుడే ఆ ఖైదీకి స్వేచ్ఛ. ఆలోచనలో చిక్కుకున్న మనసు స్వేచ్ఛాస్థితిలో లేదు. ఆలోచన ఎప్పటికీ స్వేచ్ఛగా ఉండలేదు. అనుభవానికి,జ్ఞానానికి, దాని జ్ఞాపకానికి సమాధానంగా వచ్చినదే ఆలోచన. ఎప్పుడూ అది గతాన్నుండే ఉద్భవిస్తుంది. స్వేచ్ఛను తీసుకురావడం దానికి సాధ్యం కాదు. ఎందుకంటే, స్వేచ్ఛ వుండేది నిత్య జీవితంలో, సజీవంగా వున్న యీ వర్తమానంలో. స్వేచ్ఛంటే దేనినుండో విడుదలవడం కాదు. దేనినుండో పొందే స్వేచ్ఛ కేవలం ఒక ప్రతిచర్య మాత్రమే .

ఏది ఒక భావనను ఏర్పరుస్తున్నదో, దేన్ని అనుసరిస్తూ అతడు జీవిస్తున్నాడో ఆ ఆలోచనకు మనిషి ఎందుకంత అసాధారణ ప్రాధాన్యత నిచ్చాడు? సిద్ధాంతాలను తయారుచేయడం, ఎంతో ప్రయత్నంతో ఆ సిద్ధాంతాలకు కట్టుబడి వుండడం ప్రపంచ మంతటా చూడవచ్చు. హిట్లర్ ఉద్యమం అలా చేసింది, కమ్యూనిస్టులు చాలా పటిష్టంగా చేస్తున్నారు. మత సమూహాలు - కాథలిక్కులు, ప్రొటెస్టెంటులు, హిందువులు, యితరులు రెండువేల సంవత్సరాలపాటు ప్రచారంచేసి, వారి సిద్ధాంతాలను పటిష్టంగా చేశారు. భయపెట్టి, వాగ్దానాలు చేసి మనిషిని కట్టుబడేటట్లు చేశారు. ప్రపంచమంతటా ఇది చూడొచ్చు. ఆలోచనకు అంతటి అసాధారణ ప్రాధాన్యాన్ని, ప్రాముఖ్యాన్ని ఎప్పుడూ మనిషి యిస్తూనే వచ్చాడు. ఆలోచన ఎంత ప్రత్యేక నిపుణత గల్గినదయితే, ఎంత మేధో వంతమయితే అంత ఎక్కువ గంభీర అర్థాన్ని సంతరించుకుంటుంది. కనుక మనం మన మానవసమస్యల నెప్పటికయినా ఆలోచన పరిష్కరించగలదా? అని ప్రశ్నిస్తున్నాము.

పారిస్, రోమ్, లండన్, కొలంబియాలలో యిక్కడ మిగతా ప్రపంచంలో జరిగే విద్యార్థుల తిరుగుబాటేగాక నల్లవారికి వ్యతిరేకంగా తెల్లవారు, హిందువులకు వ్యతిరేకంగా ముస్లిములు, యిలా ద్వేషము, క్రౌర్యం ప్రబలడంతో హింస ఒక సమస్యగా

వున్నది. పైకి విద్యావంతులు, నిబద్ధులు అయి, శాంతి ప్రార్థనలు వల్లిస్తున్నా, నమ్మశక్యంగానంత క్రౌర్యాన్ని, అసాధారణ హింసను మానవ హృదయాలు మోస్తున్నాయి. మానవులు ఎంతో క్రూరులు. రాజకీయపరమయిన జాతిపరమయిన విభజనల, మతపరమయిన తేడాల ఫలితమే యీ హింస.

తాను ప్రశాంతంగా జీవించడంకోసం ప్రతిమనిషిలోనూ యిమిడివున్న యీ హింసాప్రవృత్తిని నిజంగా పూర్తిగా మార్చుకోగలడా? మనిషి పశువునుండి, తాను జీవిస్తున్న సమాజాన్నుండి యీ హింసను సంక్రమింపజేసుకున్నాడని స్పష్టము. మనిషి యుద్ధానికి అంకితమయాడు. యుద్ధమే జీవన విధానము. అక్కడక్కడా శాంతికాముకులు కొందరు యుద్ధవ్యతిరేక నినాదాలు చేస్తున్నా యుద్ధాన్ని ప్రేమించేవారు, యుద్ధాలను యిష్ట పడేవారు ఉన్నారు. వియత్నాం యుద్ధాన్ని ఆమోదించనివారే వేరొకదానికోసం పోరాడుతారు. వారికి మరొకరకమయిన యుద్ధముంటుంది. వాస్తవానికి మనిషి యుద్ధాన్ని ఆమోదించాడు. అంటే, తనలోని అంతర సంఘర్షణనే గాక బాహ్య సంఘర్షణనూ ఒక జీవన విధానంగా తీసుకుంటున్నాడు.

సచేతనలోనేగాక, లోలోతులలోని చేతనాస్థాయిలు రెండింటిలో, మొత్తంలోనూ మానవుడు తానేమిటో, అదేవిధంగా సమాజాన్ని దాని రూపురేఖలతో సహా తయారు చేస్తాడన్నది స్పష్టము. ఇక్కడ ఇంకో ప్రశ్న. విద్యద్వారా సామాజిక నియమాలను, సంస్కృతిని అంగీకరించడానికి అలవాటుపడిన తనలో ఒక సంపూర్ణ మానసిక మార్పును తీసుకురావడం సాధ్యపడుతుందా? కేవలం పైపై మార్పునే గాదు.

మానసికమయిన మార్పును సమయం పట్టకుండానే క్రమక్రమంగా గాకుండా వెంటనే తీసుకురావడం సాధ్యమా? ఎందుకంటే, యిల్లు కాలిపోతున్నప్పుడు సమయ ముండదు. నెమ్మదిగా నిప్పునార్పుదామనరు. అప్పుడు సమయముండదు. కాలం ఒక భ్రాంతి. కనుక మనిషిని మార్చేదేది? మిమ్మల్నిగానీ, నన్నుగానీ ఒక మనిషిగా మార్చేదేది? ఒక ప్రేరణా - బహుమతో లేదా దండనో మారుస్తుందా? దానినిగూడా ప్రయత్నించారు. మానసిక బహుమతులు స్వర్గప్రాప్తి, నరకయాతన వంటివెన్నో ఉన్నా మనిషిలో మార్పు లేదు. ఇంకా తాను అసూయాపరుడే, అత్యాశాపరుడే, హింసాత్మకుడే, మూఢంగా నమ్ముతున్నవాడే, భయస్తుడే యిత్యాదివే. ఒక ప్రయోజనాన్ని లక్ష్యాన్ని, బాహ్యంగా కానీ, అంతర్గతంలో కానీ కలిగించడం సమూల మార్పును తీసుకురాలేదు. విశ్లేషణ ద్వారా మనిషి ఎందుకంత హింసాత్మకంగా, ఎంతో భయంతో, ఎంతో ఆర్జనాపరుడై, పోటీ పడుతూ, క్రూరమైన ఆశయాలతో వుంటాడో కారణాన్ని కనుగొనడం, ఒకవిధంగా సులభమే అయినా అది మార్పును తీసుకురాగలదా? ఏ మాత్రం తీసుకురాదు. అదీ చేయదు. లక్ష్యంపైన వున్న ముసుగునూ తొలగింపదు. మరి ఏది మానసిక విప్లవాన్ని క్రమేపీగాక వెంటనే తీసుకువస్తుంది? అదే అసలు సమస్యని నా కనిపిస్తుంది.

విశ్లేషణ, అది నిపుణుల విశ్లేషణగాని అంతఃపరిశీలనతో చేసే విశ్లేషణగానీ యీ సమస్యకు సమాధానం గాదు. విశ్లేషణకు సమయం పడుతుంది. అందుకెంతో అంతర్దృష్టి

కావాలి. ఎందుకంటే పొరపాటుగా విశ్లేషిస్తే తర్వాత చేసే విశ్లేషణ తప్పు అవుతుంది. నీవు విశ్లేషించి ఒక నిర్ధారణకు వచ్చి ఆ నిర్ధారణతో కొనసాగితే అప్పటికీ నీకవి అవరోధమూ అడ్డూ అవుతాయి. విశ్లేషణలో విశ్లేషకుడు, విశ్లేషింపబడేవి అన్న సమస్య వున్నది.

ప్రయోజనం ఆశతోనో విశ్లేషించి కారణం కనుక్కోవడంతోనోగాక అంతరంగంలో సంపూర్ణ, సమూల మానసిక మార్పును ఎలా తీసుకురావాలి? తానెందుకు కోపంగా ఉన్నాడో గ్రహించడం సులభమే. అంతమాత్రాన కోపం రాకుండా ఉండదు. యుద్ధానికి దారితీసే కారణాలను తాను తెలుసుకోవచ్చు. అవి ఆర్థిక, జాతీయ, మతపర కారణాలో లేకుంటే రాజకీయవేత్త అహంభావమో, సిద్ధాంతాలో వాగ్దానాలో కావచ్చు. అయినా దేవుని పేరిటో, దేశం పేరిటో, సిద్ధాంతాల పేరిటో, లేదా ఇంకా ఏదో ఒకదాని పేరిటో ఒకరినొకరము చంపుకుంటూనే వున్నాము. 5000 సంవత్సరాలలో 15000 యుద్ధాలు జరిగాయి. అయినప్పటికీ మనలో ప్రేమా, కరుణా యింకా లేవు!

ఈ ప్రశ్నలోనికి చొచ్చుకుపోతుంటే, 'విశ్లేషకుడు-విశ్లేషింపబడేదీ' 'ఆలోచించేవాడు, ఆలోచించబడేది', 'పరిశీలకుడు, పరిశీలింపబడేది' అన్న సమస్యలోనికి తప్పకుండా వస్తాము. 'పరిశీలకునికి' 'పరిశీలింపబడేదానికి' మధ్య విభజన నిజమయినదా అన్న సమస్యలోనికొస్తాము. 'నిజం' అంటే యథార్థంగా అక్కడవున్న సమస్యేగాని సైద్ధాంతికమయినదేదోగాదు. నీవు ఏ కేంద్రాన్నుండయితే పరిశీలిస్తున్నావో, చూస్తున్నావో, వింటున్నావో ఆ పరిశీలకుడు పరిశీలిస్తున్న దానినుండి తనను తాను వేరుచేసుకున్న ఒక ఊహాత్మకమయిన పదార్థమా? తనను తాను వేరుచేసుకుని తాను కోపంగా ఉన్నానని తెలిసి, తాను కోపంగా ఉన్నానని చెపుతున్న ఆ వ్యక్తినుండి ఆ కోపం వేరా? పరిశీలిస్తున్న వానికి భిన్నంగా హింస వున్నదా? హింస పరిశీలకునిలో ఒక భాగం గాదా? దయచేసి ఇది చాలా ముఖ్యమయిన విషయమని గ్రహించండి. ఎప్పుడు తక్షణం కలుగవలసిన మానసిక మార్పు, భవిష్యత్తులో ఏ స్థితిలోనో తర్వాతెప్పుడో జరిగే మార్పుగాక, తక్షణం అన్న యీ ప్రశ్నపట్ల మనకు శ్రద్ధ వుండిందో అప్పుడు మనం అర్థం చేసుకోవలసిన కీలకఅంశం ఏమిటంటే - పరిశీలకుడు, తాను అహం, ఆలోచించేవాడు, అనుభవిస్తున్నవాడు, తాను పరిశీలిస్తున్న ఆ విషయానికి, అనుభవానికి ఆలోచనకు భిన్నంగా ఉన్నాడా అన్నది. ఒక చెట్టును చూస్తున్నప్పుడు, ఎగిరే పక్షిని చూస్తున్నప్పుడు, నీటిపై పడే సాయం సమయకాంతులు చూస్తున్నప్పుడు అనుభవంలో నున్నవాడు పరిశీలిస్తున్నదానికి భిన్నంగా ఉన్నాడా? మనమొక చెట్టును చూస్తున్నప్పుడు దాన్నసలు చూస్తున్నామా? దయచేసి నాతోపాటు చూడండి. దానివంక నేరుగా చూస్తామా? మనకు తెలిసినవాటి ఊహా బింబాలనుండి, గత అనుభవాలనుండి, దాని వంక చూస్తామా? 'అవును' అది ఎంత అందమయిన రంగో, దాని రూపమెంత బాగుందో నాకు తెలుసు' అంటావు. దానిని గుర్తుపెట్టుకుని జ్ఞాపకం తెచ్చుకోవడంలోనూ, దానికి దగ్గరగా ఉన్న అనుభూతి లోనూ తదితర జ్ఞాపకాలలోనూ వున్న సుఖాన్ని అనుభవిస్తావు. పరిశీలించితే దానికి వేరుగా

పరిశీలకుడన్నట్లు ఎప్పుడయినా చూశావా? వీటి లోతులలోనికి వెళ్ళకుంటే జరుగుతున్న దేమిటో తెలియకుండాపోతుంది. పరిశీలకునికి పరిశీలింపబడేదానికి మధ్య విభజన వున్నంతవరకూ ఘర్షణ ఉంటుంది. గత ఆకురాలు కాలపు రంగుల ఊహా రూపాలవలన, జ్ఞానంవలన, జ్ఞాపకంవలన స్థలరూపంలో మాటరూపంలో మనసులోనికి వచ్చే తేడా పరిశీలింపబడే దానినుండి పరిశీలకుడిని వేరుచేసి ఘర్షణను సృష్టిస్తుంది. ఆలోచనే యీ విభజనను తెస్తుంది. నీ పొరుగువానిని, భార్యనుగానీ, భర్తనుగానీ, స్నేహితునిగానీ, స్నేహితురాలినిగానీ ఎవరినయినా సరే, ఆలోచనా ప్రతిరూపాలు, గత స్మృతులు లేకుండా చూడగలవా? మీరు చూస్తున్నది ఊహారూపంతోనయితే అక్కడ సంబంధమే లేదు. స్త్రీ, పురుషులకు ఒకరిపట్ల మరొకరికిగల రెండు ఊహారూపసమూహాల మధ్య ఉన్నది కేవలం పరోక్ష సంబంధమే. అక్కడ ఉన్న సంబంధం ఊహాత్మకము. యధార్థమయిన సంబంధముమాత్రం గాదు.

మనం భావనా ప్రపంచంలో, ఆలోచనా ప్రపంచంలో జీవిస్తున్నాం. రోజా వుండే యాంత్రికమయిన సమస్యలనుండి ఎంతో లోతైన మానసిక సమస్యలవరకు అన్నింటిని ఆలోచనతో పరిష్కరించడానికి ప్రయత్నిస్తాము.

పరిశీలకునికి పరిశీలింపబడేదానికి మధ్య విభజన వున్నప్పుడు ఆ విభజనే మానవుని ఘర్షణలన్నింటికీ మూలం. నీవెవరినయినా ప్రేమిస్తున్నాను అని అంటూంటే అదేనా ప్రేమ-ఎందుకంటే, ఆ ప్రేమలో పరిశీలకుడు ప్రేమన్న విషయము అంటే పరిశీలింప బడేది. ఈ రెండూలేవా? అటువంటి ప్రేమ ఆలోచనా ఫలితము. ఒక వూహగా విభజింప బడింది. అక్కడ ప్రేమలేదు.

మన మానవ సమస్యలన్నింటినీ ఎదుర్కొనడానికి ఆలోచనొక్కటే సాధనమా? ఎందుకంటే, అది స్పందించదు. మన సమస్యలను పరిష్కరించదు. మనము ఊరికే ప్రశ్నిస్తున్నాము. పిడివాదంతో నిర్ణయించడం లేదేమో! ఏది ఏమయినా యాంత్రిక, సాంకేతిక శాస్త్రవిషయాలలోదప్ప ఆలోచనకు స్థానం లేదేమో?

పరిశీలింపబడేదే పరిశీలించేవాడయితే ఘర్షణ ఆగిపోతుంది. ఇది బహు సాధారణంగా, ఎంతో సులభంగా జరుగుతుంది. చాలా ప్రమాదకరమయిన పరిస్థితిలో వున్నప్పుడు పరిశీలకుడు పరిశీలింపబడేదానికి వేరుగా వుండడు. తక్షణ క్రియ జరుగుతుంది. తక్షణ స్పందన క్రియారూపంలో వుంటుంది. తన జీవితంలో గొప్ప సంకట మేర్పడినప్పుడు అసలు మనిషి సంక్షోభాలను తప్పించుకోవాలనే అనుకుంటాడు. ఆ సంకటాన్ని గురించి ఆలోచించే సమయముండదు. అటువంటి పరిస్థితుల్లో మెదడు తన పాతస్మృతుల జోలికి పోదు. అయినా తక్షణ క్రియ వుంటుంది. పరిశీలకుడు పరిశీలింపబడేదానినుండి వేరుగావడం ముగిసినప్పుడు మానసికంగా అంతరంగంలో తక్షణ మార్పు జరుగుతుంది. మరోవిధంగా చెప్పాలంటే - మనిషి గతంలో బ్రతుకు తుంటాడు. జ్ఞానమంతా గతానికి సంబంధించిందే. అక్కడే జీవిస్తాడు. తన జీవితం గతంలో, జరిగిపోయినదానిలోనే వుంటుంది. 'జరిగిపోయిందేమిటి' దానినుండి

జరుగబోయేదేమిటి' అన్న వాటిపట్ల శ్రద్ధతో వుంటుంది. తన జీవితం ప్రధానంగా నిన్నటి పైన ఆధారపడివున్నది. 'నిన్న' అన్నది మనలను కఠినంగాచేస్తుంది. అమాయకంగా, నమ్రతతో వుండగల శక్తిని పోగొడుతుంది. కనుక 'నిన్న' అనేది పరిశీలకుడు. పరిశీలకునిలో అంతఃచేతనకు సంబంధించినవేగాక చేతనకు సంబంధించిన పొరలన్నీ ఉన్నాయి.

మనలో ప్రతి ఒక్కరిలోనూ మన చేతనలోనూ అంతఃచేతనలో అంటే లోతైన పొరల్లోనూ మానవాళి మొత్తం ఉన్నది. తాను వేల సంవత్సరాల ఫలితం. తనలోనికి తాను ఎలా త్రవ్వుకుంటూ పోవాలో తెలిస్తే, లోలోపల లోతులకు వెళ్తే, ప్రతి ఒక్కరిలోనూ గతానికి చెందిన చరిత్ర మొత్తం ఉన్నదని, జ్ఞానం మొత్తం పొదిగి వుంటుందని కనుగొంటాడు. అందుకే స్వీయజ్ఞానం అత్యంత అవసరము. 'తాను' అంటే ఒక నకలు మనిషి . ఇతరులు చెప్పినవాటిని వల్లిస్తుంటాడు. అది ఫ్రాయిడ్ చెప్పింది గావచ్చు, మరే నిపుణుడు చెప్పిందీ కావచ్చు. తనను తాను తెలుసుకోదలిస్తే తనవైపు తాను నేరుగా చూసుకోవాలి, నిపుణుని దృష్టితో కాదు.

పరిశీలకుడ'వకుండా తనను తాను ఎలా తెలుసుకోవాలి? తెలుసుకోవడమంటే ఏమిటి? నాది మాటల చమత్కారం గాదు. తెలుసుకోవడమంటే అర్థమేమిటి? దేనినైనా నేనెప్పుడు తెలుసుకుంటాను. నాకు 'సంస్కృతం' తెలుసని, 'లాటిన్' తెలుసని చెప్తాను. నాకు నా భార్యా, భర్తా తెలుసంటాను. ఒక భాష తెలుసుననడానికి , నా భార్య, భర్తా తెలుసుననడానికి తేడా వున్నది. ఒక భాషను తెలుసుకోవడానికి నేర్చుకుంటాను, నా భార్యో, భర్తో తెలుసని నేనెప్పుడయినా చెప్పగలనా? నా భార్య గురించి నాకు తెలుసని చెప్పినప్పుడు ఆమెను గురించి నాకు ఊహారూపమున్నది. కాని ఆ ఊహారూపమెప్పుడూ గతానికి సంబంధించిందే. ఆమెను చూడకుండా ఆ వ్యూహ రూపం నాకు అడ్డు నిలుస్తుంది. అప్పటికే ఆమె మారుతుండవచ్చు. ఎప్పటికయినా నాకు తెలుసని చెప్పగలనా? పరిశీలకునిగాగాక నా గురించి నేను తెలుసుకోగలనా అని ప్రశ్నించినప్పుడు ఏమి జరుగుతుందో చూడండి.

ఇది ఎంతో కొంత సంక్లిష్టమయిన విషయము. నా గురించి నేను నేర్చుకుంటాను. నా గురించి నేను నేర్చుకుంటున్నప్పుడు నా గురించిన జ్ఞానాన్ని ప్రోగుచేసుకుంటాను.

నా గురించి యింకా ఎక్కువ నేర్చుకోవడానికి ఆ గతానికి సంబంధించినదాన్నంతా ఉపయోగించుకుంటాను. నా గురించి ఆర్జించుకున్న జ్ఞానంతో నన్ను నేను చూసు కుంటాను. నా గురించి క్రొత్తదేమైనా తెలుసుకోవడానికి ప్రయత్నిస్తాను. నేనది చేయగలనా? అది అసాధ్యం.

నా గురించి నేను నేర్చుకోవడము, నా గురించి నేను తెలుసుకోవడము పూర్తిగా వేరు. నేర్చుకోవడం నిరంతరం జరిగేది. కూర్చిపెట్టుకోని ప్రక్రియ. 'నేను' ఎప్పుడూ మారుతుంటుంది. క్రొత్త ఆలోచనలు, క్రొత్త అనుభూతులు క్రొత్త మార్పులు, క్రొత్త పరిచయాలు, క్రొత్త సూచనలతో ఎంతో కొంత మారుతుంటుంది. నేర్చుకోవడం గతానికో,

భవిష్యత్తుకో సంబంధించినది గాదు. 'నేను నేర్చుకున్నాను' అనో, 'నేను నేర్చుకోబోతున్నాను' అనో చెప్పలేను. కనుక మనసు నిరంతరం నేర్చుకునే స్థితిలో ప్రోగుబడిన నిన్నటి జ్ఞానంతో చప్పబడిపోకుండా, ఎప్పుడూ స్వచ్ఛంగా, వర్తమానంలో జాగృతమయి వుండాలి. అప్పుడు మనసులోనికి లోతుగా వెళ్తే అక్కడ జ్ఞానార్జన జేయడముగాక నేర్చుకోవడమే ఉండడము కన్పిస్తుంది. చూడడంకోసం మనసప్పుడు అసాధారణ చురుకుదనంతో, ఎరుకతో, పదునుగా ఉంటుంది. నా గురించి నాకు తెలుసు అని ఎప్పటికీ చెప్పలేను, ఎవరయినా 'నాకు తెలుసు' అని చెప్తుంటే వారికి తెలియదు అనేది స్పష్టము. నేర్చుకోవడము ఒక నిరంతరమయిన, చురుకయిన ప్రక్రియ నేర్చేసుకున్నది గాదది. నేనెందుకు నేర్చుకుంటానంటే యిప్పటికే నేర్చుకున్నదానికి జతచేయడానికి. నా గురించి నేర్చుకునేందుకు చూసే స్వేచ్ఛ గావాలి. నిన్నటికి చెందిన జ్ఞానంతో చూస్తే చూడడానికి కావలసిన యీ స్వేచ్ఛ లేకుండా పోతుంది.

**ప్రాశ్నికుడు:** పరిశీలకునికి పరిశీలింపబడేదానికి మధ్య వేర్పాటు ఘర్షణకెందుకు దారి తీస్తుంది?

**కృష్ణమూర్తి:** ప్రయత్నం చేస్తున్నదెవరు? ప్రయత్నము, వైరుధ్యమూ వున్నంతవరకూ, ఘర్షణ వుంటుంది. 'పరిశీలకుడు. పరిశీలింపబడేది' ఈ విభజనలో వైరుధ్యం లేదా? ఇదివాదించవలసిన విషయమో, ఒక అభిప్రాయమో గాదు. మీరే చూసి గ్రహించవచ్చు. 'ఇది నాది' అని చెప్పినప్పుడు అది ఆస్తిగావచ్చు, లైంగిక హక్కులు గావచ్చు, నేను చేసేపని గావచ్చు. అక్కడ వున్న ప్రతిఘటన వేరు జేస్తుంది గనుక ఘర్షణ ఉంటుంది. 'నేను హిందువును, బ్రాహ్మణుడను, ఇదీ అదీ' అనుకుంటూ నా చుట్టూ ఒక ప్రపంచాన్నేర్పరచుకుని, దానితో మమేకమవడంతో వేర్పాటు పెరిగిపోతుంది. తాను కాథలిక్కునని చెప్పినప్పుడు కాథలిక్కులు కానివారి నుండి తప్పకుండా తనను తాను వేరుచేసుకున్నట్లే గదా! బాహ్యంగా, ఆంతరంగికంగా ఉన్న యీ విభజనంతా వైరాన్ని పెంచుతుంది. ఇక్కడ వుత్పన్నమయ్యే సమస్యేమంటే ఘర్షణనుపెంచే శత్రుత్వాన్ని వైరుధ్యాన్ని సృష్టించకుండా నాది అని దేనినైనా సొంతం చేసుకోగలనా అన్నది. లేకుంటే స్వంతదారీతనమనే భావనే లేకుండా ఉండే, పూర్తిగా భిన్నమైన మరొక స్థాయి వున్నదా? అప్పుడు స్వేచ్ఛ ఉంటుందా?

**ప్రా:** మానసిక భావనలు లేకుండా పనిచేయడం సాధ్యపడుతుందా? కుర్చీ ఏమిటన్న ఒక ఊహాభావనలేకుండా ఈ గదిలోనికివచ్చి ఆ కుర్చీలో మీరు కూర్చో గలిగేవారా? ఏ భావనల అవసరమూ లేనట్లు మీరు చెప్తున్నట్లుగా వున్నదే!

**కృ:** బహుశా అవసరమయినంత విపులంగా నేను మీకు వివరించినట్లు లేదు. మనకు భావనలు వుండాల్సిందే. మీరెక్కడ ఉంటారు? అని నేనడిగితే మరిచి పోవడమనే ఒక రుగ్మతాస్థితిలో మీరు లేకపోతే చెప్తారు. చెప్పడమనేది భావనుండే, జ్ఞాపకాలనుండే జనించింది. అటువంటి జ్ఞాపకాలు, భావనలు ఉండాల్సిందే. ఈ గొడవంతటికీ మూలం సిద్ధాంతాలను పెంచిన భావజాలం. నీవు అమెరికనువు, నేను హిందువును,

భారతీయుడిని అన్న భావజాలం. నీవొక సిద్ధాంతానికి, నేను మరొక సిద్ధాంతానికి బద్ధులమయి ఉన్నాము. మనం ప్రయోగశాలల్లో శాస్త్రపరంగా సహకరించు కుంటున్నా మేమోగానీ, భావనాపరమయిన ఈ సిద్ధాంతాలకోసము ఒకరి నొకరము చంపుకోవడాని కయినా సిద్ధం. అయితే, మానవ సంబంధాలలో భావనాత్మకమయిన ఆలోచనకు స్థానమేదయినా ఉన్నదా? ఇది ఎంతో క్లిష్టమయిన సమస్య. ప్రతిచర్య మొత్తం భావనాత్మక మయినది. ప్రతిచర్యంటే ఒక భావాన్ననుసరించి చర్యచేయడము. అంటే - ముందు ఒక భావన, ఒక సూత్రము, ఒక నియమము, ఆ తర్వాత వానికనుగుణంగా ఒక చర్య చేయడము. కాబట్టి భావనకు లేక భావానికి చర్యకు మధ్య విభజన వున్నది. పరిశీలకుడు ఉన్నది విభజన అనే ఈ భావన పక్కన. చర్య ఎక్కడో మనకు బాహ్యంగా వున్నది. అందువలనే యీ విభజన, ఘర్షణ నిబద్ధమయిన, విద్యావంతమయిన, సామాజికంగా పెంపొందింపబడిన మనసు తన భావనాత్మకమయిన ఆలోచననుండి స్వేచ్ఛనొంది యాంత్రికత లేకుండా పనిచేయగలదా? అది సాధ్యమేనని నేను అన్నప్పటికీ, అన్నంత మాత్రానే విలువ వుండదు. నేను అది సాధ్యమని, అది ధ్యానమని అంటాను. అంటే మనసు మొత్తం, మనసంతా పూర్తి మౌనంతో ఉండగలదా? భావనాత్మకమయిన ఆలోచననుండి విడుదలవగలదా? మొత్తం ఆలోచన నుండే విడుదలవగలదా? అన్న ప్రశ్నను పరిష్కరించడము. కేవలం అప్పుడు మాత్రమే ఆలోచించవలసిన అవసర మున్నప్పుడే ఆలోచిస్తుంది. నేను ఆంగ్లంలో మాట్లాడుతున్నప్పుడు అది యథాలాపంగా జరుగుతున్న ప్రక్రియ. నన్ను ఎటువంటి ఆలోచనా అడ్డుపడకుండా పూర్తి మౌనంతో వినగలుగుతున్నారా? ఇలా చేయాలని ప్రయత్నించిన క్షణంలో అప్పటికే మీరు ఆలోచనలో ఉన్నారన్నది చూడడంతో వినగలుగుతున్నారా? ఒక చెట్టువంక, ఒక మైక్రోఫోను వంక ఒక్కమాటగూడా లేకుండా చూడడము సాధ్యమా? పదం లేకుండా, అంటే ఒక ఆలోచన, ఒక భావన లేకుండా చెట్టును చూడడం కొంత సులభమే. అయితే మిత్రునివైపు, మిమ్మల్ని బాధపెట్టినవారివైపు, పొగిడినవారివైపు ఒక్కమాట లేకుండా, ఒక్క భావన లేకుండా చూడడం ఇంకా కష్టం. అంటే, మెదడు నిశ్శబ్దంగా వుంటుంది దానికి తన సమాధానాలు, తన ప్రతిస్పందనలు ఉన్నా, చురుగ్గా ఉన్నాగాని ఎంతో నిశ్శబ్దంగా ఉండడంతో ఆ మౌనంలో నుండి ఆసాంతమూ, పూర్తిగా చూడగలుగుతుంది. ఆ స్థితిలో మాత్రమే మీరు ఉన్నదానిని గ్రహించి అఖండమయిన క్రియను చేస్తారు.

ప్రా: అవును. మీరేం చెప్తున్నారో తెలుస్తున్నట్లుగా వున్నది.

కృ: మంచిది. అయితే మీరది చేయాలి. తనను తాను తెలుసుకోవాలి. పరిశీలకుడు పరిశీలింపబడేది, విశ్లేషకుడు విశ్లేషింపబడేదివంటి సమస్యలు కూడా తలెత్తుతాయి. ఇవన్నీ లేని, తక్షణమే గ్రహించేటటువంటి దృష్టి ఒకటుంటుంది.

ప్రా: మాటలతో చేయడానికి సాధ్యం లేనటువంటిదానిని మాటలతో ప్రసారం చేయడానికి మీరు ప్రయత్నిస్తున్నట్లుంది.

కృ: మీకూ, నాకూ ఇంగ్లీషు అర్థమవుతుంది గనుక శబ్ద ప్రసారం జరుగుతుంది.

మనిద్దరిమధ్యా సరియైన అవగాహన, ఆ అవసరము, సమర్థత, తీవ్రత ఉన్నప్పుడే సాధ్యం. లేనప్పుడు సాధ్యం కాదు. నేను మాట్లాడుతున్నప్పుడు మీరు కిటికీలోనుండి చూస్తుంటే, మీరు గంభీరంగా వున్నప్పుడు నేను అట్లా లేకపోతే పరస్పర అవగాహన ఆగిపోతుంది. దేనిలోతులలోకయినా మీరుగానీ, నేనుగానీ వెళ్ళకుంటే భావప్రసారము అత్యంత కష్టమవుతుంది. ఏదయితే మాటలతో జరగదో, ఏది మీరూ, నేనూ ఒకేసారి ఒకేస్థాయిలో గంభీరులమై, తీవ్రతతో, తక్షణమే ఉన్నప్పుడు జరుగుతుందో ఆ భావప్రసారము మాటలను మించి అన్యోన్యతతో పంచుకోవడము. అప్పుడు మాటలను ఆపివేయవచ్చు. మీరూ నేనూ అప్పుడు మౌనంగా కూర్చోగలము. అయితే, ఆ మౌనం మీదో నాదో గాదు. ఇరువురిదీ. బహుశా ఆ పంచుకోవడము అప్పుడుంటుంది. అయితే, అది మరీ ఎక్కువగా ఆశించడమేమో!

## 2

మనకెన్నో జటిల సమస్యలు ఉన్నాయి. వాటిని పరిష్కరించడంకోసం దురదృష్ట వశాత్తూ యితరులమీద నిపుణులు-నిష్ణాతులమీద ఆధారపడతాము. వాటినుండి తప్పించుకోవడం కోసం ప్రపంచమంతటా వున్న మతాలు రకరకాల మార్గాలను అందించాయి. జటిలమయిన యీ మానవ సమస్యలను పరిష్కరించడంకోసం విజ్ఞాన శాస్త్రం తోడ్పడుతుందని, వాటిని విద్య పరిష్కరించి అంతమొందిస్తుందనీ తలచార అయితే, ప్రపంచమంతటా సమస్యలు పెరిగిపోతూవున్నట్లు, హెచ్చవుతూ ఎంతో మరెం ప్రమాదకరంగా అవుతూ, జటిలంగా, అంతులేకుండా ఉన్నట్లు కన్పిస్తున్నాయి. చివ మతాచార్యులమీదగానీ, శాస్త్రవేత్తలమీదగానీ, నిపుణులమీదగానీ ఎవరి మీదా మ ఆధారపడలేదని గ్రహిస్తాడు. అవన్నీ వీగిపోవడంతో సమస్యలలోనికి తానే ఒంట వెళ్ళాలి. యుద్ధాలు, మతపర విభజనలు, మనిషికి మనిషికి మధ్య వైరి భావాలు, క్రూర అన్నీ కొనసాగడంతో భయం, దుఃఖం నిరంతరం పెరిగిపోతూ ఉన్నాయి.

తనకు తానే అర్థం చేసుకోవడమనే ప్రయాణం చేయాలని తెలుస్తుంది. ఆధిపత్యమూ అక్కడ లేకపోవడమూ గోచరిస్తుంది. అన్ని రకాలయిన ఆధిక్య పోయింది. (మరొకస్థాయిలో సాంకేతిక నిపుణుని అధికారమో, ఒక నిష్ణాతుని అ తప్ప) ఈ అధికారాలను ఒక మార్గదర్శకంగా, స్వేచ్ఛాశాంతులను తీసుకొచ్చే మనిషి నిలిపాడు. అవి వీగిపోవడంతో వాటి అర్థాన్ని కోల్పోయాయి. దానితో నైతిక అధికారాలకు వ్యతిరేకంగా ఉద్యమం వచ్చింది. ప్రతీదీ విచ్ఛిన్నమవు దేశానికి బహుశా 300 సంవత్సరాల వయసుండవచ్చు. ఇంత చిన్న వయస పరిపక్వమవకముందే క్షీణించడ మారంభమవడము చూడగలరు. అస్తవ్య గందరగోళం ఉన్నాయక్కడ. దానితో భయం, దుఃఖం ఉండక తప్ప జరుగుతున్న యీ ఘటనలు తనకు తానుగా పరిష్కారం తెలుసుకునేట్లు చేస్తాయి. బయటినుండి ఏ అధికారమూ, నమ్మకమూ, మతనియమమూ,

ఏదీ సహాయపడబోవడం లేదని తెలిసినమీదట పలకను పూర్తిగా తుడిచివేసి మళ్ళీ ప్రారంభించాలి. మతగ్రంథాలు రక్షకునితోసహా పూర్వపు వారసత్వ సంపద మరెంత మాత్రం ముఖ్యమైనవి గావు. దీనితో ఒంటరిగా నిలవడం, పరీక్షించుకోవడం, అన్వేషించడం, ప్రశ్నించడం అన్నింటినీ సందేహించడం అనే వత్తిడికి లోనవుతాడు. వానితో మనసు స్పష్టమవుతుంది. అందుచేత మనసు ఎంతమాత్రం నిబద్ధమవదు. వక్రమార్గాన్ని అనుసరించదు. చిత్రహింసకు లోనవదు.

మనం ఎవరిమయినా సరయిన సమాధానాన్ని తెలుసుకోవడానికి ఒంటరిగా నిలిచి మనకు మనం అన్వేషింపగలమా? ఎంతో నిబద్ధమయిన మనసులలో, హృదయాలలో జరిగే అన్వేషణలో చేతన అంతశ్చేతనలు రెండింటిలోనూ పూర్తి స్వేచ్ఛతో ఉండగలమా?

మనసు భయాన్నుండి విడుదలవగలదా? జీవితంలో ప్రధాన విషయమిది. మనిషి మనసుకు అంటుకున్న భయాన్నుండి ఎప్పటికయినా స్వేచ్ఛ పొందగలదా? అస్పష్టంగా, సైద్ధాంతికంగా గాక తనకున్న భౌతిక మానసిక భయాల గురించి, చేతనలోని భయాల గురించి, అలాగే రహస్యంగా దాగివున్న భయాల గురించి వాస్తవంగా తెలుసుకునేందుకు ఈ విషయంలోని కెళదాము. అది సాధ్యమా? భౌతిక భయాల గురించి తెలుసుకోవచ్చు. అది ఎంతో కొంత సులభమే. అయితే, అంతశ్చేతనకు సంబంధించిన లోతు పొరలలోని భయాల గురించి తాను తెలుసుకోగలడా?

భయం ఏ రూపంలోవున్నా మనసును చీకటిమయం చేస్తుంది. మనసును వక్రమార్గం పట్టిస్తుంది. గందరగోళాన్ని, మనోవైకల్యాన్ని తెస్తుంది. భయంలో స్పష్టత ఉండదు. భయాని కుండే కారణాలను సిద్ధాంతీకరించడము, వాటిని చాలా జాగ్రత్తగా విశ్లేషించడము, బుద్ధి కుశలతతో దానిలోనికి వెళ్ళడము జరిగినా చివరికి యింకా భయ పడుతూనే ఉంటాడన్నది మన మనసులో ఉంచుకుందాం. అయితే, భయమనే ప్రశ్నలోనికి వెళ్ళగలిగినప్పుడు, యదార్థంగా దానిగురించి ఎరుకలో ఉన్నప్పుడు బహుశా దానిమండి పూర్తి స్వేచ్ఛను పొందగలము.

'నాకు ప్రజాభిప్రాయమంటే భయం', 'నా ఉద్యోగం పోవచ్చు', ' నా భార్య నన్నొదిలి పోవచ్చు', 'నాకు ఒంటరిగా ఉన్నానన్న భయం', 'ప్రేమింపబడడం లేదన్న భయం', 'నాకు మరణ భయం' - ఇవన్నీ చేతనలోని భయాలు, తాను శాశ్వతంగా చిక్కుకున్న ఉచ్చువంటి ఈ జీవితం అర్థంలేకుండా, విసుగ్గా ఉన్నదన్న భయం. విద్యావంతులవడం లోని విసుగు, ఒక ఆఫీసులోనో, ఫ్యాక్టరీలోనో జీవిత భత్యాన్ని సంపాదించుకోవడము, పిల్లలను కనడము, కొన్ని లైంగిక ఆటవిడుపులను సుఖించడము, తప్పని దుఃఖము, మరణము - ఇదంతా భయాన్ని, చేతనకు సంబంధించిన భయాన్ని పుట్టిస్తుంది. ఈ భయాన్నంతటినీ ఎదుర్కొనగలడా? ఈ భయంలోనికి వెళ్తే ఎప్పటికీ భయపడడా? అదంతా ఒక ప్రక్కకు పెట్టి స్వేచ్ఛగా ఉండగలడా? వెళ్ళలేకపోతే నిరంతరం ఆందోళనా అపరాధభావన అనిశ్చయ స్థితుల్లో పెరుగుతూ హెచ్చింపబడుతూ వున్న సమస్యలతో జీవించక తప్పదు.

కాబట్టి భయమంటే ఏమిటి? భయమంటే ఏమిటో మనకు నిజంగా తెలుసా? అదిపోయిన తర్వాత మాత్రమే మనం తెలుసుకుంటామా? దీనిని కనుగొనడం ముఖ్యం. మనమెప్పుడయినా భయాన్ని నేరుగా తాకి చూస్తామా? మన మనసులెంత బాగా తర్ఫీదయి, ఎంతగా అలవాటు పడిపోయాయంటే - భయాన్నుండి ఎప్పుడూ తప్పించుకుని దూరంగా పారిపోతుంటాయి. దానితో మనం భయం అని పిలుస్తున్న దానిని సూటిగా తాకలేము. మీ భయాన్నొక్కసారి తీసుకుని సూటిగా చూడడం ఉపయోగ కరంగా ఉంటుంది. బహుశా అందులోకెళ్తూ భయాన్ని గురించి నేర్చుకోవచ్చు.

భయమంటే ఏమిటి? అది ఎలా కలుగుతుంది? భయం స్వరూప స్వభావాలేమిటి? ఉదాహరణకు మనమనుకున్నట్లు ఒకరికి ప్రజాభిప్రాయమంటే భయం. అందులో ఎన్నో విషయాలు - తన ఉద్యోగం పోగొట్టుకోవడం వంటివెన్నో యిమిడి వున్నాయి. ఈ భయమెలా కలుగుతుంది? ఇది కాలంతో వస్తుందా? భయానికి కారణమేదో తెలుసుకుంటే భయం అంతమవుతుందా? విశ్లేషిస్తే , అన్వేషించి కారణాన్ని కనుగొంటే భయం కన్పించకుండా పోతుందా? దేనిగురించో నాకు భయం. చావుగురించి, ఎల్లుండి ఏమవుతుందోనని, లేదా గతంగురించి భయం. ఈ భయాన్ని పోషించి కొనసాగనిస్తున్న దేది? తానేదో తప్పు చేసి ఉండొచ్చు. లేదా చెప్పగూడనిదేదో చెప్పి ఉండొచ్చు. అదంతా గతం లేదా మున్ముందు ఏమవనున్నదోనన్న భయం - అనారోగ్యం, జబ్బు, తన ఉద్యోగం పోతుందేమో - అవన్నీ భవిష్యత్తుకు సంబంధించినవి. అంటే గతం తాలూకు భయం, భవిష్యత్తుగురించి భయం. గతపు భయమంటే యదార్థంగా జరిగిన దాని గురించిన భయం. భవిష్యత్తు భయమంటే ఏదో జరగబోతుందేమో, ఏదోజరగడానికి అవకాశమున్నదేమోనన్న భయం.

గతపు భయాన్నిగాని, భవిష్యత్తుకోసం పడుతున్న భయాన్నిగానీ పోషించి కొన సాగనిస్తున్న దేమిటి? అది తప్పక ఆలోచనే. గతంలో ఏమి చేశాడో, ఒక ప్రత్యేకమైన వ్యాధి ఎలా బాధపెట్టిందో, భవిష్యత్తులో తిరిగి ఆ బాధ పునరావృత మవుతుందేమో అన్న ఆలోచన. భయం పోషింపబడుతున్నది జ్ఞాపకం వలన. దాని గురించిన ఆలోచన వలన గత బాధ గురించి లేదా సుఖం గురించి ఆలోచించడంలో దానిని ఆలోచన సాగనిచ్చి, కాపాడి పెంచుతుంది. భవిష్యత్తుకు సంబంధించిన సుఖం, బాధ ఆలోచన చేస్తున్న కార్యక్రమమే.

నేను చేసేసిన దేనిగురించో, దాని భవిష్యత్ పరిణామాల గురించో నాకు భయం. ఈ భయాన్ని ఆలోచనే పోషిస్తోంది. అది స్పష్టంగా ఉన్నది. కాబట్టి ఆలోచనంటే కాలం, మానసికంగా, గంటలు, నిముషాలుగా లెక్కిస్తున్న కాలానికి భిన్నంగా మానసిక కాలాన్ని ఆలోచన తీసుకువస్తుంది. (గంటల కాలాన్ని గురించి మనమిప్పుడు మట్లాడడం లేదు)

కాలాన్ని నిన్న, ఈరోజు, రేపు అంటూ వుంచుతున్న ఆలోచన భయాన్ని పెంచుతుంది. వర్తమానానికి, భవిష్యత్తులో ఏదో జరగబోతున్నదన్నదానికి మధ్య అంతరాన్ని ఆలోచన కల్పిస్తుంది. ఆలోచన మానసిక కాలంద్వారా నిరంతరం భయాన్ని

పెంచుతుంది. భయానికి మూలం ఆలోచన. దుఃఖానికి మూలం ఆలోచన. ఒప్పుకుంటున్నారా? ఆలోచన స్వభావాన్ని, అదెలా పనిచేస్తుందో, ఎలా నిర్వహిస్తుందో మొత్తం గత స్వరూపాన్ని, వర్తమానాన్ని, భవిష్యత్తును ఎలా తయారు చేస్తుందో మనం యదార్థంగా చూస్తున్నామా? విశ్లేషిస్తూ తద్వారా భయ కారణాలను తెలుసుకుంటూ సహాయ పడినప్పటికీ ఆలోచన భయం పోగొట్టలేనిదని చూస్తున్నామా? భయ కారణానికి, ఆ భయాన్నంతం చేయడానికి మధ్యనున్న ఖాళీలో భయమనే చర్య వున్నది. ఇది హింసాపరుడయిన మనిషి 'అహింస' అనే భావజాలాన్ని కనుగొనడం వంటిది. నేను అహింసా పరుడినవుతాను' అంటాడు. అయితే ఈ మధ్యకాలంలో హింసాబీజాలను నాటుతూ ఉంటాడు. కాబట్టి మనం భయాన్నుండి స్వేచ్ఛ నొందడంకోసం. ఇప్పుడు కాలాన్నుపయోగించుకుంటే భయాన్ని పరిష్కరించలేము. కాలమే ఆలోచన. ఆలోచనతో భయాన్ని పరిష్కరించలేము. ఎందుకంటే, భయాన్ని పెంచింది ఆలోచనే.

కాబట్టి చేయవలసిన దేమిటి? ఈ భయపు ఉచ్చులోనుండి బయటపడే ఆ దారి ఆలోచన గానప్పుడు తానేమి చేయాలి? దీనిని బహుస్పష్టంగా గ్రహించండి. మెదడుతో గాదు, మాటల్లోనూగాదు. ఒక వాదనగా మీరేకీభవించడానికో, ఏకీభవించకపోవడానికో గాదు. శ్రద్ధగల వ్యక్తిగా దీనిపట్ల మనకొక తీవ్రత వున్నట్లయితే భయమనే ప్రశ్నలోనికి లోతుల్లోనికి ప్రవేశించాలి. భయానికి బాధ్యత అలోచనదే. భయాన్ని, సుఖాన్ని రెండింటినీ ఆలోచన పెంచుతుంది. అపరిమితమయిన ఈ భయభావాన్ని ఆలోచన పెంచుతుందని, ఈ భయాన్ని పరిష్కరించడం ఆలోచనకు సాధ్యమవదని బహు స్పష్టంగా తాను చూసినప్పుడు తర్వాత వేయవలసిన అడుగేమిటి? ఈ ప్రశ్నను మీకు మీరే వేసు కుంటున్నారని, నా సమాధానంకోసం ఎదురుచూడరని ఆశిస్తాను. నా సమాధానంకోసం ఎదురుచూడకపోతున్నట్లయితే దీనిని ఎదుర్కోవడానికి మీరు నిలిచినట్లు మీకదొక సవాలు. దీనికి మీరిచ్చే సమాధానమేమిటో చెప్పాలి. ఈ సవాలుకు మీ పాత సమాధానాలిస్తే అప్పుడు మీరెక్కడ ఉన్నట్లు? మీరింకా భయపడుతూనే ఉన్నట్లు. ఈ సవాలు క్రొత్తది. తక్షణమే చర్య తీసుకోవలసినది. ఆలోచన భయాన్ని పెంచింది. ఆలోచన భయాన్నంతంచేసే అవకాశమే లేదు. మీరిప్పుడు ఏమి చేస్తారు?

ముందుగా, ఆలోచన స్వరూప స్వభావాలనర్థం చేసుకున్నాను అని చెప్పినప్పుడు దానర్థం ఏమిటి? 'నాకది అర్థమయింది', "నేనది అర్థం చేసుకున్నాను", 'ఆలోచన స్వభావాన్ని చూశాను' అన్నప్పుడు దాని అర్థమేమిటి? 'నేను అర్థం చేసుకున్నాను' అంటున్న మనసు స్థితి ఏమిటి?

దయచేసి జాగ్రత్తగా గ్రహించండి. దేనినీ బలపరచవద్దు. 'ఆలోచన అర్థం చేసు కుంటుందా? అని అడుగుతున్నాము. మీరేదో చెప్తారు. ఉదాహరణకు ఆధునిక జీవితపు సంక్లిష్టతలను బహు జాగ్రత్తగా సూక్ష్మంగా వర్ణిస్తారు. 'నాకు అర్థమయింది' అంటాను. కేవలం వర్ణన గాదు. దానిలోని విషయం లోతు. అందువలన దానిలో చిక్కుకున్న మనుషులు అధైర్యంగా, నాడీ సంబంధ మనోరుగ్మతతో ఎంతో భయంకర స్థితిలో

ఉండడము - యిత్యాదివాటిని చూస్తాను. అనుభూతితో, నా నాడులతో, నా చెవులతో మొత్తంలో అవగాహన చేసుకుంటాను. కాబట్టి దానితో యివెంత మాత్రమూ చిక్కుకు పోయి ఉండవు. నేనెప్పుడు త్రాచుపాము అపాయకరమని గ్రహిస్తానో, అంతే దాని దరికిగూడా పోను. అది నాకు ఎదురయినప్పుడు నా చర్య వేరుగావుంటుంది. ఎందుకంటే, సంగతి నాకర్థమయింది కాబట్టి. అందుచేత, ఆలోచన స్వభావాన్ని, ఆలోచనా ఫలితమయిన భయాన్ని, సుఖాన్ని అర్థం చేసుకునే స్థితిలో తానున్నాడా? దానిని తన అధీనంలోనికి తెచ్చుకుంటున్నాడా? అదెలా పనిచేస్తుందో చూశాడా? సైద్ధాంతికంగానో మాటలలోనో, బుద్ధితోనో గాక యదార్థంగా ఎలా పనిచేస్తుందో చూశాడా? లేదా నేనింకా వర్ణనతోనే, వాదనతోనే, తార్కికక్రమంలోనే ఉంటూ వాస్తవతతో లేనా? కేవలం వర్ణనతో, మాటల వివరణతోనే సరిపెట్టుకుంటుంటే నేను వాటిచుట్టూ తిరుగుతూ ఆడు కుంటున్నట్లు. వర్ణన సూటిగా వర్ణింపబడేదానినే చూడనిస్తే అప్పుడక్కడ పూర్తిగా భిన్నమైన చర్య ఉంటుంది. ఆకలితో వున్న మనిషి ఆహారం కావాలనుకున్నట్లు. ఆహారపు వర్ణనను గాదు, తింటే ఏమవుతుందో తేల్చి చెప్పడమూ గాదు. అతనికి కావలసింది ఆహారం.

ఆలోచన భయాన్నెలా పెంచుతుందో చూసినప్పుడు ఏమవుతుంది? తనకు ఆకలి వేసినప్పుడు ఆహారమెంత బాగుంటుందో ఎవరయినా వర్ణిస్తుంటే తానేమి చేస్తాడు. తన స్పందన ఎలా ఉంటుంది? 'ఆహారాన్ని వర్ణించొద్దు. నా కివ్వు' అంటాడు. అక్కడ సూటి చర్య వుంటుందిగాని సిద్ధాంత భావనగాదు. కాబట్టి 'నా కర్థమయింది' అన్నప్పుడు దానర్థం ఆలోచన, భయం, సంతోషాలగురించి నేర్చుకోవడమనే నిరంతర చలన ముంటుందని. భయాన్నిగురించి అలా నేర్చుకున్నప్పుడు భయమంతమవుతుంది.

ముసుగును ఎప్పుడూ తొలగించని భయాలు మనసులో దాగి, రహస్యంగా ఉన్నాయి. సచేతన మనసు వాటి ముసుగు నెలా తొలగిస్తుంది? చేతనా స్థాయిలోని మనసు కలలద్వారా ఆ భయాల సూచనలను అందుకుంటుంది. ఈ కలలు తన కొచ్చినప్పుడు వాటిని వ్యాఖ్యానించాలా? తనకు తాను వాటి అర్థాన్ని సులభంగా గ్రహించలేనప్పుడు వెలుపలి నుండి వ్యాఖ్యాతగావలసి వుంటుంది. అయితే ఆయన తన ప్రత్యేక పద్ధతిలో నిపుణతతో వ్యాఖ్యానించవచ్చు. మరికొన్ని కలలుంటాయి. కలలు కంటూ వున్నప్పుడే వ్యాఖ్యానించడమూ జరుగుతుంది.

అసలు తానెందుకు కలలు గనాలి? 'కలలు గనాలి' లేకుంటే పిచ్చి పడుతుం దంటారు' నిపుణులు. కాని తప్పక కలలు గనాలి అని నేననుకోను. పగటి సమయంలో అంతశ్చేతన యిచ్చే సూచనలకు, సంకేతాలకు సావధానంగా ఉంటే కలలుగనదు. కలగనడమనే యీ నిరంతర పోరాటం నిద్రలో వుంటే మనసెంత మాత్రం నిశ్చలమవదు, విశ్రమించదు, పునరుజ్జీవించదు. పగటిపూట మనసు అంత స్పష్టంగా, అంత చురుగ్గా జాగృతమయి, ఎరుకతో ఉండగల్గితే దాగివున్న భయాలు, సూచనలు, సంకేతాలు వెల్లడయి పరిశీలనకు లోనయి కరిగిపోవా?

మాటలో, చర్యలో జరిగే ప్రతి దానిలో పగటి సమయాన ఉండే ఎరుకవలన,

సావధానతవలన దాగివున్న భయాలు, బాహ్యంగావున్న భయాలు, రెండూ వెల్లడవుతాయి. అప్పుడు నిద్రిస్తే ఒక్క కల కూడా లేని పూర్తిగా ప్రశాంతమైన నిద్ర సంభవమవుతుంది. తరువాత ఉదయానికి తాజాగా, లేతగా అమాయకంగా, సజీవంగా మనసు మేల్కొంటుంది. ఇది సిద్ధాంతంగాదు, మీరిది చేయండి. మీరే తెలుసుకుంటారు.

**ప్రాశ్నికుడు:** దాగివున్న భయాలను చేతనాస్థాయిలోనికి తీసుకురావడమెలా సాధ్య పడుతుంది?

**కృ:** తాను చురుగ్గా, వేగంగా గమనికలో వుంటే గత భండారము జాతి సంక్రమణము వంటి వాటికి నెలవై ఉన్న తనలోని అంతశ్చేతనను పరిశీలింపగలడు. నేను పుట్టింది భారతదేశంలో. పెరిగింది, అన్ని పాక్షిక ధోరణులు, మూఢనమ్మకాలు, నిర్దిష్టమయిన నైతిక జీవనము యిత్యాదివాటితోనున్న ఒక బ్రాహ్మణ తరగతిలో - వాటితో పాటు జాతిపరము, కుటుంబపరము అయిన విషయాలు పదివేల సంవత్సరాలు, యింకా పైగా వున్న సామూహిక వ్యక్తిగత సంప్రదాయాలు, ఇదంతా అక్కడ అంతశ్చేతనలో ఉన్నది. అంతశ్చేతనంటే సాధారణంగా మనమనుకునేదంతా. దానికి నిపుణులు మరొక అర్థాన్నీ యివచ్చు. సాధారణ మానవులమయిన మనము మనకు మనమే పరిశీలించగలము. ఇదంతా వెల్లడించేదెలా? ఇది మీరెలా చేస్తారు? మీలో అంతశ్చేతన ఉన్నది. మీరు యూదులయితే దాగివున్న యూదు మత సంప్రదాయమంతా ఉంటుంది. మీరు కాథలిక్కు అయితే అదంతా వుంటుంది. మీరు కమ్యూనిస్టు అయితే మరొకరకంగా ఉంటుందక్కడ. కలలు గనకుండా దానినంతా బయటికెలా తీసుకువస్తారు? ఇదేమీ చిక్కుసమస్యగాదు.

పగటి పూట మీరు చురుగ్గా వుంటే ఆలోచన కదలిక మొత్తాన్ని గురించి మీరేమి చెప్తున్నారో, మీ భావసూచికలేమిటో, ఎలా కూర్చుంటారో, ఎలానడుస్తారో, ఎలా మాట్లాడు తారోనన్న వాటిగురించి ఎరుక వుంటే, మీ స్పందనలగురించి ఎరుకవుంటే దాగివున్నవన్నీ బహుసులభంగా బయటికొస్తాయి. సమయం తీసుకోదు. ఎక్కువ రోజులందుకు పట్టదు. ఎందుకంటే, మీరేమాత్రం ప్రతిఘటించడం లేదు. పనిగట్టుకుని లోనికి చొచ్చుకుంటూ పోవడం లేదు. ఊరక పరిశీలిస్తున్నారు, వింటున్నారు. ఎరుకగల ఆ స్థితిలో ప్రతి ఒక్కటీ వెల్లడవుతుంది. కాని 'నేను కొన్ని ఉంచుకుంటాను. మిగిలినవాటిని వదిలేస్తాను' అంటే మీరు సగం నిద్రలో ఉన్నట్లు. హిందూమతంలోనో, యూదుమతంలోనో, కాథలిక్కు మతంలోనో ఉన్న మంచినంతా నేను ఉంచుకుంటాను, మిగిలినదంతా పోనిస్తాను, అంటే మీరింకా నిబద్ధతతనే పట్టుకుని ఉన్నారన్నది రూఢి అవుతుంది. కాబట్టి దీనినంతా ఎటువంటి ప్రతిఘటనా లేకుండా బయటకు రానివ్వాలి.

**ప్రా:** ఆ ఎరుక ఎంపిక లేకుండా ఉండాలా?

**కృ:** ఎంచుకుంటుంటే ఎరుకను అడ్డుకుంటున్నట్లు. ఎంపిక లేకుండా ఆ ఎరుక వుంటే ఎంతో దాగి, రహస్యంగా వున్న కోరికలు, భయాలు వత్తిడులు ఉన్నవన్నీ వెల్లడవుతాయి.

ప్రా: రోజుకో గంటసేపు ఎరుకతో ఉండడానికి ప్రయత్నం చేయాలా?

కృ: ఒక్కనిముషంపాటు నేను ఎరుకతో సావధానంగా వుంటే చాలు. మనలో చాలామందిమి సావధానంగా ఉండము. సావధానంగా లేము అన్న ఎరుకే సావధానత. అంతేగాని, సావధానత్వం పెంచుకోవడము సావధానత కాదు. నాలో జరుగుతున్న మొత్తాన్ని ఎంపిక లేకుండా, బహు స్పష్టంగా పరిశీలిస్తూ ఒకే ఒక్క నిముషంపాటు ఎరుకతో వుంటే ఒక గంటపాటు సావధానత లేకుండా గడుపుతాను. ఆ గంట గడిచిన తర్వాత తిరిగి సావధానమవుతాను.

## 3

నేడు అమెరికాలో ధ్యానానికి స్థానం లేదని, అమెరికనులకు కావలసినది క్రియేగాని, ధ్యానంగాదని చెప్పారు. ధ్యానించే జీవితానికి, క్రియాత్మక జీవితానికి మధ్య యీ విభజనెందుకని నాకాశ్చర్యంగా ఉంటుంది. జీవితాన్ని ఈ ద్వైత భావంతో ముక్క ముక్కలుగా చూసే విధానంలో మనం చిక్కుకున్నాం. ఇండియాలో వివిధ జీవిత విధానాల భావన ఉన్నది. క్రియాశీలమానవుడు, విజ్ఞానవంతుడైన మానవుడు, వివేకవంతుడయిన మానవుడు-యిత్యాదివి. జీవించడంలో ఉన్న అటువంటి విభజన తప్పనిసరిగా కట్టు బాటుకు, పరిమితత్వానికి, వైరుధ్యానికి దారి తీస్తుంది.

అసాధారణము, సంక్లిష్టము అయిన ధ్యానం అనే ప్రశ్నలోనికి మనం వెళ్ళాలంటే ఆ పదానికి అర్థమేమిటో అవగాహన చేసుకోవడము ఈ వక్తకు బహు ప్రధానమయినది. ఆంగ్లంలో ఆ పదానికి నిఘంటువు యిచ్చే అర్థం - యోచించడము, ఆలోచించడము, పరిశీలించడము, ఆలోచనాపూర్వకంగా విచారణ చేయడము - యిత్యాదివి. ధ్యానపు లోతు, అర్థము, అంతము మొత్తం తమ అదుపులో ఉన్నట్లు, భారతీయుల, ఆసియావారి గుత్తాధిపత్యంలో ఆ పదమున్నట్లు, గుత్తాధికారం వారిదే అన్నట్లు కన్పిస్తున్నది. నిజానికది అసంబద్ధము. ధ్యానాన్ని గురించి మనం మాట్లాడుతున్నప్పుడు జీవితాన్నుండి నిత్యం పడే కష్టము, విసుగు, భయం, ఆందోళనలనుండి తప్పించుకునే, లేక అదొక జీవిత విధానమవడాన్ని తప్పించుకునే ఉద్దేశమేమయినా ఉన్నదేమో మనకు స్పష్టమవాలి. ఈ పిచ్చి వికార ప్రపంచాన్నుండి ధ్యానంతో పూర్తిగా తప్పించుకోవాలను కుంటున్నామో లేదా జీవితంలో అసలు అర్థం చేసుకోవడము, జీవించడము, పనిచేయడమే ధ్యానమో స్పష్టమవాలి. మనం తప్పించుకోవాలంటే వివిధ శిక్షణశాలలు వున్నాయి. జపాన్‌లోని 'జెన్' ఆశ్రమాలు, మరెన్నో యితర విధానాలు ఉన్నాయి. అవి ఎందుకంత ఆకర్షణీయంగా ఉన్నాయో మనం చూడగలం. ఎందుకంటే, యిప్పుడున్న జీవితం బహు వికృతంగా, మూర్ఖంగా, పోటీతో, దయాహీనంగా ఎటువంటి అర్థమూ లేనట్లున్నది. హిందువులు వారి యోగవిధానాలను వారిమంత్రాల మాటల వల్లింపులు యిత్యాదివాటిని సమర్పి స్తున్నప్పుడు మనం సులభంగా ఆకర్షితులమయిపోతాము. పెద్దగా ఆలోచించకుండానే ఒప్పేసుకుంటాము. ఎందుకంటే, అవి ఒక బహుమానాన్ని వాగ్దానం చేస్తాయి. పైగా

తప్పించుకోవడంలోనే సంతృప్తిపడతాము. కాబట్టి ఈ విషయం స్పష్టం చేసుకుందాం. సాలోచనాత్మకమైన కాల్పనిక ఊహలతో కూడిన మాదకద్రవ్యాలద్వారా, లేదా మాటల వల్లింపులద్వారా తప్పించుకునే మార్గాలకోసం ఇపుడు మనం చూడడం లేదు.

ఇండియాలో కొన్ని సంస్కృత పదాల వల్లెవేతను 'మంత్ర' మంటారు. ఒక ప్రత్యేకమయిన నాదంతో మనసునవి మరింత ప్రకంపింపజేసి సజీవంగా చేస్తాయని చెప్తారు. అయితే ఈ మంత్రాల వల్లెవేత మనసును మందగింప చేస్తుంది. చాలామంది కోరుకునేదదేనేమో! తాము జీవితాన్ని ఉన్నదున్నట్లుగా ఎదుర్కోలేరు. అది మరీ భయానకంగా ఉండడంతో బండబారిపోవాలని కోరుకుంటారు. మాటల వల్లెవేత మాదకద్రవ్యాలు, మత్తుపానీయాలు, యిత్యాదివి మనసును మందగింపచేయడానికి సహాయపడతాయి. మనసు మందగించడాన్ని 'నిశ్చలత', 'మౌనం' అంటుంటారు. అయితే అది కానే కాదన్నదీ స్పష్టము. మందగించిన మనసు దైవాన్ని గురించి, ధర్మాన్ని, సౌందర్యాన్ని గురించి ఆలోచింపగల్గినా అది మందకొడిగా, తెలివితక్కువగా భారంగా తయారవుతుంది. రకరకాలుగా తప్పించుకునే యీ విధానాలగురించి మనం పట్టించు కోనవసరం లేదు.

ధ్యానమంటే జీవితాన్ని ముక్కలుముక్కలుగా చేయడంగాదు. ధ్యానమంటే ఆరామాలలోనికి లేదా ఒక గదిలోనికో వెళ్ళి ఒక పది నిముషాలపాటో, ఒక గంటసేపో నిశ్శబ్దంగాకూర్చోవడము. ఏకాగ్రతకోసం ప్రయత్నించడము, ధ్యానాన్ని నేర్చుకోవడమూ - మిగిలిన సమయమంతా క్రూరంగా, వికృతంగా ఉండడముగాదు. ఇదేమీ అర్థం గాదన్నట్లు పక్కకు తోసేయడము ఎలా వున్నదంటే సత్యాన్ని నిజంగా వీక్షించడం చాతగాని ఒక మానసికస్థితిలో ఉన్నట్లుగా ఉన్నది. ఎందుకంటే, సత్యమేదో తెలిసికొనడానికి తనకు బహు పదునైన స్పష్టమైన సూటిగా పనిచేసే మనసుండాలి. కపటంగా బాధించే మనసుగాక, వక్రతలేకుండా చూడగలిగే అమాయకంగా నమ్రతతో ఉండే మనసు గావాలి. అటువంటి మనసు మాత్రమే సత్యాన్ని చూడగలదు. విజ్ఞానంతో నిండిన మనసు ఏది సత్యమో గ్రహింపలేదు. పూర్తిగా నేర్చుకోగలిగిన మనసు మాత్రమే సత్యాన్ని వీక్షింపగలదు. నేర్చుకోవడమంటే విజ్ఞానాన్ని ప్రోగు చేసుకోవడము గాదు. నేర్చుకోవడమంటే ఒక క్షణంనుండి వేరొక క్షణంలోనికి వెళ్ళే గమనము. మనసు శరీరం కూడా ఎంతో సున్నితంగా ఉండాలి. మద్యం, మాంసంతోనిండి మందకొడిగా, భారంగా తయారయిన దేహంతో ధ్యానం చేయడానికి ప్రయత్నిస్తే అర్థముండదు. కాబట్టి, ఎవరు ఈ ప్రశ్నలోనికి గంభీరంగా, లోతుగా వెళ్తున్నా మనసు బహు జాగృతమయి ఎంతో సున్నితంగా ప్రజ్ఞతో వుండాలి. విజ్ఞానంలోనుండి జనించినది గాదా ప్రజ్ఞ.

ఈ ప్రపంచంలో అందులోని వేదనలన్నింటితో జీవిస్తూ, హైన్యత, దుఃఖం, హింసలలో చిక్కుకుని గూడా ఎంతో సున్నిత, ప్రజ్ఞాపూర్వక స్థితికి మనసును తీసుకు రావడం సాధ్యమా? ధ్యానంలో అది ప్రప్రథమమయిన, ప్రధానమయిన అంశము. రెండవది-తార్కికంగా, క్రమానుగతంగా గ్రహింపగల్గిన మనసు - అది ఎటువంటి

వక్రీకరణ, మనోరుగ్మత లేనిది. మూడవది - గొప్ప క్రమశిక్షణ గల్గిన మనసు. ఆంగ్లంలో 'క్రమశిక్షణ' అంటే 'నేర్చుకోవడమని' అర్థం. సాధన చేయబడేదిగాదు 'క్రమశిక్షణ' · నేర్చుకుంటూ వుండే ఒక క్రియ. ఆ పదానికి మూలార్థమది. శిక్షణ గల్గిన మనసు ప్రతి దానిని చాలా స్పష్టంగా, విషయనిష్టతో చూస్తుంది. ఉద్వేగంతో, అనురక్తితోగాదు, ఆలోచన కొలతకు అందనిదానిని, ఆలోచనతో సమకూర్చలేనిదానిని కనుగొనడానికి అవి మౌలిక అవసరాలు. అది ఉన్నతమయిన ప్రేమ గలది. తన స్వంత అల్పమైన మనసు ప్రక్షేపించిన ఒక స్థాయి గాదు.

సమాజాన్ని మనం సృష్టిస్తే అది మనలను నిబద్ధులుగా చేసింది. నీతిలేని నైతికతతో మన మనసులు హింసింపబడి ఎంతో నిబద్ధమయాయి. సామాజికనీతి అనైతికమయినది. ఎందుకంటే, అనైతికమైన తప్పని హింస, అత్యాశ పోటీ ఆశయం యిత్యాదివాటిని సమాజం ఆమోదించి ప్రోత్సాహిస్తున్నది. అక్కడ ప్రేమ, దయ, వాత్సల్యము, సుకుమారత లేవు. సమాజంలో నీతికిచ్చే గౌరవము చాలా అపసవ్యంగా వున్నది. వేల సంవత్సరాల పాటు ఆమోదిస్తూ విధేయతతో కట్టుబడి ఉండడానికి తర్ఫీదయిన మనసుకు చాలా సున్నితంగా, ధార్మికంగా ఉండడము సాధ్యంకాదు. ఈవలలో మనం చిక్కుకు పోయాము. మరయితే సౌశీల్యత ఏమిటి? ఎందుకంటే అది అవసరము.

సరయిన పునాది లేకుండా గణిత శాస్త్రజ్ఞుడు ఎంతో దూరం వెళ్ళలేడు. అదే విధంగా తాను అర్థం చేసుకుని అది దాటి పూర్తిగా భిన్నమైన స్థాయికి సంబంధించిన దానిని చేరాలంటే తాను సరయిన పునాదిని వేయాలి. సరయిన పునాదే సౌశీల్యత. సక్రమత అంటే అదే సామాజిక సక్రమత గాదు. అది అపక్రమము. సక్రమత లేకుండా మనసెలా సున్నితంగా, సజీవంగా, స్వేచ్ఛగా వుంటుంది?

సౌశీల్యత గౌరవింపబడుతూ ఒక నమూనాకు కట్టుబడి పునరుక్తమవుతూ ఉండేది కాదు. దేశంలోగాని మిగతా ప్రపంచంలోగానీ నీతి అంటూ ఆమోదించినదేదో అదీగాదు అన్నది స్పష్టము. సౌశీల్యతంటే ఏమిటన్న అంశంపట్ల బహుస్పష్టంగా ఉండాలి. తాను సౌశీల్యతను పాటిస్తాడు. ప్రేమను, నమ్రతను ఎలా పెంచలేమో అలాగే సౌశీల్యతను గూడా అలవరుచు కోలేము. తాను శీలవంతుడవుతాడు. సౌశీల్యత స్వభావము, దాని అందము, సక్రమత అలవడతాయి. సౌశీల్యత కానిదేదో తెలుసుకుని, నిరాకరించడం ద్వారా రూఢియైన సౌశీల్యతను తెలుసుకుంటాడు. సౌశీల్యతను నిర్వచించి దీనిని అనుసరించడం వలన శీలవంతునిగా వుండడు. అది సౌశీల్యతేగాదు. ఉండవలసిన రకరకాల విధానాలను అంటే సౌశీల్యత, అహింస అని పేర్కొంటున్నవాటిని అలవరుచుకుని, వాటిని ప్రతిరోజా యాంత్రికమయేంత వరకూ ఆచరించడంలో అర్థంలేదు.

సౌందర్యం, ప్రేమలలాగా సౌశీల్యత తప్పకుండా క్షణక్షణమూ ఉండేదే. ఇది మీరు ప్రోగుచేసుకున్నదేదోకాదు. దానినుండి చేసే చర్యాగాదు. ఆమోదించడానికి, ఆమోదించక పోవడానికి వట్టి మాటల కూర్పుగాదిది. సమాజంలోనే గాక మనలోనూ అపసవ్యత ఉన్నది. అంతా అపసవ్యమే. అంటే మనలో ఎక్కడో కొంత సవ్యతా, మిగిలినదంతా అపసవ్యతా వున్నదని గాదు. అది మరొక ద్వైతభావన. దానితో వైరుధ్యము, గందరగోళము, పోరాటము

ఉంటాయి. అపసవ్యత ఉన్నచోట్ల ఎంపిక, ఘర్షణ ఉంటాయి. గందరగోళపడే మనసు ఎంపిక చేస్తుంది. ప్రతిదానికీ స్పష్టంగా చూసే మనసుకు ఎంపిక వుండదు. నేను గందరగోళ పడుతుంటే నా చర్యలూ గందరగోళంగా వుంటాయి.

విషయాలను వక్రీకరించకుండా, వ్యక్తిగత పక్షపాతం లేకుండా స్పష్టంగా చూసే మనసు అపసవ్యతను అర్థంచేసుకుని దాని నుండి విడుదలవుతుంది. అటువంటి మనసు శీలవంతంగా సక్రమంగా ఉంటుంది. కమ్యూనిస్టులకు, సోషలిస్టులకు, లేదా పెట్టుబడిదార్లకు లేదా చర్చి పద్ధతులకు అనుగుణంగా వుండే సక్రమత గాదు. అయితే తనలోనున్న మొత్తం అపసవ్యతను అర్థం చేసుకున్నందువలన సక్రమత ఉంటుంది. అంతరంగంలోని సక్రమత గణితానికున్న పరిపూర్ణ సక్రమతను బోలివుంటుంది. గొప్ప అంతరంగ సక్రమతే, సంపూర్ణత. అది పెంచితేనో, సాధన చేస్తేనో, అణిచివేస్తేనో, నియమాలతోనో, వినయంవలనో కట్టుబాటుతోనో రాగలిగేది గాదు. ఎంతో సక్రమంగా ఉన్న మనసు మాత్రమే సున్నితంగా ప్రజ్ఞాపూర్వకంగా ఉండగలదు.

తనలోనున్న అపసవ్యతను, వైరుధ్యాలను ద్వైదీభావ పోరాటాలను వ్యతిరిక్త కోరికలను, సిద్ధాంతపు ప్రాకులాటలను వాటి అవాస్తవికతను ఎరుకలో ఉంచుకోవాలి. ఏదయితే ఉన్నదో దానిని ఖండించకుండా, నిర్ణయించకుండా, ఎటువంటి అంచనా వేయకుండా పరిశీలించాలి. నేను మైక్రోఫోనును మైక్రోఫోనుగా చూస్తానుగానీ నాకు యిష్ట మయినదానిగానో, యిష్టంలేనిదానిగానోగాదు. మంచిదని లేదా చెడ్డదని అనుకుంటూ చూడను. అది ఎలా వున్నదో అలా చూస్తాను. అదేవిధంగా తాను ఉన్నట్లు గానే తనను తాను చూడాలి. తాను చూస్తున్నదానిని చెడు మంచి అని చెప్పకుండా అంచనా వేయకుండా చూడాలి. (దీనర్థం తన కిష్టమొచ్చినట్లు చేయడం గాదు.) సౌశీల్యతంటే సక్రమత. అందుకొక ప్రణాళికంటూ ఏదీలేదు. తాను ఒక ప్రణాళిక వేసి, దానినను సరిస్తే అవినీతిపరుడయినట్లే, అస్తవ్యస్థమయినట్లే.

**ప్రాశ్నికుడు:** సవ్యత అంటే అపసవ్యత లేకపోవడమా?

**కృ:** అలాకాదు. అపసవ్యతంటే ఏమిటో అర్థం చేసుకోవడము, అంటే మాటల రూపంలోనో, బౌద్ధికంగానోగాక ఏది ఘర్షణో, ఏది ద్వైతమనే యుద్ధమో, ఆ అపక్రమా న్నుండి వాస్తవంగా స్వేచ్ఛనొందడమని మనం అనుకున్నాము. అ అవగాహన నుండి సక్రమత వస్తుంది. అది జీవమయినది. సజీవమయిన దానిని కాగితపుముక్కమీద పెట్టి, దానిననుసరించడానికి మీరు ప్రయత్నించ లేరు. అది ఒక చలనము.

మన మనసులు హింసకు లోనయినవి, మెలికపడినవి. ఎందుకంటే, జీవించడానికి చేయడానికి పనిచేయడానికి, ఆలోచించడానికి మనం అంత గొప్ప ప్రయత్నాలు చేస్తుండడము వలన. ప్రయత్నం ఏ రూపంలో వున్నా వక్రీకరణే. ఎరుక గలిగి ఉండడానికి ప్రయత్నం చేసిన క్షణం అది ఎరుకకాదు. ఈ పెద్ద గదిలోనికి ప్రవేశిస్తూ ఉన్నప్పుడు ఎరుకతోనే ఉన్నాను. అందుకు నేనేమీ ప్రయత్నం చేయను. హాలు పరిమాణం, తెరల రంగు, దీపాలు, మనుషులు, వారు ధరించిన వాటి రంగు నాకు ఎరుకే. అవన్నీ నాకు

ఎరుకే. అక్కడ ప్రయత్నం లేదు. సావధానత ఒక ప్రయత్నమయినప్పుడు అది అవధానత లేకపోవడమే.

ప్రా: నన్నేదో సావధానతా లేమినుండి బయటకు తెస్తున్నది.

కృ: సావధానతా లేమినుండి మీకు సావధానతను ఏదీ తీసుకురాదు. తాను ఎక్కువ భాగం సావధానంగా ఉండదు. అవధానతలో లేరని మీకు తెలిస్తే లేదని తెలుస్తున్న క్షణంలోనే మీరు సావధానమవుతారు. సావధానంగా ఉంటారు.

నిర్దిష్టంగా ఎటువంటి నిర్ణయమూ చేయకుండా ఒకదానిని చూడడము. కొంత సులభం. ఒక చెట్టును, పూవును, మేఘాన్ని, నీటిపై కాంతిని ఎటువంటి నిర్ణయమూ లేకుండా లేదా అంచనా వేయకుండా చూడడము కొంతలో కొంత సులభము. ఎందుకంటే, మననది లోతుగా తాకదు. కాని భార్యనో, నా ఆచార్యులనో ఎటువంటి అంచనా వేయకుండా చూడడం దాదాపు దుర్లభము. ఎందుకంటే, ఆ మనిషిగురించి నాకొక ఊహారూపమున్నది. ఆ ఊహారూపం చాలా రోజుల, మాసాల, సంవత్సరాల పైగా జరిగిన సంఘటనల వరుస నుండి పొందిన సంతోషం, బాధ, లైంగికానందం యిత్యాదివాటితో రూపుదిద్దబడింది. ఆ మనిషి వంక ఆ ఊహారూపంతో చూస్తాను. ఏమవుతుందో చూడండి. నా భార్య వంకో లేదా నా పొరుగువాని వంకో చూస్తున్నప్పుడు ఆమెపట్లనో, అతనిపట్లనో ఏర్పరచుకున్న ఊహారూపాలతో, ప్రచారంతో ఏర్పడిన ఊహారూపాలతో చూస్తాను. అప్పుడు నాకెటువంటి సంబంధమున్నట్లు? భార్యకు, భర్తకు - వారిరువురికీ వారివారి ఊహారూపాలుంటే వారిమధ్య సంబంధమేముంటుంది? అనుభవాల జ్ఞాపకాలు, వేధింపులు, ఏడిపించడము, ఆధిపత్యం చేయడము, సుఖం, అదీ యిదీ సంవత్సరాల తరబడీ ప్రోగుచేసుకున్న ఊహారూపాలమధ్య నున్నదా సంబంధం. ఈ స్మృతులద్వారా, ఈ ఊహారూపాలద్వారా చూసి 'నా భార్యేమిటో నాకు తెలుసు' అంటాను. లేదా ఆమెకు నేను తెలుసంటుంది. అయితే అది నిజమేనా? నాకు తెలిసింది కేవలం ఊహారూపాలు. సజీవంగా వున్నది నాకు తెలియలేదు. తెలిసినదేమంటే, నిర్జీవమైన ఊహారూపాలు. స్పష్టంగా చూడడమంటే ఏ ఊహా రూపము, ఏ సంకేతము, ఏమాటా లేకుండా చూడడము. చూడండి, అక్కడెంత సౌందర్యమున్నదో మీకు కన్పిస్తుంది.

ప్రా: నేనా విధంగా నావంక చూసుకోగలనా?

కృ: నీగురించిన ఊహారూపాలతో నీవైపు చూసుకుంటే నేర్చుకోలేవు. ఉదాహరణకు నాలో లోతుగా ద్వేషం వేళ్ళూనుకుని, ఉన్నట్లు తెలుసుకుని, 'ఎంత భయానకం. ఎంత వికృతం' అని నేనంటే, అంటున్నప్పుడు నన్ను చూడడము నుండి నేనే అడ్డుకున్నాను. మాటల వివరణ, పదము, సంకేతము, పరిశీలనను అడ్డుకుంటాయి. నా గురించి నేను తెలుసుకోవడానికి పదము, విజ్ఞానము, సంకేతము, ఊహారూపము ఉండకూడదు. నేనప్పుడే చురుగ్గా నేర్చుకుంటున్నట్లు.

ప్రా: ఎల్లవేళలా పరిశీలించడము సాధ్యమవుతుందా?

కృ: అటువంటి ప్రశ్ననెందుకడుగుతారో ఆశ్చర్యమనిపిస్తుంది. ఇదొకరకమైన దురాశా? 'నేనది చేయగల్గితే నా జీవితం వేరుగా వుంటుంది' అంటారు మీరు. కాబట్టి మీరు అత్యాశాపరులు. ఎల్లవేళలా చేయగలరా అన్న విషయం మరిచిపోండి. మీరుగా తెలుసుకొనండి ఆరంభించండి. సావధానంగా ఉండడమెంతటి అసాధారణమయిన కష్టమో చూడండి.

ప్రా: (టేపులో వినిపించలేదు)

కృ: నా దేహానికున్న ఇంద్రియాలద్వారా, కళ్ళతో చూడడమున్నది. మనసుతో చూడడం గూడా వున్నది. నేను కళ్ళతో చూస్తాను. నా మానసిక జ్ఞాపకాల దృశ్యాన్ని చూస్తున్నదానిలోనికి ప్రవేశపెట్టడమెందుకు?

ఇది అంతా ధ్యానమే. అక్కడిదంతా ఉన్నది. ఇది అంతమయిన తర్వాత మాత్రమే ఆ ధ్యానం జరుగుతుందని చెప్పలేరు. ఇదంతా ఒక జీవిత విధానము. అదే ధ్యానము. దాని సౌందర్యమదే వాస్తుకళలోని సౌందర్యం వంటిది గాదది. కొండ రేఖల్లో, కొండ వంపుల్లో ఉండే సౌందర్యం గాదు. అస్తమిస్తున్న సూర్యుని సౌందర్యము, చంద్రుని సౌందర్యము గాదు. అది శబ్దంలో, పద్యంలో లేదు. శిల్పంలో, చిత్రంలో లేదు. సౌందర్యమున్నది జీవిత విధానంలో. మీరేదయినా చూడండి. సౌందర్యమున్నదక్కడ.

వక్రమయిన, పగిలిన, తునకలయిన మనసుకు ప్రతిదానిని స్పష్టంగా, అమాయకంగా చూడడము సాధ్యమవుతుందా? మనం హింసకు లోనయిన మనుషులము, దీనిగురించి మరో ప్రశ్నేలేదు. మన మనసులు హింసింపబడినవి. హింసింపబడుతున్నాయి. అటువంటి మనసెలా, బహు స్పష్టంగా, చూడగల్గుతుంది? అది తెలుసుకునేందుకు మనం నేర్చుకుంటున్నాము. విషయాలను ప్రకటించడంగాదు. అది తెలుసుకోవాలంటే అనుభవము అనే ప్రశ్నలోనికి వెళ్ళాలి.

ప్రతి అనుభవము ఒక ముద్రను, అవశేషాన్ని, బాధా సంతోషాల స్మృతిని వదులుతుంది. 'అనుభవము' అనే పదానికి అనుభూతి చెందడమని అర్థం. అయితే మనం అనుభూతి చెందము. కాబట్టి అదొక ముద్రను వదులుతుంది. మీకొక గొప్ప అనుభవ ముందనుకోండి. ఆ గొప్ప అనుభవాన్ని పూర్తిగా అనుభవించండి. మీకప్పుడు దాని నుండి స్వేచ్ఛ లభిస్తుంది. అప్పుడది జ్ఞాపకాల ముద్రను వదలదు.

మనకొచ్చిన ప్రతి అనుభవము చేతనలోనో, అంతశ్చేతనలోనో ఒక జ్ఞాపకాన్ని ఎందుకు వదులుతుంది? ఎందుకంటే, అమాయకతకు అదే అవరోధమవుతున్నది. అనుభవాలను నిరోధించలేరు. అనుభవాన్ని కాదనడమో, ప్రతిఘటించడమో చేస్తే, మీ చుట్టూ మీరే గోడ కట్టుకుని, మిమ్మల్ని మీరే ఒంటరివానిగా చేసుకున్నట్లు. చాలామంది చేసే పని అదే.

అనుభవ స్వభావాన్ని, స్వరూపాన్ని అర్థం చేసుకోవాలి. నిన్నటి సాయంకాలం

సూర్యాస్తమయం వంటిదానిని మీరు చూస్తే ఆ కాంతి, నీటిపై ఆ ఎఱ్ఱని కాంతి, చెట్లపై భాగం, అద్భుతమైన కాంతితో స్నానించడం మనోహరంగా వుంటుంది. దాని వంక చూడండి, ఆనందించండి. అక్కడ ఒక గొప్ప ఆనందం, సౌందర్యం, రంగు, లోతు వుంటాయి. ఒక క్షణం తర్వాత 'అది ఎంత సుందరంగా వున్నది!' అంటారు. ఎవరికో వర్ణించి చెప్తారు. మళ్ళీ కావాలనుకుంటారు. దాని అందం, దాని తాలూకు సుఖం, సంతోషం కావాలనుకుంటారు. అదే సమయానికి అదే గంటకు అక్కడకు వెళ్తారు. సూర్యాస్తమయాన్ని మళ్ళీ చూస్తారు. అయితే దానిని నిన్నటి జ్ఞాపకాన్నుండే చూస్తారు. కాబట్టి అప్పటికే స్వచ్ఛత నిన్నటి జ్ఞాపకంతో ప్రభావితమయింది. అదేవిధంగా నన్ను అవమానిస్తే లేదా పొగిడితే ఆ అవమానము, పొగడ్తలు, బాధ, సంతోషమనే ముద్రలుగా మిగిలిపోతాయి. నేనలా చేర్చి పెట్టుకుంటున్నాను. మనసు అనుభవంతో ప్రోదిచేసుకుంటూ మందమవుతూ, ముతకబారుతూ, వేలాది అనుభవాలతో మరింత భారమవుతూ వుంటుంది. అదొక యదార్థం. నన్నిప్పుడు అవమానిస్తుంటే సావధానంగా వింటూ, అవమానాన్ని పరికిస్తూ, వెంటనే ప్రతిస్పందించకుండా దీనిని పట్టించుకోగలనా? నన్ను మూర్ఖుడివి అన్నప్పుడు మీరు చెప్పింది సరి అయినదే గావచ్చు. నేను మూర్ఖుడినే గావచ్చు. బహుశా నేను అదే. లేదా మీరు నన్ను పొగుడుతుంటే నన్ను నేను గమనిస్తాను. అప్పుడు అవమానము, పొగడ్త ఏ ముద్రనూ వేయవు. మీరు చేసిన అవమానాన్నో, లేదా పొగడ్తనో, సూర్యాస్తమయాన్నో, ఎన్నిటి సౌందర్యాల్నో మనసు చురుగ్గా గమనిస్తూ వుంటుంది. మనసెప్పుడూ చురుగ్గా ఉంటుంది. అందుకే వేలాది అనుభవాలను పొందుతున్నప్పటికీ ఎప్పుడూ స్వేచ్ఛగా వుంటుంది.

ప్రా: మిమ్మల్నెవరో అవమానించారు. వీళ్ళేమంటున్నదీ స్పష్టంగా మీరే విన్నారు. ఆ విన్న తర్వాత .... సరే! నిజమా కాదా?

కృ: కాదు - గతాన్నుండి, మానసికంగా ప్రోగుచేసుకున్న జ్ఞానాన్నుండి, అనుభవాల్నుండి స్వేచ్ఛగలిగిన మనసున్నప్పుడు దానిని ఆ క్షణంలోనే చూసేయగలరు. నిర్మలంగానే ఉండిపోగలరు.

ప్రా: అప్పుడది సావధానంగా ఉండుండాలి...

కృ: ఉండుండాలి. అందులో గొప్ప ఆనందమున్నది. మరొకదానిలో లేదు.

అక్కడి మనసు వక్రమయి అనుభవంతో హింసింపబడడంతో అమాయకంగా, స్వచ్ఛంగా, లేతగా, సజీవంగా ఉండలేదు.

ప్రేమ అనే ఒక పెద్ద ప్రశ్న వున్నది. అదేమిటోనని ఎప్పుడయినా అనుకున్నారా? ప్రేమంటే ఆలోచనా? లేక దానినుండి ఉత్పన్నమయినదా? ప్రేమ ఆలోచనతో పెంపొంద గలదా? అదొక అలవాటవుతుందా? ప్రేమంటే సుఖమా? మనకు తెలిసిన ప్రేమ ప్రధానంగా సుఖాన్వేషణే. ప్రేమంటే సుఖమయినప్పుడు ప్రేమంటే భయం గూడా.... కాదా?

సుఖమంటే ఏమిటి? మనం సుఖాన్ని కాదనడం లేదు. మీకు సుఖముండగూడదని అనడంలేదు. అది అసంబద్ధము. సుఖమంటే ఏమిటి? నిన్నటి సాయంకాలపు సూర్యాస్తమయాన్ని చూశారు. దానిని చూస్తున్న క్షణంలో సుఖమూలేదు. బాధాలేదు. ఉన్నది ఆ యదార్థతలో తక్షణ సంబంధం మాత్రమే. కాని కొన్ని నిముషాల తర్వాత దాని గురించి ఆలోచించడం మొదలెట్టారు, అదెంత అలరించే విషయం అంటూ. లైంగిక విషయంలోనూ అంతే. ఊహారూపాలను, చిత్రాలను ఏర్పరుస్తూ దాని గురించి ఆలోచిస్తారు. దానిగురించి చేసే ఆలోచన సుఖాన్నిస్తుంది. అదేవిధంగా ఆ సుఖాన్ని కోల్పోతామన్న ఆలోచనతో భయమేస్తుంది. రేపొ ఉద్యోగం ఉండదేమోనని, ఒంటరిగా ఉంటామేమోనని, ప్రేమింపబడనేమోనని తనను తాను వ్యక్తీకరించుకోలేనేమోనని - ఇలాంటివి ఆలోచించడంతో భయమేస్తుంది. 'ప్రేమగురించి చేసే ఆలోచనా' యంత్రాంగం సుఖానికి భయానికి రెండింటికీ దారి తీస్తుంది. మీరు మొక్కను పెంచినట్లు ప్రేమను పెంచుకోగలరా? ఆలోచనే సుఖాన్ని భయాన్ని పెంచుతుందని తెలుసుకునీ ప్రేమను ఆలోచనతో పెంపొందిస్తారా? ప్రేమంటే ఏమిటో తాను తెలుసుకోవాలి, తెలుసుకోవడమంటే ప్రేమగురించి మిగిలినవారంతా ఏమి చెప్పారో ప్రోది చేసుకోవడం గాదు. అలా చేయడం ఎంత భయంకరము! తానే తెలుసుకోవాలి. పరిశీలించాలి. ప్రేమ ఆలోచనతో అలవరచుకునేది గాదు. అందుకు పూర్తిగా భిన్నమయింది ప్రేమ.

సున్నితంగా, ప్రజ్ఞతో, తనలో అక్రమమెప్పుడు చోటు చేసుకున్నదో మనసు అర్థం చేసుకుని దానినుండి విముక్తమవడంతో జనించిన సక్రమతతో, అక్రమాన్ని అర్థం చేసుకున్నందువలన వచ్చిన క్రమశిక్షణతో. దేనిని రాజకీయ వేత్తలు, మతాచార్యులు, భర్త, భార్య, సర్వనాశనం చేశారో ప్రేమ అని పిలువబడుతున్న ఆ విషయం అనుభవంలోని కొస్తుంది.

ప్రేమగురించి అర్థం చేసుకోవడమంటే మరణంగురించీ అర్థం చేసుకోవడము. తన గతం విగతమవకపోతే ఎలా ప్రేమించగలడు? నాగురించిన ఊహారూపాన్ని , నా భార్యగురించిన ఊహారూపాన్ని అంతం చేయనప్పుడు ప్రేమించగలిగేదెలా?

ఇదంతా ధ్యానపు అద్భుతము. దాని సౌందర్యము. దీనంతటిలో ధార్మికమయిన, మౌనమయిన మానసిక లక్షణమేదో అనుభవమవుతుంది. మతం దాని దైవాలతో మతాచార్యులతో వ్యవస్థీకరించిన విశ్వాసం గాదు. మతం ఒక మానసిక స్థితి. విముక్త మయిన మనసు, అమాయకమయిన మనసు, కాబట్టి పూర్తిగా మౌనమయిన మనసు - అటువంటి మనసుకు ఒక పరిమితి లేదు.

ప్రా: ఈ రకమయిన మనసు లేనివారికి ఏమవుతుంది?

కృ: అది కొందరికి లేకపోతే అనడమెందుకు? ఆ కొందరు ఎవరు? నాకు లేకపోతే అంతే! నాకటువంటి పదునయిన స్పష్టమయిన మనసు లేకుంటే ఏమి చేయాలి. అది గాదా ప్రశ్న? మన మనసులు గందరగోళంగా వున్నాయి. లేవా?మనం గందరగోళంలో బ్రతుకుతున్నాం. తానేమి చేయాలి? అయ్యా, నేను మందమతినయితే నామందబుద్ధిని

సానబెట్టే ప్రయత్నం తెలివిగలవానిగా చేసే ప్రయత్నం మంచిది గాదు. ముందుగా నేను మూర్ఖుడినని, మందబుద్ధినని తెలియాలి. నేను మందమతినన్న ఆ ఎరుకే మాంద్యతనుండి విముక్తం చేస్తుంది. నేను మూర్ఖుడిని అని మాటలతో అనడంగాదు. 'అవును, నేను మూర్ఖుడిని' అని నిజంగా అన్నప్పుడు మీరప్పటికే గమనిస్తున్నారు గనుక మీరెంత మాత్రమూ మూర్ఖులుగానే లేరు. మీరు ప్రతిఘటిస్తే మీ మందకొడితనం మరింత పెరుగుతుంది.

ఈ ప్రపంచంలో బుద్ధికి పరాకాష్ట ఏమిటంటే - తెలివిగా, చురుగ్గా, సంక్లిష్టంగా గొప్ప పాండిత్యంతో ఉండడము. మనుషులు తమ మస్తిష్కాలలో పాండిత్యాన్నెందుకు మోస్తుంటారో తెలియదు. లైబ్రరీ అరలలోనే ఎందుకు వదలరు? కంప్యూటర్లకు ఎంతో పాండిత్యమున్నది. ఏదేమయినా పాండిత్యానికి ప్రజ్ఞకు ఎంతమాత్రం సంబంధం లేదు. మనలో వున్న విషయాలనున్నట్లుగా చూడడానికి, చూస్తున్నదానిలో ఎటువంటి ఘర్షణను తీసుకురాకుండా ఉండడానికి అత్యంత నిరాండంబరమైన ప్రజ్ఞ కావాలి. నేనొక మూర్ఖుడిని. అబద్ధాలకోరును. నాకు కోపము. ఇటువంటివి నేను పరిశీలిస్తాను. ఎటువంటి అధికారం మీదా ఆధారపడకుండా వాటిగురించి తెలుసుకుంటాను. నేను ప్రతిఘటన చూపను. నేను మరొకవిధంగా వుంటాను అనను. ఉన్నదేదో వుంటుంది. అంతే.

**ప్రా:** సావధానంగా ఉండాలని ప్రయత్నిస్తున్నప్పుడు నేను సావధానంగా ఉండలేనని గ్రహిస్తాను.

**కృ:** సావధానతా లేమినుండి అవధానత జనిస్తుందా?

**ప్రా:** లేదు, దానినుత్పన్నం చేసేదేది? అది ఎలా వస్తుంది?

**కృ:** మొట్టమొదట సావధానతంటే ఏమిటి? మీ మనసును, హృదయాన్ని, మీ నాడులను, మీ కళ్ళను, చెవులను శ్రద్ధతో వప్పగించినప్పుడు సంపూర్ణ అవధానత ఉంటుందక్కడ. అది సంభవిస్తుంది కాదా? సంపూర్ణ సావధానత అదే. ఎప్పుడయితే ప్రతిఘటన, న్యాయవిచారణ అంచనా వేయడము ఉండవో అప్పుడు సావధానత ఉంటుంది. ఇప్పుడు మీకు తెలిసింది గదా?

**ప్రా:** కాని, యిది చాలా అరుదనిపిస్తున్నది.

**కృ:** ఆహా! మనం మళ్ళీ మొదటికొచ్చాము. 'ఇది బహు అరుదుగా జరుగుతుంది' - ఇప్పుడే ఒకటి చెప్తున్నారు. అదేమంటే, మనలో చాలామందిమి సావధానంగా ఉండము. మరోసారి మీలో అవధానత లేకపోవడం గమనిస్తే మీరు సావధానులవుతారు. కారా? కాబట్టి అవధానత లేకపోవడాన్ని గమనించండి. కానిదానిని నిరాకరించడం వలన నిజమైనది వస్తుంది. సావధానత లేకపోవడాన్ని అవగాహన చేసుకోవడంతో సావధానత వస్తుంది.

# బర్కిలీలో, కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో చేసిన ప్రసంగాలు

## I

ముఖ్యమైనదేమంటే వినడము. వక్త చెప్తున్నది వినడమేగాక చెప్పినదానికి మన ప్రతిస్పందనలనూ వినడము. ఎందుకంటే, వక్త ఎటువంటి ప్రత్యేక తత్త్వశాస్త్రాన్నిగురించీ మాట్లాడబోవడం లేదు. భారతదేశానికి దాని తాత్త్వికశాస్త్రాలకూ వేటికీ అతడు ప్రతినిధి కాడు. మనం శ్రద్ధ వహిస్తున్నది మానవ సమస్యలగురించి గానీ తత్త్వశాస్త్రాలు, నమ్మకాల గురించి గాదు. మానవుని దుఃఖాన్నిగురించీ, మనలో ఎక్కువమందికున్న దుఃఖం, ఆందోళన, ఆశలు, నిరాశలు ప్రపంచమంతటా వున్న గొప్ప అపసవ్యతగురించి మనం శ్రద్ధ చూపుతున్నది. మనుషులము గనుక మనకు వాటిపట్ల శ్రద్ధ. ప్రపంచంలో నున్న ఆ అమిత అస్తవ్యస్త స్థితికి మనం బాధ్యులము. అస్తవ్యస్తతకు వియత్నాంలో జరుగుతున్న యుద్ధానికి బాధ్యులము. అల్లర్లకు బాధ్యులము. ఈ ప్రపంచంలో వివిధ దేశాలలో సమాజాలలో నివసిస్తున్న మనుషులమయిన మనము యదార్థంగా జరుగుతున్న ప్రతిదానికీ బాధ్యులము. ఈ బాధ్యత ఎంత గంభీరమయిందో మనం గ్రహించామని నేననుకోవడంలేదు. మనలో కొందరికి ఆ విధంగా అనిపించవచ్చు. అందువలన మనం ఏదో ఒకటి చేయాలనుకుంటాము. ఒక ప్రత్యేకమయిన సమూహంలో, తెగలో, నమ్మకంలో చేరి మన జీవితాలను మొత్తంగా ఆ సిద్ధాంతానికి, ఆ ప్రత్యేకమయిన క్రియకు అంకితం చేస్తాము. కాని అది మన సమస్యను పరిష్కరించదు. మనకున్న ప్రత్యేక బాధ్యతను తప్పించదు.

కనుక మనం సమస్యేమిటో అర్థం చేసుకోవాలి. ఏమి చేయాలోనన్న చింతగాదు. అది తర్వాత వస్తుంది.

మనలో చాలామంది ఏదో చేద్దామనుకుంటారు. మనలను మనం ఒక ప్రత్యేక యా విధానానికి అప్పగించుకుందా మనుకుంటాము. దురదృష్టవశాత్తూ అది మరింత స్తవ్యస్తతకు, మరింత గందరగోళానికి, మరింత మూర్ఖతకు దారి తీస్తుంది. మనం సమస్యను మొత్తంగా చూడాలి. కేవలం ఆ సమస్య యొక్క ఒక ప్రత్యేక భాగాన్ని కాదు. ఒక్క విభాగం వైపు, ఒక్క ముక్క వైపు కాదు. ఎందులోనయితే ఆఫీసుకు వెళ్ళడము, కుటుంబము, ప్రేమ, లైంగికత, ఆశయము, మరణమంటే ఏమిటో అర్థం చేసుకోవడము యిమిడి వుంటాయో ఆ జీవితమనే సమస్య మొత్తాన్నీ చూడాలి. దైవము లేదా సత్యము. పేరేమిపెట్టినా అది వున్నదేమో చూడాలి. ఈ సమస్య మొత్తాన్ని మనం గ్రహించాలి. మనకు అది కష్టమవుతున్నది. ఎందుకంటే, ఇవ్వబడిన సమస్యలపట్ల స్పందన ప్రతి

స్పందనలకు అలవాటుపడ్డాము గానీ మానవ సమస్యలన్నీ పరస్పర సంబంధంతో నున్నవని చూడడంలేదు. ఈ దేశంలో గాని, ఫ్రాన్సులో గాని, ఇండియాలో గాని ఒక ప్రత్యేక వ్యవస్థను తారుమారుచేసి, ఒక ఆర్థిక లేదా సామాజిక విప్లవాన్ని తీసుకురావడం కంటే ఒక సంపూర్ణ మానసిక విప్లవాన్ని తీసుకురావడం మరింత ముఖ్యంగా కన్పిస్తున్నది. ఎందుకంటే, కేవలం క్రియాశీల పోరాటదారులు గావడం కంటే లేదా ఒక ప్రత్యేక సమూహంలో చేరడం కంటే లేదా ఒక ఆరామంలోనే ఉండిపోయి ధ్యానం చేసుకోవడము అంటే 'జెన్' ధ్యానమో లేదా యోగమో నేర్చుకోవడంకంటే సమస్య లోతయినది, తీవ్రమయినది.

మీరీ వక్తను ప్రశ్నించకముందే మొదటగా మనం ఒక సమస్య వంక చూడాలి. ఒక గంటో ఏమో మీరు వినడానికి వచ్చి, తర్వాత దాని గురించే మరిచిపోవడం గాదు. మనం మానవ సమస్యలను గురించి శ్రద్ధ చూపుతున్నాము. ఈ సాయంకాలం మీరూ నేనూ చాలా కష్టపడి పనిచేయాలి. కేవలం కొన్ని భావాలను చేర్చుకుని వాటిని సమ్మతించడానికో, సమ్మతించకపోవడానికో, వక్త ఏమి చెప్పబోతున్నదీ కనుగొనడానికి ప్రయత్నించడానికో ఇక్కడకు రాలేదు. అతడు చెప్పేది చాలా తక్కువని తెలుసుకుంటారు. ఎందుకంటే, మనమిరువురమూ సమస్యలను పరీక్షించబోతున్నాము. ఏ నిర్ణయమూ తీసుకోవడంలేదు. కాని సమస్యలనర్థం చేసుకుంటున్నాము. ఆ అవగాహనే తనదయిన క్రియను తీసుకువస్తుంది. కనుక, దయచేసి - నా సలహా యివ్వచ్చునంటే - వినండి. అంగీకరిస్తూ కాదు, అంగీకరించకుండానూగాదు. ఏ నిర్ణయానికి రాకుండా వినండి. ఏ పక్షపాతమూ లేకుండా, ముందే ఏర్పరచుకున్న భావాలతో గాకుండా వినండి. ఎందుకంటే, శతాబ్దాల తరబడి మాటలతో భావాలతో సిద్ధాంతాలతో ఈ రకమైన ఆట ఆడాము. అవెక్కడికీ చేర్చలేదు. ఇంకా బాధపడుతున్నాము. అల్లకల్లోలంలోనే ఉన్నాము. సుఖంగానటువంటి ఆ మహదానందం కోసం ఇంకా అన్వేషిస్తూనే వున్నాము. మేము చెప్పినట్లు జీవించడమనే సమస్య మొత్తాన్ని గురించి మనం ఆందోళన పడుతున్నాము. ఒక ప్రత్యేక భాగాన్ని గురించి, ఒక అంశాన్ని గురించి కాదు. కనుక ముందు సమస్యలేమిటో చూద్దాము. వాటినెలా పరిష్కరించాలో గాదు. వాటినేమి చేయాలో గాదు. ఎందుకంటే, మనం సమస్యను అర్థం చేసుకున్న ఆ క్షణమే ఆ అవగాహనే తనదయిన క్రియను తెస్తుంది. దానిని గ్రహించడము చాలా ముఖ్యము. చాలామంది సమస్యలను అభిప్రాయంతో, ఒక ఊహతో చూస్తారు. యదార్థంగా ఉన్నదేమిటో చూడడానికి, పరిశీలన చేయడానికి, మనం స్వేచ్ఛగా లేము. చూడడానికి సమస్యను వెల్లడించడానికి మనం స్వేచ్ఛగా వుంటే అప్పుడా పరిశీలననుండి, ఆశను కనుగొనడాన్నుండి అవగాహన వస్తుంది. ఆ అవగాహనే క్రియ, క్రియకు దారి తీస్తున్న ఒక అభిప్రాయము గాదు. దానిలోనికి మనం వెళదాము. బహుశా వెళ్తున్నప్పుడు మనలనొకరినొకరము అర్థం చేసుకుంటాము.

ప్రపంచంలో తాను ఎక్కడికి వెళ్ళినా మనుషులంతా హెచ్చుతగ్గులుగా ఒకే రకంగా వుంటారని మీకు తెలుసు. వారి మర్యాద మన్ననలు ప్రవర్తన, బాహ్యమైన క్రియా

విధానం వేరుగా ఉండొచ్చు. కాని మానసికంగా, అంతరంగంలో వారి సమస్యలన్నీ ఒక్కటే. ప్రపంచమంతటా మనిషి గందరగోళపడుతూనే వున్నాడు, తాను మొదట చూసేదది. అస్పష్టత, అభద్రత. ఈ అస్తవ్యస్థతనుండి బయటపడేదారికోసం అతడు తడుము కుంటున్నాడు. అడుగుతున్నాడు, చూస్తున్నాడు. అందుకోసము అతడు ఆచార్యుల దగ్గరకు, యోగుల దగ్గరకు, గురువుల దగ్గరకు తత్త్వవేత్తల దగ్గరకు వెళ్తాడు. సమాధానం కోసం ప్రతిచోటా చూస్తాడు. బహుశా అందుకే మీలో చాలామంది ఇక్కడకొచ్చారు. ఎందుకంటే, మనం చిక్కుకున్న ఈ వలలో నుండి మన మనుషులమే యీ వలను తయారుచేసుకున్నామని గ్రహించకుండా, బయటపడేమార్గం కనుక్కోవాలనుకుంటున్నాం. ఇది మనం తయారుచేసుకున్నదే, ఎవరో తయారుచేసింది గాదు.

మనం జీవిస్తున్న సమాజం మన మానసికస్థితి ఫలితమే. సమాజమే మనము. ప్రపంచము మనకు భిన్నంగా లేదు. మనమెలా వుంటే అలా ప్రపంచాన్ని తయారు చేశాము. ఎందుకంటే మనం గందరగోళపడ్డాము. మనం అత్యాశాపరులము, దురాశా పరులము, అధికారాన్ని, హోదాను, గౌరవాన్ని కోరుకుంటాము. మనం కలహాశీలురము, హింసాపూరితులము, అంతే. పోటీ స్వభావంతో పాశవికంగా, హింసాత్మకంగా ఉండే సమాజాన్ని మనం సృష్టిస్తాము. ముందుగా మనలను మనం అర్థం చేసుకోవడము, మన బాధ్యతని నా కన్పిస్తున్నది. ఎందుకంటే, మనమే ప్రపంచము గనుక ఇది స్వార్థపూరిత పరిమిత దృష్టిగాదని, ఈ సమస్యలలోనికి ఎప్పుడు మీరు వెళ్ళనారంభిస్తారో అప్పుడు చూస్తారు.

మనచుట్టూ, మనలోనూ వున్న ప్రపంచాన్ని చూస్తున్నప్పుడు ఉన్నటువంటి సమస్య ఏది? అది ఆర్థిక సమస్యా? జాతి సమస్యా? తెల్లవారికి వ్యతిరేకంగా నల్లవారుండడము, పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా కమ్యూనిష్టులుండడము, ఒక మతాన్ని వ్యతిరేకిస్తూ మరొక మతముండడము సమస్యా? లేదా చాలా లోతయిన, మరెంతో పెద్దదయిన మానసిక సమస్యా? అది కేవలమొక బాహ్య సమస్య గాదు. తప్పనిసరిగా ఎంతో పెద్ద అంతరంగిక సమస్య.

ముందుగానే చెప్పినట్లుగా స్వభావరీత్యా మనిషి కలహాశీలి. పాశవికుడు, పోటీదారు, శాసిస్తుంటాడు. నిన్ను నీవు పరిశీలించుకుంటే దీనిని నీలోనే చూస్తావు. నేను చెప్పవచ్చునంటే - ఈనాటి సాయంకాలం తర్వాత మూడు సాయంకాలాలు అందరము కలిసి మాట్లాడబోతున్నదేమంటే, కొన్ని భావాల వరుసను మీరు వినడము గాదు. వక్త చెప్పవలసిన మానసిక యదార్థాన్ని మీలో మీరే చూడగలరు. కనుక మిమ్మల్ని మీరు పరిశీలించుకోవడానికి వక్తను ఉపయోగించుకోండి. ఆ వక్తను ఒక అద్దంలాగా మీరు ఉపయోగించుకొనండి. అందులో ఎటువంటి వక్రీకరణము లేకుండా మిమ్మల్ని మీరు చూసుకొని యదార్థంగా మీరేమిటో నేర్చుకుంటారు.

కనుక ముఖ్యమయినదేమంటే, నీ గురించి నేర్చుకోవడము, ఏ నిపుణుని ప్రకారమోకాదు. యదార్థంగా నిన్ను పరిశీలించుకుంటూ నేర్చుకోవడము. అక్కడ నీవే

ప్రపంచాన్ని కనుగొంటావు. ఈ ద్వేషాలకు జాతీయతావాదంలో మత విభజనలతో కొన్ని నమ్మకాలలో మరికొన్ని అపనమ్మకాలలో మునిగివున్న మనిషిని భయపెడుతున్న మనిషిని యిత్యాది వాటిని కనుగొంటావు. మనం సమస్యను చూస్తూ మనగురించి నేర్చు కోబోతున్నాము. మనకందరికీ ఎదురయ్యే సమస్య ఏది? సమస్య వేరుగా, ప్రత్యేకంగా వుంటుందా? ఆర్థిక సమస్యా, లేక జాతి సమస్యా, లేకుంటే ఏదో ప్రత్యేకమయిన భయమో, లేదా మనోవైకల్యమో, దైవంలో నమ్మకమో, అపనమ్మకమో, మతపరంగా రాజకీయంగా లేదా మరొకరకంగా ఒక ప్రత్యేక తెగకు చెందడమోనన్న సమస్యా?

జీవితమనే సమస్యను మొత్తంగా చూస్తున్నావా? లేదా? ఒక ప్రత్యేకమయిన సమస్యను తీసుకుని, మీ జీవితాన్ని, మీ శక్తిని, ఆలోచనను మొత్తం దానికే యిస్తున్నారా? జీవితాన్ని మనం ఒక మొత్తంగా తీసుకుంటామా? వత్తిడులతో, మత నమ్మకాలతో, పిడివాదాలతో, దేశ విభజనలతో, జాతి వైషమ్యాలతో తీసుకురాబడిన నిబద్ధత జీవితంలో వున్నది. జీవితమంటే, యీ భయం, ఈ ఆందోళన, ఈ అనిశ్చితి, ఈ హింస, ఈ వ్యధ. జీవితంలో ప్రేమ, సుఖం, లైంగికత, మరణము ఉన్నాయి. జీవితంలో అసలు సత్యమనేది ఉన్నదా? కొండలకు ఆవలగా ఏదో ఉన్నదా? ధ్యానంతో కనుగొనగల్గేది ఉన్నదా? ఈ ప్రశ్నను నిరంతరం మనిషి అడుగుతూనే వున్నాడు. మనం రోజువారీ జీవితాన్నే పట్టించుకున్నందువలన దీనికి సరైన సమాధానం లేదని ఒక ప్రక్కకు నెట్టేయలేము. నిత్యమైన విషయము. కాలరహిత సత్యము ఏదయినా ఉన్నదేమో మనం తెలుసుకోవాలి. ఇదంతా ఒక సమస్య. ఇదొక ప్రత్యేక సమస్య. పరిశీలించితే సమస్యలన్నీ పరస్పర సంబంధితములని తెలుసుకుంటారు. ఇక సమస్యను మీరు పూర్తిగా అర్థం చేసుకుంటే అప్పుడు సమస్యలన్నింటినీ అర్థం చేసుకున్నట్లే.

ఈ జీవితపటాన్ని మనుషులుగా చూస్తుంటే భయం మనకున్న పెద్ద సమస్యల్లో ఒకటని పిస్తుంది. ఒక ప్రత్యేకమయిన భయంగాదు. భయం, జీవించడమనే భయం. మరణించడమనేభయం. నెరవేర్చేశక్తిలేదన్న భయం. ఓటమిభయం. నియంత్రించ బడతాను. అణచబడతాను అన్న భయం. అభద్రతాభయం, మరణభయం, ఒంటరితనమనేభయం, ప్రేమింపబడనన్న భయం, భయమెక్కడుంటే కలహ మక్కడుంటుంది. తానెప్పుడు భయపడతాడో అప్పుడు చాలా చురుకుగా అవుతాడు. భయాన్నుండి తప్పించుకోవడానికి మాత్రమే గాదు. ఆ భయం దౌర్జన్యపూరితమైన క్రియలను తెచ్చిపెడుతుంది. మీకు చూడాలన్న ఆసక్తి వుంటే దీనిని మీతో చూడగలరు. పెద్ద జీవిత సమస్యలలో భయమొకటి దానినెలా పరిష్కరించడము? చేతనా స్థాయిలోనేగాక, మనసులో దాగిన, రహస్య పొరలలో గూడా లేకుండా, భయమెప్పటికీ లేకుండా మనిషి స్వతంత్రుడవగలడా? ఆ భయాన్ని విశ్లేషణ ద్వారా పరిష్కరించాలా? పారిపోతూ ఆ భయాన్ని తుడిచిపెట్టవచ్చా? కనుక ఇదీ ప్రశ్న. జీవితమంటే భయపడుతున్న మనసు గతము, వర్తమానము భవిష్యత్తులంటే భయపడుతున్న మనసు - అటువంటి

మనసు భయాన్నుండి పూర్తిగా ఎలా విడుదలవుతుంది. క్రమేణా కొంత కొంతగా స్వతంత్రమవుతుందా? సమయం తీసుకుంటుందా? చాలారోజులు, చాలా సంవత్సరాల సమయాన్ని మీరు తీసుకుంటే ముసలి వారవుతారు. అయినా భయం కొనసాగుతుంది.

కనుక భయాన్నుండి భౌతిక భయాన్నుండేగాదు, మానసిక భయాన్నుండిగూడా, మనసులోని భయ నిర్మాణం మొత్తాన్నుండి మనసెలా విడుదలవుతుంది? భయం మొత్తంగా తుడిచిపెట్టవలసినదా? అప్పటికప్పుడు తక్షణమే విడుదలవడమా? క్రమ క్రమంగా భయాన్ని అర్థం చేసుకుంటూ కొంచెం కొంచెంగా వదిలివేయాలా? అది మొదటి ప్రశ్న. సమయాన్ని తీసుకుంటూ విశ్లేషణద్వారా, అంతరంగ పరిశీలనద్వారా క్రమంగా భయాన్ని పోగొట్టుకోవచ్చని ఆలోచించడానికి నిబద్ధమయిన మనసు ఆ విధంగా క్రమేణా భయాన్నుండి విడుదలవగలదా? అది సంప్రదాయక విధానము. హింసాత్మకంగా వున్న మనుషుల కుండే అహింసా సిద్ధాంతంలాగా వుంటుందిది. 'మనసు ఎంతమాత్రమూ హింసాపూరితంగా ఉండనప్పుడు క్రమంగా మేము అహింసాస్థితిలోకి వస్తాము' అని వారంటారు. అది సమయం తీసుకుంటుంది. బహుశా పది సంవత్సరాలు, బహుశా ఒక జీవితకాలమంతా. ఈ మధ్యలో మీరు హింసాపూరితంగా హింసాబీజాలను నాటుతూ వుంటారు. కనుక మరొక మార్గము వుండితీరాలి. దయచేసి ఇది వినండి. తక్షణమే హింసను వర్జించడానికి తగిన మార్గము వున్నది. సమయం తీసుకునీ గాదు, విశ్లేషణ ద్వారానూ గాదు. లేకుంటే మనుషులుగా మన మిగిలిన జీవితాలలో గూడా హింసాపూర్వకంగానే గడపవలసి వస్తుంది. గత్యంతరంలేదు. అదేవిధంగా భయం పూర్తిగా అంతమవగలదా? మనసు మొత్తం భయాన్నుండి స్వతంత్రమవగలదా? తన జీవిత చరమాంకంలోగాదు - ఇప్పుడు.

ఆ ప్రశ్న మీకు మీరు వేసుకున్నారేమో నాకు తెలియదు. మీరు వేసుకుని వుంటే బహుశా 'అది చేయలేము' లేదా అదెలా చేయాలో 'నాకు తెలియదు' అని మీరంటారు. అందుచేత మీరు భయంలోనే బ్రతుకుతారు. హింసతోనే జీవిస్తారు. ధైర్యాన్నో లేదా ప్రతిఘటననో లేదా అణచివేతనో లేదా పారిపోవడాన్నో అలవరచుకుంటారు. అహింసా సిద్ధాంతాన్ని ఆచరించే ప్రయత్నం చేస్తారు. సిద్ధాంతాలన్నీ మూర్ఖమయినవే. ఒక భావాన్ని మీరు వెంటాడితే మీరక్కడ 'ఉన్నదాని'నుండి తప్పుకుంటున్నట్లు. భయాన్ని అర్థం చేసుకోవడంలో ప్రథమమైనది పారిపోకుండా ఉండడము. చాలా కష్టమయిన వాటిలో అదొకటి. సమయం తీసుకుంటుంది. గనుక విశ్లేషణద్వారానో, లేదా మత్తుపానీయంతోనో, చర్చికి వెళ్ళడంతోనో, మిగిలిన వివిధ కార్యకలాపాలతో, పలాయనమవడానికి ప్రయత్నించకపోవడము. మత్తుపానీయంతో పలాయనం చేసినా, మాదకద్రవ్యంతో చేసినా, లైంగికంగా పలాయనమయినా, దైవమంటూ పలాయనం చేసినా ఒక్కటే. కనుక తాను పారిపోకుండా ఉంటాడా? భయమంటే ఏమిటి? అర్థం చేసుకోవడంలోనూ, భయాన్ని కరిగిపోనీయడంలోనూ దానినుండి పూర్తిస్వేచ్ఛతో ఉండడంలోనూ వున్న ప్రప్రథమ సమస్య అది.

స్వేచ్ఛ కావాలని మనలో చాలామందికి లేదని మీకు తెలుసు. ఒక ప్రత్యేకమయిన విషయాన్నుండి ఆ క్షణంలోని వత్తిడులనుండి లేదా తొందరపెడుతున్న కోరికలనుండి మనం స్వతంత్రులమవ్వాలనుకుంటాము. అయితే స్వేచ్ఛ అనేది పూర్తిగా వేరు. విచ్చల విడితనము, నీకు నచ్చినది చేయడం స్వేచ్ఛ గాదు. అమితమయిన క్రమశిక్షణ నాసిస్తుంది స్వేచ్ఛ. అది వీర జవానుకున్న క్రమశిక్షణో, అణచివేతతో కట్టుబాటుతో ఉన్న క్రమశిక్షణో కాదు. ఆంగ్లంలో 'క్రమశిక్షణ' అన్నపదానికి అర్థం 'నేర్చుకోవడము'. ఆ 'నేర్చుకోవడము' నేర్చుకుంటున్నదేమిటనిగాక, ఏదయినా నేర్చుకోవడానికి శిక్షణగావాలి. నేర్చుకోవడమే క్రమశిక్షణ. ముందు నిన్ను నీవు క్రమశిక్షణలో ఉంచుకున్న తర్వాత నేర్చుకోవడము గాదు. నేర్చుకోవడమనే ఆ చర్యే క్రమశిక్షణ. అదే మొత్తం అణచివేత నుండి మొత్తం అనుకరణనుండి స్వేచ్ఛ కలిగిస్తుంది. కనుక భయాన్నుండీ దానినుండి ఉత్పన్నమయిన హింసనుండి, దానినుండి వెలువడే యీ మతపర జాతీయ విభజనలన్నింటి నుండీ, నా కుటుంబం, మీ కుటుంబం అనబడే వాటన్నింటి నుండీ మీరు స్వేచ్ఛనొందగలరా?

భయమనేది తనకెప్పుడు తెలుస్తుందో అప్పుడది భీతిని గొల్పుతుంది. అప్పుడు అంతా చీకటిమయమైపోతుంది. ప్రతిదానినీ తెలియకుండా చేస్తుంది, స్పష్టత ఉండదు. భయపెడుతున్న మనసు జీవితమంటే ఏమిటో, వాస్తవ సమస్యలేమిటో చూడలేదు. కనుక భయాన్నుండి భౌతిక అంతరంగ భయాలనుండి తాను యదార్థంగా స్వేచ్ఛ నొంద గలడేమోనని తనను ప్రశ్నించుకోవడమే ప్రప్రథమమయినదని నా కనిపిస్తుంది. ఒక భౌతిక ప్రమాదము సంభవించినప్పుడు మీరు ప్రతిస్పందిస్తారు. అ తెలివి. అది భయం కాదు. లేకుంటే మిమ్మల్ని మీరు నాశనం చేసుకుంటారు. కానిమాన భయాలున్నప్పుడు - రేపటిగురించి భయము. తాను చేసినదేమిటోనన్న భయవ వర్తమానాన్ని గురించిన భయము ఉన్నప్పుడు అక్కడ తెలివి పనిచేయదు. మానసికంగ అంతరంగంలో దీని లోనికి తాను వెళ్తే మన సామాజిక నిర్మాణం మొత్తం సుఖమనే సూత్రం మీదనే ఆధారపడిందని తనకు తానే కనుగొంటాడు. ఎందుకంటే, మనలో చాలా మందిమి కోరుకుంటున్నది సుఖాన్ని. సుఖంకోసం ఎక్కడ ప్రయత్నముంటుందో అక్కడ భయం కూడా వుంటుంది. సుఖాన్ని వెన్నంటి భయముంటుంది. మీరు దీనిని పరీక్షించితే చాలా స్పష్టంగా కన్పిస్తుంది.

భయాన్నుండి సంపూర్తిగా మనసు ఎలా స్వేచ్ఛనొంది అన్నింటినీ చాలా స్పష్టంగా చూడగలుగుతుంది? పూర్తిగా తనను విడిపించుకునే మనసున్నదా అనేది మనం కనుగొనబోతున్నాము. మీకు ప్రశ్న అర్థమయిందా? హింసను, యుద్ధాన్ని ఒక జీవిత విధానంగా అంగీకరించినట్లు మనం భయాన్ని అంగీకరించి దానిలోనే జీవించాము. మనకు వేలకు వేల యుద్ధాలొచ్చాయి. అంతులేకుండా మనం శాంతిగురించి మాట్లాడుతాము. మనం జీవిస్తున్నరీతిమాత్రం యుద్ధము, యుద్ధరంగము, ఘర్షణ. అది తప్పదు అనుకుంటాము. మనం సంపూర్ణశాంతితో అంటే ఏ రకమయిన ఘర్షణ లేకుండా జీవించగలమా? అని మనమెప్పుడూ ప్రశ్నించుకోము. మనలోనున్న వైరుధ్యము వలన ఘర్షణ కలుగుతుంది. అది ఎంతో సులభము. మనలో పలురకాలైన పరస్పర

విరుద్ధమైన కోరికలు కలగటము, కొన్ని కావాలి, కొన్ని వద్దు అనే వత్తిళ్ళు యీ ఘర్షణను తెస్తాయి. వీటన్నింటినీ మన జీవనంలో భాగంగా తప్పవంటూ అంగీకరించాము. మనమెప్పుడూ వాటిని ప్రశ్నించలేదు.

యదార్థతత్వము అంటే కాలరహితమయిన స్థితి ఉన్నదేమో కనుగొనడానికి మొత్తం నమ్మకాన్నుండి, భయం మొత్తాన్నుండి తాను స్వేచ్ఛనొందాలి. అది కనుగొనడానికి స్వేచ్ఛ అవసరము. భయాన్నుండి, దురాశనుండి అసూయనుండి అత్యాశనుండి పోటీనుండి మూర్ఖత నుండి స్వేచ్ఛ అవసరము. అప్పుడు మాత్రమే మనసు ఎటువంటి జటిలత ఘర్షణలేకుండా స్పష్టంగా వుంటుంది. అటువంటి మనసే నిశ్చలంగా వుంటుంది. నిశ్చలంగా ఉన్న మనసే అనంతమయినదానిని నామరహితమయినదానిని కనుగొన గలదు. అయితే ఏరకమయిన సాధన ద్వారానూ, ఎటువంటి క్రమశిక్షణతోనూ నీవు అటువంటి నిశ్చలస్థితికి రాలేవు. స్వేచ్ఛ ఉన్నప్పుడు ఆందోళన, భయము మూర్ఖత్వము, హింస, అసూయ - వీటన్నింటినుండి స్వేచ్ఛ ఉన్నపుడే నిశ్చలత వస్తుంది. కనుక మనసు స్వేచ్ఛనొందగలదా? కొంతకొంతగాగాదు. పది సంవత్సరాలలోనో, ఏభయి సంవత్సరాలలోనో గాదు - తక్షణమే.

నాకేమనిపిస్తున్నదంటే ఆ ప్రశ్నను మీరు వేసుకుని ఉంటే అందుకు మీ సమాధాన మేమవుతుంది? మీరు అది సాధ్యమనో, కాదనో చెప్తారా? మీరది అసాధ్యమని చెప్తే మిమ్మల్ని మీరు అడ్డుకున్నట్లే. ముందుకు సాగలేరు. మీరు సాధ్యమని అంటే అందుకు గూడా ఒక ప్రమాదమున్నది. మీకేది అసాధ్యమో తెలిస్తేనే మీరు సాధ్యతను పరీక్షించగలరు. సరేనా? మనను మనం ఒక బ్రహ్మాండమయిన ప్రశ్నవడుగుతున్నాము. అదేమంటే సంవత్సరాల తరబడీ రాజకీయంగానూ, ఆర్థికంగానూ, వాతావరణ ప్రభావంతోనూ, చర్చి ప్రభావంతోనూ, యితర ప్రభావాలతోనూ నిబద్ధమయిన మనసు, అటువంటి మనసు తక్షణమే మారగలదా? లేకుంటే అందుకు సమయం కావాలా? రోజుల తరబడి విశ్లేషించాలా? చొచ్చుకుపోవాలా? వెలికితీయాలా? వెతకాలా? ఒక విప్లవానికి ఒక సంపూర్ణ మార్పు జరగడానికి కొంతకాలం, సమయం అవసరమనడము మనకున్న నిబద్ధతలలో ఒకటి. మనం సంపూర్ణంగా మారవలసిన అవసరమున్నది. అది గొప్ప విప్లవము. బాంబులు వేసి ఒకరినొకరము చంపుకోవడముగాదు. మనసు తక్షణమే తనను మార్చుకోగలిగి, మరురోజుకు పూర్తిగా భిన్నంగా వుండడమన్నది గొప్ప విప్లవం. బహుశా అటువంటిది సాధ్యమవదని మీరు చెప్తారు. ఏ విధంగానూ, పారిపోకుండా నీవా ప్రశ్నను వాస్తవంగా ఎదుర్కోని 'అది సాధ్యం కాదు' అని చెప్పేటంతవరకూవస్తే అప్పుడు సాధ్యపడేదేదో కనుగొంటావు. అయితే, ఏది సాధ్యం కాదు? గ్రహించకుండా ఏది సాధ్యమవుతుంది?' అని మీరు ప్రశ్నించలేరు. మనము ఒకరినొకరము అర్థం చేసు కుంటున్నామా?

కనుక భయపడుతున్న మనసు హింసాత్మకంగా, కలహాశీలిగా నిబద్ధమయిన మనసు తక్షణమే తనను తాను మార్చుకోగలదా? అని మనం ప్రశ్నిస్తున్నాము. విశ్లేషణతో

సాధ్యంగాదని అది వ్యర్థమని మీరు గ్రహించినప్పుడే ఆ ప్రశ్ననడుగగలరు. దయచేసి యిది గ్రహించండి. విశ్లేషణ అంటే విశ్లేషకుడు అంటే విశ్లేషణ చేసేవాడు. అది వృత్తిరీత్యా విశ్లేషించుకుంటున్నప్పుడు అందులో ఎన్నో విషయాలు యిమిడివుంటాయి. ముందు విశ్లేషకుడు విశ్లేషిస్తున్నదానికి వేరుగా వున్నాడా? అతడు వేరా? మీరు పరిశీలన చేస్తున్నప్పుడు విశ్లేషకుడే విశ్లేషింపబడుతున్నది. అక్కడ విశ్లేషకునికి విశ్లేషింపబడుతున్న దానికి భేదం లేదు. ఆ విషయాన్ని మనం గ్రహించాము గనుక విశ్లేషించడమారంభిస్తాము. నాకు కోపం, నాకు ఈర్ష్య అని చెప్తాము. నేనెందుకు ఈర్ష్యపడుతున్నాను. ఈర్ష్యకు, కోపానికి, మూర్ఖత్వానికి కారణాలేమిటి? అని విశ్లేషించనారంభిస్తాము. విశ్లేషిస్తున్నదానితో అతడు విశ్లేషకుడు భాగమే. పరిశీలకుడే పరిశీలింపబడేది. తానది చూసినప్పుడు దాని వ్యర్థతను చూసినప్పుడు విశ్లేషణ తిరిగి చేయడెప్పటికీ. దీనిని గ్రహించడం, దీనిలోనున్న సత్యాన్ని వాస్తవంగా చూడడం చాలా ముఖ్యము. మాటల్లో చూడడముగాదు. శాబ్దికమయిన అవగాహన, అవగాహనేకాదు. విశ్లేషకుడు అంటే పరిశీలకుడే పరిశీలింపబడేది అన్న వాస్తవాన్ని చూడడము ఒక గొప్ప యదార్థము, ఒక గొప్ప సత్యము. అందులో విశ్లేషకుడు విశ్లేషింపబడేది అన్న విభజన లేదు గనుక ఘర్షణా లేదు. విశ్లేషకుడు తాను విశ్లేషిస్తున్న వాటికి వేరుగా వున్నప్పుడు మాత్రమే ఘర్షణ వుంటుంది. ఈ విభజనలో ఘర్షణ వుంటుంది. మీరు గ్రహిస్తున్నారా? బహుశా మీరు తర్వాత ప్రశ్నిస్తారు.

మన జీవితమొక ఘర్షణ. ఒక యుద్ధరంగం. కాని స్వేచ్ఛనొందిన మనసుకు ఘర్షణ లేదు. ఘర్షణ నుండి స్వేచ్ఛ నొందడమంటే పరిశీలకుడి, విశ్లేషకుడి, ఆలోచిస్తున్నవాని యదార్థతను పరిశీలన చేయడము. అక్కడ భయమున్నది. 'నేను భయపడుతున్నాను' అని పరిశీలకుడంటాడు. దయచేసి కొంచెమయినా దీనిని గ్రహించండి దీని అందాన్ని మీరు చూస్తారు. కనుక అక్కడ పరిశీలకుడు, పరిశీలింపబడేది అన్న విభజన వున్నది. పరిశీలకుడప్పుడు స్పందించి 'నేను భిన్నంగా వుండాలి' అంటాడు. 'భయం లేకుండా పోవాలి' అంటాడు. భయానికి, కారణాన్ని వెతుకుతాడు. అలాంటివి చేస్తాడు. కాని పరిశీలకుడే పరిశీలింపబడేది. విశ్లేషకుడే విశ్లేషింపబడేది. దానిని మాటలను మించి గ్రహించినప్పుడు భయమనే యథార్థం పూర్తి మార్పుకు లోనవుతుంది.

సరే, చూడండి. ఇది మార్మికమయినదిగాదు. మీరు భయపడ్డారు. మీరు హింసా పూరితులు. మీరు శాసింపబడ్డారు. చాలా సులభమయిన విషయాన్ని తీసుకుందాం.

మీకు ఈర్ష్య, అసూయ. ఈర్ష్య అంటున్న ఆ అనుభూతికి భిన్నంగా అతడు, పరిశీలకుడు ఉన్నాడా? అతడు భిన్నమయితే ఈర్ష్య గురించి ఒక చర్యను చేపట్టగలడు. ఈ చర్యే ఘర్షణవుతుంది. ఈర్ష్య పడుతున్న సత్యమే ఈర్ష్య అయినపుడు అప్పుడతడేమి చేయగలడు? నాకు ఈర్ష్య. ఈర్ష్య 'నా'నుండి వేరుగా వున్నంతవరకు నేను ఘర్షణ స్థితితో వున్నాను. ఈర్ష్యే నేనయినప్పుడు నా నుండి వేరుగానప్పుడు, నేనప్పుడేమి చేస్తాను? అది నేనంగీకరించను. నాకు ఈర్ష్య అంటాను. అది ఒక యదార్థము. దానిని నేను తప్పించుకోను. దాని నుండి పరుగెత్తిపోను. అణచివేసే ప్రయత్నమూ నేను చేయను.

నేనేది చేసినా అది ఒక రకమయిన ఈర్ష్యే. కనుక ఏమి జరుగుతుంది? క్రియాశూన్యతే పూర్ణక్రియ. పరిశీలకుడే పరిశీలింపబడుతున్నదయిన తరుణంలో ఈర్ష్య గురించిన క్రియాశూన్యతలో ఈర్ష్య అంతమవుతుంది. దీనిని మీరు గ్రహిస్తున్నారా? మన మొకరికొకరము అర్థమవుతున్నామా?

**ప్రేక్షకులు:** అవును.

**కృష్ణమూర్తి:** తొందరపడి 'అవును' అనకండి. ఇది చాలా కష్టమయినది (నవ్వులు). ఎందుకంటే, మీరిది నిజంగా అర్థం చేసుకుని వుంటే ఈర్ష్య నుండి మీరు స్వేచ్ఛ నొందుతారు. తిరిగి ఎప్పటికీ ఈర్ష్య పడరు. అందుకే అంతరంగంలో జరుగుతున్న ఈ సంఘర్షణ, యీ పోరాటం మొత్తాన్ని, హింసారూపంలో బయటపడుతున్న యీ పోరాటం మొత్తాన్ని అర్థం చేసుకోవడం చాలా ముఖ్యమయినది. కనుక మనసు ఈర్ష్య అంటే అసూయ నుండి పూర్తిగా బయటపడగలదా? పరిశీలకుడే పరిశీలింపబడేదన్న సత్యాన్ని దానితో అక్కడ విభజన లేదని గ్రహించినప్పుడు మాత్రమే మనసు స్వేచ్ఛ నొందగలదు. మీ కర్థమయిందా?

సరే, చూడండి. మనుషులమధ్య, పొరుగువారిమధ్య, యిత్యాది వాటిమధ్య సంబంధమని మనమంటున్నవాటిలో వున్నది ఘర్షణ. ఉన్నది ఉన్నట్లుగానయితే సంబంధము అంటే ఘర్షణ. అవునా? అది కొంత స్పష్టమయిందనుకుంటాను. మన యిరువురి మధ్య, ప్రపంచమంతటా మానవుల మధ్య ఉన్న సంబంధాలు మన గురించి, ఇతరుల గురించి ఏర్పరచుకున్న ఊహారూపాలపై ఆధారపడ్డాయి. భర్త, భార్య గురించి, భార్య భర్త గురించి ఊహారూపాలను, సుఖము, బాధ, అవమానము, గొణగడము, ఆధిక్యత, ఈర్ష్య, చికాకులతోనున్న ఊహారూపాన్నేదయినా ఏర్పరచుకుంటారు. క్రమంగా, ఎన్నో సంవత్సరాలుగా భార్యగురించో, లేకుంటే భర్తగురించో ఒక ఊహారూపాన్నేర్పరచు కోవడం జరుగుతుంది. సంబంధం ఈ రెండు ఊహారూపాలకూ మధ్యన. సంబంధ మేమంటే, నిజంగా పరస్పరం కలిసిపోవడము. సంబంధం కలిగి వుండటమంటే ఒకరికొకరము దగ్గరగా వుండటం. మీకతని గురించి ఒక వూహారూపముంటే మీరతనితో సంబంధంలో లేరన్నది స్పష్టము. కనుక ఒక్క ఊహారూపమూ లేకుండా సంబంధంలో జీవించడము సాధ్యపడుతుందా? మనము సంబంధంలో లేము. కనుక సంబంధము ఘర్షణను తెస్తున్నది. మన సంబంధము వూహారూపాలమధ్య ఉన్నది. ఊహారూపాన్ని తయారు చేయడం మొత్తాన్నుండి మనసుకు స్వేచ్ఛ వుండడము సాధ్యమా? మీకు ప్రశ్న అర్థమయిందా?

అదెలా సాధ్యమో నేను మీకు చూపుతాను. మాట వరుసకు అంగీకరించవద్దు. చేయండి. సంబంధమంటే ఏమిటో వాస్తవంగా మీరప్పుడు చూస్తారు. సంబంధంలో ఉండడము చాలా అసాధారణమయినది. అప్పుడక్కడ బాధలేదు. ఘర్షణలేదు. దేశాధ్యక్షునిగురించి, మీ భార్యగురించి, మీ పొరుగువారిగురించి, దైవాన్నిగురించి, దేనిగురించి అయినా యీ ఊహారూపాల నేర్పరస్తున్న యంత్రాంగమేమిటి? మన గురించి మరొకరిగురించి ఉన్న యీ ఊహారూప నిర్మాణమేమిటి? దాని స్వభావ మేమిటి? నేను

వివాహితుడినయితే నేను కాదనుకోండి. నా భార్యగురించి ఒక ఊహారూప మేర్పరచుకుంటాను. ఆమె ఏమి చెప్పిందో, ఏమిచేసిందో ఆమెనాకిచ్చిన లైంగికసుఖాల గురించో, మరొక సుఖాన్నిగురించో. భయాలు, ఆధిక్యత, సతాయింపు అన్నింటిగురించి క్రమేణా దినదినము, నేనామెనుగురించి ఊహారూపమేర్పరచుకున్నాను. ఆమె నా గురించి ఒక ఊహారూపమేర్పరచుకున్నది. ఇది యదార్థము. ఊహకాదు. ఈ ఊహా రూపాలనుండి నేను స్వేచ్ఛనొందగలనా? అని నేనిప్పుడడుగుతున్నాను. చెప్పిన దేదయినా, కోపంలోనయినా, అసూయలోనయినా, చికాకులోనయినా, పొగడ్తలోనయినా లేదా ఒక అవమానంగానయినా అది చెప్తున్న క్షణంలో మీరు పూర్తి ఎరుకతో వుంటేనే అవమానింపబడినా, దానిలోని సత్యాన్ని మీరు చూసి స్వేచ్ఛనొందగలరు. అంటే, మనసు పూర్తిగా సావధానమయి వుండాలి. ఆ విధంగా వుంటే ఒక ఊహారూపాన్నేర్పరచే సుఖము లేదా బాధ గురించిన ఒక ప్రత్యేక అనుభవాన్ని నిలుపుకోరు. అంటే భార్యగానీ, భర్తగానీ ఉత్సాహంగానో, అప్రియంగానో ఏదయినా చెప్తున్నప్పుడు సావధానంగా ఉంటారు. ఆ అవధానత, ఎంపికలేని ఆ ఎరుక చూడడానికి, చెప్తున్నదానిలో నిజానిజాలను తేల్చి చూడడానికి స్వేచ్ఛనిస్తుంది. మనసు దానినింక జ్ఞాపకంగా నమోదు చేయదు. మీరది ప్రయత్నించారేమో నాకు తెలియదు.

బహుశా చేసి వుండరు. మనసు అసాధారణమయిన ఉత్సాహంతో చురుకుదనంతో సున్నితంగా వుంటుంది. జీవితంలోని పెద్ద సమస్యలలో ఒకటయిన సంబంధం అప్పుడు భిన్న అర్థంలో వుంటుంది. అప్పుడు సంబంధమంటే ఊహారూప మన్నది లేనిప్రేమ అనే సౌందర్యము. 'నిన్ను ప్రేమిస్తున్నాను' అని ఎంత ఎక్కువగా చెప్పినా అక్కడ ప్రేమ లేదు. ప్రేమంటే పూర్తి భిన్నంగా వుంటుంది. ప్రేమంటే సుఖం కాదు. కోరికకాదు. ప్రేమనర్థం చేసుకోవడానికి సుఖాన్నర్థం చేసుకోవాలి. సుఖంతోపాటు భయము, బాధ వుంటాయి. ఒకటి లేకపోతే మరొకటుండదు.

కాబట్టి అవన్నీ మన సమస్యలు. అవన్నీ ప్రతి మనిషికీ ఉన్న సమస్యలు. సంపన్న దేశాలలో నివసిస్తున్న మనిషయినా, అనాగరిక సమాజంలో నివసిస్తున్న మనిషయినా బాధపడుతున్నాడు. మనిషి దు:ఖంలో వున్నాడు. మన సమస్య, మన ప్రశ్న ఏమంటే మనసు సంపూర్ణంగా మార్చుకోగలదా? దానితో ఏదయితే విప్లవమో, ఆ మానసిక విప్లవాన్ని లోతులనుండి తీసుకురాగలదా? ఆ విప్లవం పూర్తిగా భిన్నమయిన సమాజాన్ని, భిన్నమైన సంబంధాన్ని, భిన్నమైన జీవిత విధానాన్ని తీసుకురాగలదు.

మీరేమయినా ప్రశ్నించాలనుకుంటున్నారా? ప్రశ్నించడం చాలా కష్టమయిన విషయాలలో ఒకటని తెలుసా? అడుగవలసిన ప్రశ్నలు మనకు వెయ్యి వుంటాయి. ప్రతి విషయాన్ని సందేహించాలి. ఏదయినా వినయంగా అంగీకరించకూడదు. మనకు మనమే తెలుసుకోవాలి. సత్యాన్ని మనమే చూడాలి. ఇతరులద్వారాగాదు. ఆ సత్యాన్ని చూడాలంటే తాను పూర్తి స్వేచ్ఛతో వుండాలి. సరయిన సమాధానాన్ని తెలుసుకోవడానికి సరయిన ప్రశ్న అడగాలి. ఎందుకంటే, మీరడిగిన ప్రశ్న తప్పయితే అందుకునే

సమాధానమూ తప్పవుతుంది. కాబట్టి సరయిన ప్రశ్ననడగడము చాలా కష్టమయిన విషయాలలో ఒకటి. అంటే వక్త మిమ్మల్ని ప్రశ్నించకుండా నిరోధించడం లేదు. మీ ప్రశ్నలు ఎంతో గంభీరంగా, లోతుగా వుండాలి. ఎందుకంటే జీవితం బ్రహ్మాండమైన ఎంతో గాంభీర్యంతో ఉంటుంది. అటువంటి ప్రశ్న నడుగుతున్నారంటే అప్పటికే తెలుసుకుని ఉంటారు. మీ లోతులలోనికి అప్పటికే వెళ్ళివుంటారు. కాబట్టి ప్రజ్ఞాశీలియై తనను తాను తెలుసుకునే మనసు సరిగ్గా ప్రశ్నించగలదు. ఆ ప్రశ్నలోనే సమాధానమూ వున్నది. దయచేసి నవ్వవద్దు. ఇదెంతో గంభీరమయింది. ఏమి చేయాలో చెప్పమంటూ ఎప్పుడూ ఎవరో ఒకరి వంక మీరు చూస్తారు. ఇతరుల వెలుగులో మన దీపాన్ని వెలిగించుకోవాలని మనం చూస్తుంటామెప్పుడూ. మనకు మనం ఎప్పటికీ వెలుగు అవము. మనకు మనం వెలుగు కావాలంటే మన సాంప్రదాయాన్నుండి అధికార మంతటి నుండి, అందులో వక్తనుండి గూడా స్వేచ్ఛనొందాలి. అప్పుడు మన మనసులు చూడగలవు. పరిశీలించగలవు. నేర్చుకోగలవు. నేర్చుకోవడం చాలా కష్టమయిన వాటిలో ఒకటి. కాబట్టి ప్రశ్నించడం కొంత సులభము. సరయిన ప్రశ్ననడిగి సరయిన సమాధానాన్ని పొందడం పూర్తిగా భిన్నమయి వుంటుంది. సరే, యిప్పుడున్న ప్రశ్నేమిటి? (నవ్వులు)

ప్రా: నేనొక ప్రశ్నను తయారుచేసుకుని రాత్రి ఇక్కడకు వచ్చాను. మీరు మాట్లాడుతున్నప్పుడు దానిని వదిలేశాను. ఎందుకంటే మీరు చూపుతున్న వాటిని నేను చూడనారంభించినందువలన. గాంధీగారిగురించి ప్రశ్నించాలనీ, మీ అభిప్రాయమడగాలని అనుకున్నాను. ఇప్పుడు నాకు మరొక ప్రశ్న వున్నది.

కృ: ఏమిటండీ?

ప్రా: వింటున్నవారికి కొందరికి యిది కష్టమనిపించవచ్చు.

కృ: మీరు అనుకున్నదేదయినా అడగవచ్చునండీ.

ప్రా: పరికరం సరిగా పనిచేయక వెనుక కూర్చున్నవారు వినలేకపోతుంటే ఆ పరిస్థితుల్లో మీవంటి అనుభవశీలి ఏమి చేస్తాడా అనిపిస్తున్నది. మీకు స్వల్పంగా భయమనిపించిందేమోనని నాకాశ్చర్యమవుతున్నది.

కృ: పెద్దగా విన్పింపజేసేవి సరిగా పనిచేయనప్పుడు నేను భయపడ్డానేమోనని ప్రశ్నిస్తున్నారు. నేనెందుకు భయపడడము? అది యంత్రాంగంలోనున్న పొరపాటు. నా గురించి నేనెందుకు మధన పడడం? అక్కడ భయపడలేదే అని భయపడుతున్నాను. (నవ్వులు) చూడండి. గౌరవనీయులు గాంధీగారి గురించి లేదా 'ఒక ఎక్స్', 'ఒక వై, 'ఒక జెడ్' గురించి మీ అభిప్రాయమేమిటని అడిగారు. కేవలం మూర్ఖులు మాత్రమే మరొకరిగురించి అభిప్రాయాలనేర్పరచుకుంటారు. మరొకరిగురించి అభిప్రాయాన్నెందుకు ఏర్పరచుకోవాలి? ఇదెంతో కాలాన్ని, శక్తిని వృధా చేస్తుంది. తన మెదడును, మనసును, అభిప్రాయాలతో, తీర్పులతో, నిర్ణయాలతో నింపడమెందుకు? అవి స్పష్టతను నిరోధిస్తాయి. మనమొక నిర్ణయంతో పరిశీలిస్తే స్పష్టత కొరవడుతుంది.

ప్రా: మన మనసు నిర్మలంగా వుంటుంది. ప్రత్యక్షంగా గ్రహిస్తున్నపుడు ఏ ఆలోచనలతోనూ మునిగిపోదు. తన అంతరంగంలో జరుగుతున్నదేమిటో, భయ పడుతున్నదోలేదో, అతడు చేస్తున్నదేమిటో, అతడిలో జరుగుతున్నదేమిటో ఆలోచిస్తూ ఉండకుండా మనసు అనుభూతి చెందుతుంది.

కృ: నేను సరిగా గ్రహించి వుంటే, ప్రశ్నేమంటే 'మనసంటే ఏమిటి?' అర్థం చేసుకునే యీ మనసంటే ఏమిటి? అర్థం చేసుకుంటున్నది ఆలోచనేనా? సరే, యిదే నా ప్రశ్న.

ప్రా: అవును.

కృ: దీనిని గురించి తరచి చూసి తెలుసుకుందాము. అప్పుడు గ్రహిస్తారు. ఒక దానిని తాను అర్థం చేసుకున్నానని చెప్తే "నేనర్థం చేసుకున్నాను" అని చెప్తున్న ఆ మనసు ఏ స్థితిలో వున్నది? అర్థం చేసుకోవడమనే మాటనే రెండు వేర్వేరు అర్థాలతో వాడవచ్చు. మీరు చెప్తున్న మాటలు నాకర్థమవడము అంటే మాటలు వింటూ వాటి అర్థాన్ని గ్రహించడము. ఎందుకంటే మీరూ, నేనూ యిరువురమూ ఇంగ్లీషులో మాట్లాడు కుంటున్నాము. అర్థమున్న కొన్ని పదాలను వాడతాము. ఆ మాటలను అర్థం చేసుకుంటున్నాము అంటాము. యదార్థంగా అర్థం చేసుకోవడం జరిగితే అదే క్రియ. అందులో అనుభూతీ వుంటుంది. అవధానతా వుంటుంది. నాకది స్పష్టంగా అర్థ మయిందన్నప్పుడు అందులో మొత్తం యిమిడి వున్నది 'నా కర్థమయింది' అని చెప్తున్న మనసు ఏ స్థితిలో వున్నది?

ప్రా: సంపూర్ణమయిన ఎరుక.

కృ: అందులో నికిప్పుడు మరికొంత వెళదామండీ! మనసొక నిర్ణయాన్ని చేస్తూ ఉండనప్పుడు, ఒక అభిప్రాయంతో ఉండనప్పుడు, సావధానంగా వింటున్నప్పుడు ఎరుక ఉండదా? అర్థం చేసుకోవడం జరుగదా? అప్పుడు 'నాకర్థమయింది' అనదా? 'నేను అర్థం చేసుకున్నాను' అంటున్నప్పుడు దానితో తక్షణమే క్రియ జరుగుతున్నప్పుడు ఆ మనసు ఏ స్థితిలో ఉన్నట్లు - అని మనమడుగుతున్నాము. ఆ మానసిక స్థితి తప్పక మౌన స్థితే. అందులో ఏ అభిప్రాయమూ లేదు. మౌనంలో ఒక తీర్పు లేదు. ఒక అంచనా లేదు. అది యదార్థంగా మౌనంలోనుండి వింటున్నది. మనమప్పుడే ఎందులో ఆలోచన ఎంత మాత్రమూ లేదో దానిని అప్పుడు అర్థం చేసుకుంటాము. ఆలోచనంటే ఏమిటో అన్నదానిలోనికి మొత్తం ఆలోచనా ప్రక్రియలోకి మనం వెళ్ళబోవడం లేదు. అందుకు చాలా సమయమవసరము. సందర్భమిది గాదు. అర్థం చేసుకోవడాన్ని గురించి మనం మాట్లాడినప్పుడు మనసుతో అంటే మీ హృదయంతో మీ నాడులతో మీ చెవులతో పూర్తిగా విన్నప్పుడు. సంపూర్ణ అవధానతను దానికిచ్చినప్పుడు అవగాహన తప్పక కలుగుతుంది. మీ పూర్తి అవధానతనుంచినప్పుడు అక్కడుండే సంపూర్ణ మౌనాన్ని మీరెప్పుడయినా గుర్తించారేమో నాకు తెలియదు. ఆ సావధానతలో ఏ హద్దులూ లేవు. ఎరుక లేదా అవధానతలో వున్నాను అనే కేంద్రమూ లేదు. ఆ సావధానత, ఆ మౌనము ఒక ధ్యాన స్థితి. ఆ పదానికి అర్థమేమిటి, ఆ స్థితిలోనికెలా వస్తాము అన్నదానిలోనికి

మనమిప్పుడు వెళ్ళలేము. రాబోయే సాయంకాలాలలో మనకు సమయముంటే అందులోకి వెళదాము.

కనుక ఎప్పుడు మీరు పూర్తిగా, మౌనంతో మరొకరిని వింటున్నారో అప్పుడు కేవలం మాటలనే వినరు. అందించబడుతున్నదాని అనుభూతితో అందులో ఒక్క భాగాన్ని కాక ఆ మొత్తాన్ని వింటారు.

ప్రా: మీరు చెప్పిన దానిలో కొన్ని తీవ్రమైన వైరుధ్యాలను నేను కనుగొన్నాను. మొదటగా 'కేవలం మూర్ఖులే వారి అభిప్రాయాలను చెప్తారు, అది బుద్ధిహీనత' అని మీరు చెప్పారు.

కృ: గౌరవనీయులంటున్నారు, నేను చెప్పినదానికి విరుద్ధంగా నా అభిప్రాయాలను వెలిబుచ్చుతున్నానని, అంచనాలు వేస్తున్నానని. నేను ఒక అభిప్రాయాన్ని, ఒక నిర్ణయాన్ని ఒక తీర్పును యిచ్చానా? 'యదార్థాలను చూడ'మని మాత్రమే నేను చెప్పింది. ఈ యదార్థము మీది గాదు, నాది గాదు. మనిషి హింసాత్మకుడు అన్నది యదార్థం. అదొక అభిప్రాయం గాదు. అదొక యదార్థము. మనిషొక భయపడుతున్న జంతువు. అదొక యదార్థము. మనిషి ఈర్ష్యాపరుడు. సంఘర్షణలో జీవిస్తాడు. అతడి జీవితం ఒక యుద్ధరంగం - యిత్యాదివి. ఇవి నా అభిప్రాయాలు గావు. నా తీర్పులు గావు. మనందరిలో జరుగుతున్నదేదో అదే యిది. మీరెలా దానిని తర్జుమా చేస్తారో, వాటితో ఏమిచేస్తారో, వాటికి కొన్ని సాక్షికవిధానాలను, నిర్ణయాలను అంటగడతారో, అభిప్రాయాలివ్వడ మంటే అవి. అయితే మనకున్న శ్రద్ధ కేవలం యథార్థాల పట్లనే.

ప్రా: నేనిక్కడడుగవలసిన ప్రశ్న ఒకటున్నది. నేర్చుకోవడానికి పునాది ఏమిటన్న దానికి మీరు చెప్తున్నది కష్టంగా వున్నది. మీరొక ప్రత్యేకమైన కష్టమైన పనిలో నిమగ్నులయినట్లు మీరు కనుగొంటారు. ఆ పని చేయాలన్న సంకల్పాన్ని, నమ్మకాన్ని వదిలివేస్తే ఆ పనికి ఆధారమేముంటుంది? మీరెలా కొనసాగిస్తారు?

కృ: నాకర్థమయినదనుకుంటాను. నేర్చుకోవడమంటే ఏమిటి? నేర్చుకోవడమనేది క్రియకు భిన్నంగా వుంటుందా? అని అడుగుతున్నారు. అంతేనా?

ప్రా: కాదు. ప్రశ్న ఏమిటంటే - మీరెందుకు జీవితాన్నో మరణాన్నో ఎన్నుకుంటారు? ఈ కార్యక్రమంలోనే మీరుంటే అది జీవన్మరణ విషయమవుతుంది. మీరు జీవిస్తూ ఉండడానికి అనుమతించే పనిని చేయడానికి కావలసిన శక్తికి మూలమయినదాన్ని మీలో ఎక్కడ కనుగొంటారు?

కృ: నాకర్థమయింది. శక్తినెక్కడ కనుగొంటారు? దానిని మరొక విధంగా పెడుతున్నాను. సవ్యంగా జీవించడానికి శక్తిని మీరెక్కడ కనుగొంటారు? సరేనా?

ప్రా: అవును. మీరొక విషయాన్ని సంకల్పించరు. విభజన లేని నేనుతో మీరాపని చేస్తే దానికై అదే వస్తుంది.

కృ: అదే సరయినది.

ప్రా: (విన్పించలేదు)

కృ: నాకర్థమయిందండీ! అది అంతే. సంకల్పం లేకుండా, వైరుధ్యం లేకుండా, వ్యతిరిక్తములు లేకుండా మీరెలా జీవిస్తారు? అంతేనా? అసలు ఘర్షణే లేకుండా, అదే సమయంలో క్రియ జరుపుతూ మీరెలా జీవిస్తారు?

ప్రా: అవును. కావాలంటే మీరు మరణాన్ని ఎంపిక చేసుకోగలరు.

కృ: మీరు మరణాన్ని ఎంపిక చేసుకోలేరు. మీరు జీవించాలి, కాని....

ప్రా: ఎలాగన్నదే ప్రశ్న.

కృ: ఆగండీ! వైరుధ్యాలు లేకుండా, చురుకుదనంతో, నిరంతరం నేను నేర్చుకునే స్థితిలో వుండటానికి ఏ పద్ధతి, ఏ విధానం సహాయపడుతుంది అని అడుగుతున్నారు. అదే నా ప్రశ్న.

అన్నింటికంటే ముందుగా నేర్చుకోవడమంటే మనమేమనుకుంటున్నాము? నేను ఒక అభిప్రాయాన్ని వెలిబుచ్చడంలేదు. యదార్థాన్ని చూస్తున్నాను. నేర్చుకోవడమంటే జ్ఞానాన్ని ప్రోగుచేసుకునే ప్రక్రియా? ఆ జ్ఞానాన్నుండి నేను క్రియ చేస్తాను. అనుభవాలను, జ్ఞాపకాలను నేను దాచి పెట్టుకున్నాను. అందులోనుండి నేను చేస్తాను. లేదా నేర్చుకోవడమంటే ప్రోగుచేసుకోవడములోని ఒక నిరంతర ప్రక్రియ? దానితో నేర్చు కోవడమే చేయడమా? నెమ్మదిగా సాగండి. మనం అందులోనికి వెళదాము. ముందుగా నేను నేర్చుకుంటాను. తర్వాత నేను నేర్చుకున్నదాని ప్రకారం చేస్తాను. అనిగాదు నేర్చుకోవడమే పని చేయడము. నేర్చుకోవడము. పనిచేయడానికి భిన్నంగా వుండదు. భయం విషయంలో తానేమి చేయాలన్న దానిగురించి ఎలా జీవించాలన్న దాని గురించి నేర్చుకోబోతున్నాడు. ఎలా జీవించాలో చెప్పే విధానం మీకుంటే ' ఈ విధంగా జీవించు' అని చెప్పే పద్ధతి ఉంటే అప్పుడు ఎవరో నిర్ధారించిన ఆ పద్ధతికి మీరు కట్టుబడి వుంటారు. కనుక మీరు నేర్చుకోవడము లేదు. ఒక నమూనాకు కట్టుబడి, దాని ప్రకారం చేస్తున్నారు. అదసలు పనేగాదు. కేవలం అనుకరించడము, పద్ధతులు, విధానాలు ఏమి చేస్తాయో మీరు నేర్చుకున్నప్పుడు పద్ధతులను, విధానాలను ఆవలపెడతారు. అప్పుడు మీరు చేస్తున్న దానినే నేర్చుకుంటారు. జీవితాన్నిగురించి నేర్చుకోవడమే జీవించడమన్న చర్య. సరేనా? దీనిని స్పష్టం చేశానా? జీవించడము, నేర్చుకోవడము, పనిచేయడము యీ మూడూ వేర్వేరు కాదు. అవి విభజించలేనివి.

ప్రా: తనను తాను విశ్లేషించుకోవడమే అవరోధమవుతుందన్న అంశాన్ని నేను గ్రహింపలేకపోతున్నాను. అది కొంచెం కష్టం.

కృ: గంటన్నర తర్వాత మీకు అలసటగా లేదా?

ప్రా: నేనలా అనుకోవడం లేదు.

కృ: ఏ మాత్రము లేదా? ఎందుకు లేదు(నవ్వులు) ఒక్క నిముషం ఉండండి. ఎందుకు లేదు? మీరు సావధానంగా వింటూ వుండివుంటే, అలిసిపోయి వుంటారు. అవలేదా మీరు? నేను మిమ్మల్ని విమర్శించడం లేదు.

ప్రా: నేనలా అనుకోవడం లేదు.

కృ: సరే, వక్త పనిచేస్తున్నాడు. మీరూ అతనితోపాటు ఉండాలంటే మీరూ చేయాలి. అతడు మాట్లాడుతాడు. మీరు వింటారు అని గాదు. ఈ ప్రయాణం యిరువురమూ కలిసి చేస్తున్నాము. మన గురించి, ప్రపంచాన్ని గురించి, ప్రపంచంలో నున్న సంబంధాలేమవుతున్నాయనే దానిగురించి నేర్చుకుంటున్నాము. ఇదంతా నేర్చుకోవడంకోసం, రోజంతా పనిచేసిన మీదట, యిక్కడ కూర్చున్నప్పుడు మీరు అలసిపోతారని తెలుసు. మీరు అలసిపోయుంటారు. అయినా ఫరవాలేదు. ఈ ప్రశ్నలోనికి నేను వెళతాను. తర్వాత ఆపివేద్దాము.

విశ్లేషణ ప్రక్రియలో చాలా విషయాలు యిమిడి వున్నాయని వక్త చెప్పాడు. వీటిలో ఒకటి కాలం. 'విశ్లేషించడ'మంటే ఒక రోజు తర్వాత మరొక రోజు విశ్లేషిస్తూ వెచ్చించడము. రెండవది - విశ్లేషకుడు చాలా జాగ్రత్తగా విశ్లేషించాలి. లేకుంటే అతడు పొరపాటు చేస్తాడు. సరిగా విశ్లేషించడంకోసం ప్రతికూల ధోరణినుండి, నిర్ణయాలనుండి, భయాన్నుండి స్వేచ్ఛనొందాలి. ఈ ప్రక్రియలో ఏదయినా వక్రీకరిస్తే ఆ విశ్లేషణ మరికొన్ని పరిమితులను కల్పిస్తుంది. విశ్లేషకుడు విశ్లేషింపబడుతున్న విషయానికి భిన్నంగా లేడని మనం వివరించుకున్నాము. మీరిదంతా అర్థం చేసుకున్నప్పుడు, దీనిలో కొంత భాగాన్ని గాక అంతా అర్థం చేసుకున్నప్పుడు కాలం, విశ్లేషణా ప్రక్రియ, నిర్ణయాలు, ముగింపులు వీటిలో స్పష్టమయిన విశ్లేషణలతో మరింత ముందుకు సాగకుండా మిమ్మల్ని ఏవి అవరోధిస్తున్నాయో అర్థం చేసుకున్నప్పుడు, విశ్లేషకుడే విశ్లేషింపబడేదని చూసినప్పుడు-దీనిని మొత్తంగా చూసినప్పుడు మీరెప్పటికీ ఒక్కమారుగూడ విశ్లేషించరు. విశ్లేషించనప్పుడు విషయాలను మీరు స్పష్టంగా చూస్తారు. ఎందుకంటే, సమస్య తీవ్రమయినది, అత్యవసరమయినది. ఇదెలా వున్నదంటే అహింసా సిద్ధాంతమున్న ఒక మనిషి తాను అహింసాపరుడెలాగావాలన్న దానిపైన అశ్రద్ధ చూపుతాడుగాని, ఇప్పుడున్న హింసనుండి ఎలా స్వేచ్ఛనొందాలన్న దానిపై శ్రద్ధ చూపడు. హింస నుండి మనకి యిప్పుడే స్వేచ్ఛగావాలి. రేపుగాదు. ఒక మోజుగా మారిన విశ్లేషణా ప్రక్రియ మొత్తాన్ని తాను పరిశీలిస్తుంటే అందులో యిమిడి వున్నవాటిని చూస్తుంటే కేవలం మాటలలోనేగాక లోతుగా చూస్తుంటే దాన్ని వదుల్చుకుంటారు. మీరు అసత్యమయినదానిని కాదన్నప్పుడు మీకు చూసే స్వేచ్ఛ లభిస్తుంది. సత్యాన్నప్పుడు చూస్తారు. అయితే ముందుగా మీరు అసత్యాన్ని కాదనాలి.

## 2

ప్రపంచంలో అంతరంగ, బాహ్యారంగాలు రెండింటిలోనూ ఉన్న అస్తవ్యస్థతను, అపక్రమాన్ని పట్టించుకుంటూ ఈ దైన్యాన్ని, ఆకలిని, యుద్ధాన్ని, ద్వేషాన్ని,

మూఢతను చూస్తూ తానేం చేయాలి - అని మనలో చాలామంది అడుగుతుంటారు. ఈ గందరగోళాన్ని ఎదుర్కొంటున్న ఒక మనిషిగా తానేమి చేయాలి. మీరేమి చేయాలి? ఈ ప్రశ్న వేసినప్పుడు ఏదో ఒక రాజకీయ, సామాజిక కార్యక్రమానికి మనలను అంకితం చేసుకోవాలనో, మతపరమయిన ఒక విధానాన్ని వెతికి తెలుసుకోవాలనో అనుకుంటాము. ప్రపంచ వ్యాప్తంగా వున్న అంకితం చేసుకోవాలన్న ఈ కోరిక చాలా ముఖ్యమైనది. తానొక కార్యకర్త కావచ్చు. లేదా ఈ సామాజిక గందరగోళాన్నుండి దూరంగా వెళ్ళి మానసిక కల్పనను ఒక దానిని అనుసరిస్తుండవచ్చు. అంకితం చేసుకోకుండా ఉండడము ఎంతో ముఖ్యమయిందని, జీవిత స్వరూప స్వభావమంతటితో సంపూర్ణంగా కలిసివుండాలని అనుకుంటున్నాను. మిమ్మల్ని మీరు అంకితం చేసుకుంటే ఒక్కభాగానికే అంకిత చేసుకుంటారు గాబట్టి ఆ ఒక్క భాగము ముఖ్యమయి విభజనను సృష్టిస్తుంది. జీవిత సమస్య మొత్తంతో తానెప్పుడూ పూర్తిగా సంపూర్ణంగా కలిసి వుంటాడో అప్పుడు క్రియ పూర్తి భిన్నంగా జరుగుతుంది. అప్పుడు క్రియ అంతరంగంలోనేగాక బాహ్యంగా కూడా జరుగుతుంది. ఈ క్రియ మొత్తం జీవిత సమస్యతో సంబంధంలో వుంటుంది. కలిసి వుండడమంటే మనిషి మనసు ప్రతిసమస్యతోనూ, ప్రతి ఆలోచనతోనూ, అనుభూతితోనూ పూర్తి సంబంధంతో ఉండడము. అంత సంపూర్ణంగా తాను జీవితంలో కలిసిపోయి వున్నప్పుడు, ఏ ఒక్క ప్రత్యేక భాగానికి, ఏ ఒక్క అంశానికి అంకితమవనప్పుడు ఒక మనిషిగా నిజానికి తానేమి చేయగలడో చూడాలి.

మనలో చాలామందికి క్రియ ఒక సిద్ధాంతాన్నుండి ఉత్పత్తి అవుతుంది. మనం చేయవలసినదేమిటన్న దాని గురించి ముందుగా ఒక భావముంటుంది. ఆ భావము ఒక సిద్ధాంతము గావచ్చు, ఒక భావనా గావచ్చు, ఒక సూత్రమూ గావచ్చు. చేయవలసినదేమిటో సూత్రీకరించుకున్న తర్వాత ఆ సిద్ధాంతం ప్రకారం చేస్తాము. కాబట్టి అక్కడెప్పుడూ ఒక విభజన వుంటుంది. దానితో క్రియకు, ఆ క్రియ ఎలా వుండాలని సూత్రీకరించారో దానికి మధ్య ఘర్షణ వుంటుంది. తన జీవితం చాలావరకు ఘర్షణల, పోరాటాల పరంపర గనుక దూరంగా ఎక్కడో ఆ శ్రమలలో ఉండకుండా ఈ ప్రపంచంతో తాను పూర్తిగా కలిసిపోయి జీవించగలడా అని తప్పక అడుగుతాడు.

ఇది మరొక ప్రశ్నను తప్పకుండా లేవనెత్తుతుంది. అదేమంటే - సంబంధమంటే ఏమిటి? అని. ఎందుకంటే, మన ముండేది అందులోనే. మనిషికి మరొక మనిషితో వుండే సంబంధమే జీవితం మొత్తం. సంబంధమనేదే అక్కడ లేనప్పుడు పూర్తిగా ఒంటరిగా తాను జీవిస్తుంటే జీవితం వుండదు. సంబంధంలోని చలనమే జీవితం. ఆ సంబంధాన్ని అర్థం చేసుకోవడము, సంబంధంలోని ఘర్షణనంతం చేయడమే మన సమస్య మొత్తం. తనలోనేగాక బాహ్యంగా కూడా మనిషి ప్రశాంతంగా జీవిస్తాడో లేదో చూడడమిది. ఎందుకంటే, అప్పుడు ప్రవర్తనలో ధార్మికత వుంటుంది. మనకు కావలసింది ప్రవర్తన. అదే క్రియ. అనంతమయిన ఈ జీవిత సమస్యను, అందులోని గందరగోళాన్ని, యదార్థాలను, ద్వేషాన్ని, వేదన బాధలను ఒక వ్యక్తి, ఒక మనిషి ఎలా ఎదుర్కోగలడు? అని మీరడుగవచ్చు. ఒక మార్పును, ఒక విప్లవాన్ని, ఒక మౌలిక స్థితిని, ఒక విమూత్న

రీతిలో చూడడాన్ని, జీవించడాన్ని ఒక మనిషెలా తీసుకురాగలడన్న ప్రశ్నే తప్పు అనుకుంటున్నాను. ఈ గందరగోళాన్ని అపక్రమం మొత్తాన్ని ప్రభావితం చేయడానికి నేనేమి చేయగలను? 'ఈ అపక్రమాన్ని ఎదుర్కొంటూ నేనేమి చేయగలను?' అని ప్రశ్నించేటప్పటికే దానికి మీరు సమాధానం చెప్పినట్లు మీరేమీ చేయలేరు. కనుక ఆ ప్రశ్నే తప్పు. మీరెదుర్కొంటున్న ఈ అంతులేని దైన్యాన్ని మీరేమి చేయగలరనిగాక, పూర్తిగా భిన్నమయిన జీవితాన్ని మీరెలా జీవించగలరన్నదానిపైన మీకు శ్రద్ధవుంటే మనిషితో మొత్తం సమాజంతో, ప్రపంచంతో మీకుండే సంబంధం ఒక మార్పుకు లోనవుతుంది. ఎందుకంటే, మనుషులమయిన మీరు, నేను, మనమే మొత్తం ప్రపంచమంటే. నేనేమీ ఆలంకారికంగా చెప్పడం లేదీమాట. అది యదార్థం. నేను, మీరే మొత్తం ప్రపంచం. తానేమి ఆలోచిస్తాడు, అనుభూతి చెందుతాడు? తన వేదన, బాధ, అత్యాశ , అసూయ, అసాధారణమైన గందరగోళంలో తానుండడం - అదీ ప్రపంచం. ప్రపంచంలో ఒక మార్పు కావాలి. సమూలమయిన మార్పు కావాలి. తానిప్పుడు నివసిస్తున్నవిధంగా - ఒక కృత్రిమ జీవితాన్ని, లోతులేని పైపై జీవితాన్ని, జరుగుతున్న దాన్ని దుర్భరమైన రోజువారీ జీవితాన్ని తాను ఈడవలేడు. మనుషుల మయిన మీరు, నేను పూర్తిగా మారగలము. అప్పుడు మనమేమి చేసినా ధర్మంగా ఉంటుంది. అప్పుడు మనలో ఎటువంటి ఘర్షణను తీసుకురాము. బాహ్యంగానూ, ఘర్షణ వుండదు. కనుక అదీ సమస్య. ఈ సాయంకాలం వక్త మీతో మాట్లాడాలను కుంటున్నదది. మనమనుకున్నట్లుగా 'తానెలా జీవిస్తాడు, నిత్యజీవితంలో తానేం చేస్తాడు - చాలా క్లిష్టమయిన క్షణాలలో గాదు - వాస్తవంగా ప్రతిరోజూ తానేమి చేస్తాడు' - అన్నవి ఎంతో ముఖ్యము. సంబంధ బాంధవ్యమే జీవితం. ఈ సంబంధ మొక నిరంతర చలనము. ఒక నిరంతరమైన ప్రవాహము.

కాబట్టి మన ప్రశ్నేమిటంటే - నేనో లేదా మీరో సమూలంగా మార్పు చెందేదెలా? రేపటి ఉదయం మీరు మేలుకున్నప్పుడు పూర్తిగా భిన్నమయిన మనిషయి, ఉత్పన్నమవుతున్న ఏ సమస్యనయినా ఒక బరువును మోస్తున్నట్లు మోసుకుపోకుండా అప్పటికప్పుడే పరిష్కరిస్తుంతటే మీ హృదయంలో గొప్ప ప్రేమ ఉంటుంది. కొండల సౌందర్యాన్ని, నీటిపై కాంతిని చూస్తారు. ఈ మార్పు తీసుకురావడం కోసం తప్పక తనను అర్థం చేసుకోవాలి. ఎందుకంటే సైద్ధాంతికంగా గాక నిజంగా మీరేమిటి? అన్న స్వీయ జ్ఞానం అన్నింటికంటే ముఖ్యమయినది.

ఈ సమస్యలన్నింటిని తాను ఎదుర్కొన్నప్పుడు ఎంతగా కదిలిపోతాడో మీకు తెలుసు. అది మాటలతో, వర్ణనలతో చెప్పలేము. ఎందుకంటే, మాట విషయంగాదు. వర్ణన వర్ణింపబడేదిగాదు. తనను తాను యదార్థంగా పరిశీలిస్తున్నప్పుడు నిరాశతో, వికృతంగా, దైన్యస్థితిలో వున్నట్లు భావించడంతో నిస్పృహకయినా లోనవుతాడు లేదా ఎటువంటి నిర్ణయమూలేకుండానయినా చూస్తాడు. ఎటువంటి నిర్ణయము చేయకుండా తనను తాను చూడడం అతి ముఖ్యమయిన దెందుకంటే మిమ్మల్ని మీరు తెలుసుకునే మార్గం అదొక్కటే గనుక. తనను తాను నిర్దిష్టంగా పరిశీలించుకోవడంలోఆర్థిక ఒత్తిళ్ళతో

నివసిస్తున్న సంస్కృతితో, వాతావరణంతో, తింటున్న ఆహారంతో, మత సంస్థలు లేక కమ్యూనిస్టులు చేసే ప్రచారంతో తానెంత భయంకరంగా నిబద్ధుడయినదీ గ్రహిస్తాడు. అది స్వార్థపరత్వమో లేదా వ్యక్తిని ఏకాకిని చేసే ప్రక్రియో లేదా మానవాళి మొత్తాన్నుండీ, మరొక మనిషినుండి విడగొట్టే ప్రక్రియోకాదు. ఈ నిబద్ధత పైపైన జరిగినదికాదు. ఎంతో లోతుల్లోకి వెళ్ళింది. కాబట్టి దీనినుండి స్వేచ్ఛనొందగలడా అని తానడుగుతాడు. ఎందుకంటే, వీటినుండి విముక్తి పొందలేనప్పుడు తానొక బానిస. అప్పుడు ఎడతెగని ఘర్షణ. యుద్ధం అనే జీవితవిధానాన్నే ఆమోదించి అందులోనే జీవిస్తుంటాడు.

వక్త చెప్తున్నది మీరు వింటున్నారనుకుంటాను. వక్త మాటలను వినడం మాత్రమేగాక ఒక అద్దంలో మిమ్మల్ని పరిశీలించుకుంటున్నట్లు ఆ మాటలను ఉపయోగించుకుంటూ వింటున్నారని ఆశిస్తాను. అప్పుడు వక్తకు మీకుమధ్య విషయ ప్రసారం పూర్తిభిన్నంగా వుంటుంది. అప్పుడు ఊహలతో లేదా అభిప్రాయాలతో, నిర్ణయాలతోగాక వాస్తవాలతో వ్యవహరిస్తారు. అప్పుడు నిబద్ధత లేకుండా మనసెలా పూర్తిగా మారగలదోనన్న ఈ సమస్యపట్ల మనం శ్రద్ధ వహిస్తాము. మనమనుకున్నట్లు తన సంబంధాలపట్ల ఎరుక ఉన్నప్పుడే తనను అర్థం చేసుకోవడం సాధ్యపడుతుంది. తనను తాను సంబంధాలలో మాత్రమే పరిశీలించుకోగలడు. అక్కడ ప్రతిస్పందనల నిబద్ధతలన్నీ వెల్లడవుతాయి. కనుక తన సంబంధాలలో తనయదార్థస్థితిని తెలుసుకుంటాడు. తనను పరిశీలించుకుంటున్నప్పుడు భయమనే యీ తీవ్ర సమస్య గురించి తెలుసుకుంటాడు.

ఒక నిశ్చయంతో, భద్రతతో, సురక్షితంగా ఉండాలని మనసెప్పుడూ కోరుకోవటం తాను చూస్తాడు. సురక్షితంగా భద్రతాభావంతో ఉండే మనసు బూర్జువా మనసు, దుర్భరమైన మనసు. అయినా మనమంతా పూర్తిగా సురక్షితంగా ఉండడాన్నే కావాలనుకుంటున్నది. అటువంటి మానసిక భద్రతలేదు. బాహ్యంగా ఏమి జరుగుతున్నదో చూడండి. ప్రతిమనిషి సురక్షితంగా భద్రతా భావంతో ఉండాలను కోవడాన్ని పరిశీలిస్తే చాలా ఆసక్తికరంగా వుంటుంది. అయినా మానసిక వినాశనాన్ని తీసుకువచ్చే ప్రతి ఒక్కటీ చేస్తాడు. దీనిని మీరూ చూడగలరు. తమ తమ సర్వాధికార ప్రభుత్వాలు, వాటికున్న సైన్యాలూ, నౌకాదళాలు యిత్యాదివాటన్నింటితో గూడిన జాతీయతలున్నంతవరకూ అక్కడ యుద్ధముంటుంది. అయినా ప్రత్యేక సిద్ధాంతానికీ మతానికీ సంబంధించిన ఒక ప్రత్యేక సమూహం, ప్రత్యేకదేశం మనది అనే ఒక మానసిక నిబద్ధతకు మనం లోనయి వున్నాము. ఈ ప్రపంచంలో మతసంస్థలు చేసిన పొరపాట్లు మనిషినెలా విభజించిందీ మీరెప్పుడయినా పరిశీలించి వుంటారేమో నాకు తెలియదు. మీరు కాథలిక్కులు, నేను ప్రొటెస్టంటును. ప్రేమ, వాత్సల్యం, దయ అనే యదార్థస్థితికంటే ముద్ర మనకు అతి ప్రధానమయిపోయింది. దేశాలు మనను విభజించాయి. జాతీయతలు విభజించాయి, ఏది మన నిబద్ధతో, భయాన్ని కలిగిస్తుందో ఆ విభజనను మనమే పరిశీలించవచ్చు.

కాబట్టి భయం గురించి ఏమి చేయాలన్న ప్రశ్నలోనికి మనం వెళ్ళబోతున్నాము. ఈ భయాన్ని మనం పరిష్కరించకపోతే మనం చీకటిలో వుంటాము. హింసలో జీవిస్తుంటాము. భయం లేనప్పుడు మనిషి కలహశీలిగా వుండడు. ఏ రకమయిన భయమూ లేని మనిషి నిజానికి స్వేచ్ఛగా, ప్రశాంతంగా వుంటాడు. మనుషులుగా మనమీ సమస్యను పరిష్కరించాలి. పరిష్కరించకపోతే సవ్యంగా జీవించడమే సాధ్యమవదు. సౌశీల్యత ఎందులో ఉన్నదో ఆ పదాన్నే మీరు తిరస్కరించవచ్చు. ఆ సచ్ఛీల వర్తనను, నడవడిని అర్థం చేసుకోలేకపోతే, భయాన్నుండి పూర్తిగా విముక్తమవకపోతే, అసలు కాలాతీతస్థితి అంటూ ఒకటుంటే ఆ సత్యం ఏమిటో ఆనందం అంటే ఏమిటో మన మెప్పటికీ తెలుసుకోలేము. భయమున్నప్పుడు తప్పించు కోవడమూ వుంటుంది. తప్పించు కోవడమన్నది అర్థరహితము, అపరిపక్వము. కనుక మనకీ భయమనే సమస్య ఉన్నది. చేతనాస్థాయిలో, అంతశ్చేతనాలుగా పిలువబడుతున్న మనసు లోతులు రెండింటిలోనూ ఈ సమస్యనుండి మనసు పూర్తిగా స్వేచ్ఛనొందగలదా? ఈ రోజు సాయంకాలం మనం మాట్లాడబోతున్నది అదే. ఎందుకంటే, భయమనే ఈ ప్రశ్ననర్థం చేసుకోకుండా, పరిష్కరించకుండా మనసెప్పటికీ స్వేచ్ఛగా వుండదు. స్వేచ్ఛలోనే మీరు అన్వేషించగలరు, కనుగొనగలరు. భయాన్నుండి మనసు స్వేచ్ఛనొందడమన్నది చాలాముఖ్యము, అవసరము. కనుక మనమందులోనికి వెళదామా?

ముందుగా వర్ణనే వర్ణింపబడినదిగాదు అన్న విషయం దయచేసి మనసులో ఉంచుకోండి. వర్ణనలో, మాటలలో చిక్కుకుని పోవద్దు. మాట, వర్ణన కేవలం భావ ప్రసారానికి మార్గాలు. మీరు మాటలకే చిక్కుకుపోతే ఎక్కువ దూరం వెళ్ళలేరు. మాటను అర్థం చేసుకోవడమేగాక మాటే వాస్తవ విషయం గాదు అన్నది గూడా గ్రహించాలి. కనుక భయమంటే ఏమిటి? నా భయం గాదిది. మనమిరువురమూ కలిసి చాలా క్లిష్టమయిన భయమనే సమస్యలోనికి ప్రయాణం చేస్తున్నాము. తాను దానిని అర్థం చేసుకొని దాని నుండి స్వేచ్ఛనొందకపోతే సంబంధమే సాధ్యపడదు. సంబంధం ఘర్షణగా, వేదనగా, క్లేశముగా మిగిలిపోతుంది.

భయమంటే ఏమిటి? గతంగురించి తాను భయపడుతుంటాడు. భయంలో కాలం యిమిడివున్నది. తనకు మరణమంటే భయం. అది భవిష్యత్తులోనిది, లేదంటే జరిగిపోయిన దానిగురించి భయపడతాడు. తాను అనారోగ్యంగా వున్నప్పటి బాధ గురించి భయపడతాడు. దయచేసి దీనిని బాగా గ్రహించండి. భయం కాలంతో ముడిపడి వున్నది. తన కింతకు ముందు కలిగిన బాధ గురించి మళ్ళీ అలాగే జరుగవచ్చేమోనన్న భయం. రేపు, భవిష్యత్తులో జరుగబోయే దానిగురించి భయం. లేదా వర్తమానాన్ని గురించిభయం. దీనంతటిలోనూ కాలం యిమిడి ఉన్నది. మానసికంగా నిన్న, ఈ రోజు, రేపు అన్నవి లేకుంటే భయముండదనే చెప్పవచ్చు. నిన్న జరిగినదేమిటో, ఏదయితే బాధించిందోనన్న ఆలోచనలలో తిరిగి రేపేమి జరుగనున్నదో ఆలోచిస్తారు. ఈ భయాన్ని ఆలోచన కలిగిస్తుంది. ఆలోచన భయాన్ని పెంచుతుంది. బాధగురించిన ఆలోచన మరణాన్ని

గురించిన ఆలోచన అసంతృప్తులు, సంతృప్తులగురించిన ఆలోచన, ఏమి గావచ్చు, ఏమవాలి మొదలయిన ఆలోచనలు భయాన్ని పెంచుతాయి, ఆలోచన భయాన్ని పుట్టించి, భయం కొనసాగడానికి తగిన జీవాన్ని పోస్తుంది. నిన్న మీకు సుఖాన్ని కలిగించినదేది అని ఆలోచిస్తూ ఉండడంతో ఆలోచన ఆ సుఖానికి బలమిచ్చి అందుకు కొంత సమయాన్నిస్తుంది. కనుక ఆలోచన భయాన్నేగాక సుఖాన్నికూడా కలుగ జేస్తుంది. దానికి బలమిచ్చి పోషిస్తుంది. మీలో మీరు దీనిని పరిశీలించుకోండి. మీలో వాస్తవంగా జరుగు తున్నదేమిటో చూడండి.

మీకు సుఖానుభవము లేదా వినోదకరంగా ఉన్నది అనదగిన అనుభవం ఉన్నది. మీరు దానిగురించి ఆలోచిస్తారు. అది లైంగికానుభవము గావచ్చు మరొకటి గావచ్చు. అది మళ్ళీ కావాలనుకుంటారు. ఏదయితే మీకు సుఖమయ క్షణాన్నిచ్చిందో ఆ విషయాన్ని గురించి ఆలోచిస్తూ ఆ సుఖం మళ్ళీ కావాలని అది కొనసాగాలని కోరుకుంటుంటారు. కనుక ఆలోచన భయానికేగాక సుఖానికిగూడ బాధ్యురాలు. ఆలోచన సుఖాన్ని తీసుకొస్తుంది. భయాన్ని పోషిస్తుంది అన్న సత్యాన్ని, వాస్తవాన్ని తాను చూస్తాడు. ఆలోచన భయాన్ని, సుఖాన్ని రెండింటినీ పెంచుతుంది. ఈ రెండూ వేరుగావు. సుఖంకోసం ఎక్కడ ఆరాటముంటుందో అక్కడ భయంగూడా వుంటుంది. ఈ రెండింటినీ కాదనలేము. ఎందుకంటే, ఆ రెండూ పుట్టింది ఆలోచన నుండే.

దయచేసి నేను దేనినిగురించీ మిమ్మల్ని ఒప్పించడానికి ప్రయత్నించడం లేదన్నది మనసులో ఉంచుకోండి. ప్రచారమూ చేయడం లేదు. వద్దు బాబూ వద్దు! ఎందుకంటే ప్రచారంచేయడమంటే అబద్ధమాడటం. ఎవరయినా మీకు నచ్చచెప్పాలని ప్రయత్నిస్తుంటే అంగీకరించవద్దు. నచ్చచెప్పడం అంటే అభిప్రాయాలను, నిర్ణయాలను తెలియజేయడం కంటే గంభీరమయిన ఒక విషయాన్ని మనం చూస్తున్నాము, వాస్తవాలను, యదార్థాలను చూస్తున్నాము. మీరు పరిశీలించే వాస్తవాలకు అభిప్రాయాల అవసరంలేదు. యదార్థ మేమిటో మీకు చెప్పవలసిన పనిలేదు. మీకు చూసే శక్తి ఉన్నట్లయితే అది అక్కడే వున్నది.

కనుక భయాన్ని, సుఖాన్నిగూడా ఆలోచన పెంచి పోషిస్తుండడము తాను చూస్తాడు. మనం సుఖం కొనసాగాలనుకుంటాము. మనకు చాలా చాలా సుఖం కావాలి. ఏది భగవంతుడో ఆ శాశ్వతస్థితి స్వర్గంలో ఉన్నదేమో కనుగొనడం మనిషికుండే చిట్టచివరి సుఖం. అతనికి భగవంతుడు ఉన్నతమయిన ఒక సుఖం. ఏది నిజానికి అవినీతో ఆ సాంఘికనీతిని మొత్తాన్ని మీరు పరిశీలించినట్లయితే అది సుఖం మీద భయం మీద బహుమతి దండనలమీద ఆధారపడి వుంటుంది.

తాను వర్ణననో, మాటనోగాక యధార్థ సత్యాన్ని చూస్తున్నప్పుడు, వర్ణింపబడిన దానిని, ఆలోచన దీనినెలా తీసుకు వచ్చినదన్న యదార్థస్థితిని చూస్తున్నప్పుడు ఆలోచన అంతమవడము సాధ్యపడుతుందా? ఈ ప్రశ్న కొంత వెర్రిగా తోచవచ్చు. కాని కాదు. నిన్న మీరు సూర్యాస్తమయాన్ని చూశారు. సాయంకాలపు సూర్యకాంతులతో కొండలు అసాధారణంగా వెలుగుతున్నాయి, అక్కడి వైభవము, అందము మీకు గొప్ప ఆనందాన్నిచ్చింది. దానిని తాను సంపూర్ణంగా ఆనందించడంతో అది ముగియడము,

దానితో రేపటికి ఆ అనుభవాన్ని ఆలోచన మోసుకెళ్ళకుండా ఉండడము జరుగుతుందా? భయమనేదుంటే తాను భయాన్ని ఎదుర్కొనగలడా? మొత్తం ఆలోచన యొక్క స్వరూప స్వభావాలను మీరు అర్థం చేసుకున్నప్పుడే అది సాధ్యపడుతుంది. కనుక తాను, 'ఆలోచించడమంటే ఏమిటి'? అని అడుగుతాడు.

మనలో చాలామందికి ఆలోచించడం అసాధారణమయిన రీతిలో ప్రధానమయి పోయింది. ఆలోచన ఎప్పుడూ పాతదే. అలోచన ఎప్పటికీ నూతనమయినది గాదు. ఆలోచన ఎన్నటికీ స్వేచ్ఛగా వుండలేదు అన్నదానిని మనమెప్పుడూ గ్రహించలేదు. ఏది శుద్ధ అర్థరహితమో ఆ ఆలోచనయొక్క స్వేచ్ఛగురించి మనం మాట్లాడు కుంటున్నాము. అంటే మీరు కావాలనుకున్నదేదో వ్యక్తం చేయవచ్చు. చెప్పాలనుకున్నది చెప్పవచ్చు. కాని ఆలోచన దానికదే ఎప్పటికీ స్వేచ్ఛగా వుండదు. ఎందుకంటే, ఆలోచన జ్ఞాపకానికి ప్రతిస్పందన, దీనిని తనకు తానే పరిశీలించుకోగలడు. ఆలోచన స్మృతికి అనుభవపు, జ్ఞానపు స్పందన. జ్ఞానము, అనుభవము స్మృతి ఎప్పుడూ పాతవే గనుక ఆలోచన గూడా ఎప్పటికీ పాతదే. కాబట్టి ఆలోచన ఏ కొత్త దానిని చూడలేదు. ఆలోచన జోక్యంలేకుండా భయమనే సమస్యను మనసు చూడగలదా? సరే, మీకర్థమవుతున్నదా?

నాకు భయం. మునుపు తాను చేసిన వాటిని గురించి భయమున్నది. ఆలోచన జోక్యంలేకుండా దీని గురించి పూర్తి ఎరుకతో ఉండండి. అప్పుడక్కడ భయముంటుందా? కొంతసమయానికి భయం తీసుకురాబడుతుందని మనం చెప్పుకున్నాం. కాలమే ఆలోచన. ఇది తత్త్వశాస్త్రం కాదు. మార్మికమయిన అనుభవమూ కాదు. దీనిని మీతోనే పరిశీలించండి. మీరూ చూస్తారు. ఆలోచన నిర్దిష్టంగా, సమర్థంగా హేతుబద్ధంగా, ఆరోగ్యంగా పనిచేయాలని తాను గ్రహిస్తాడు. మీరు ఆఫీసుకు వెళ్తున్నా లేదా ఏమి చేస్తున్నా ఆలోచన పనిచేయాలి. లేకుంటే మీరేమీ చేయలేరు. అయితే సుఖాన్ని, భయాన్ని పెంచి పోషిస్తుంటే కొనసాగిస్తుంటే ఆలోచన సరిగా పనిచేయడం లేదన్నమాట. అప్పుడు ఆలోచన సంబంధాలలో గూడా సక్రమంగా లేనట్లే. దానితో ఘర్షణకు కారణమవుతుంది. ఒక వైపున ఆలోచన అంతమయినా మరొకచోట అది గొప్ప శక్తితో పనిచేయగలదా అన్న ప్రశ్న వస్తుంది. సౌందర్యమయమైవున్న సూర్యాస్తమయాన్ని చూస్తున్నప్పుడు ఆలోచనలేకుండా వుంటుందా అన్నది మనకుకావాలి. మీరు అప్పుడే సూర్యాస్తమయ సౌందర్యాన్ని చూస్తారు. ఆలోచనలతో, సమస్యలతో, హింసతో మనసు నిండినప్పుడు గాదు. దానిని మీరు పరిశీలిస్తే సూర్యాస్తమయాన్ని చూస్తున్న క్షణంలో ఆలోచనలేదు. ఒక పర్వతముపైన అసాధారణమయిన కాంతిని మీరు చూస్తున్నపుడు ఒక గొప్ప ఆనందం. ఆ క్షణంలో అందులో ఆలోచనకు ఎంత మాత్రం స్థానంలేదు. అయితే మరుక్షణం ఆలోచన 'అదెంత అద్భుతం!ఎంతటి సౌందర్యం! నేను చిత్రించవలసింది. దానిగురించి ఒక పద్యం రాసి వుండవలసింది. అదెంత ప్రియమైనదో మా స్నేహితులకు చెప్పివుండవలసింది' అంటుంది. లేదా 'సూర్యాస్తమయాన్ని మళ్ళీ రేపు చూడాలి' అంటుంది. ఆలోచన తన అల్లరిని అప్పుడు ప్రారంభిస్తుంది. ఎందుకంటే, ఆలోచన 'రేపు నాకీ

సుఖం మళ్ళీ కావాలి' అంటుంది. మీకది లేనప్పుడు బాధ కలుగుతుంది. ఇది చాలా సులభము. అది చాలా సులభమైనది గనుకనే దొరకకుండా పోతుంది. మనమంతా అతి తెలివిగా ఉండాలనుకుంటాం. మనమంతా చాలా ఆధునాతనంగా, తెలివిగా, చాలా చదువుతూ ఉంటాము. మానవాళి మానసిక చరిత్ర మొత్తం తనలో వున్నది. అయితే రాజెవరు, ఎటువంటి యుద్ధాలు జరిగినవన్న అసంబద్ధ జాతీయతలు గావు. మీలోనే మీరు దానిని పఠించగల్గితే మీ కర్థమవుతుంది. అప్పుడు మీకు మీరే వెలుగు. అక్కడ ఎవరి ఆధిపత్యమూ వుండదు. మీరప్పుడు నిజంగా స్వేచ్ఛగా ఉంటారు.

కాబట్టి మన ప్రశ్నేమిటంటే, ఆలోచన జోక్యం చేసుకోకుండా ఉండగలదా? ఆ అడ్డు కాలాన్ని తయారుచేస్తుంది. మీ కర్థమయిందా? మరణాన్ని తీసుకోండి. మరణంలో గొప్ప సౌందర్యం యిమిడి వున్నది. ఏ రకమయిన భయమున్నా ఆ సౌందర్యాన్ని అర్థం చేసుకోవడం సాధ్యం గాదు. మరణం గురించి మనమెంత భయపడుతున్నామో ఊరికే చూపుతున్నాము. ఎందుకంటే, అది భవిష్యత్తులో వస్తుంది. తప్పదు. కనుక దాని గురించే ఆలోచిస్తూ వుంటుంది. ఆలోచన దాన్ని నెట్టి వేస్తుంది. లేదా మీకు కలిగిన భయము, బాధ, ఆందోళనల గురించి ఆలోచించి అది మళ్ళీ పునశ్చరణమవుతుందేమోననీ అనుకుంటుంది. ఆలోచన చేసే అల్లరిలో మనం చిక్కుకుపోయాము.

అయినా ఆలోచనకు ఎంతటి అసాధారణ ప్రాధాన్యత ఉన్నదో కూడా గ్రహిస్తారు. మీరు ఆఫీసుకు వెళ్తున్నపుడు, సాంకేతికమైనదేదో చేస్తున్నప్పుడు ఆలోచనను, జ్ఞానాన్ని ఉపయోగించాలి. ఈ ఉపన్యాసం ఆరంభమయినప్పటినుండి యిప్పటిదాకా మొత్తం చూస్తూ, ఆ మొత్తాన్ని చూస్తూ 'ఆలోచన మౌనంగా ఉండగలదా?' అని కూడా ప్రశ్నిస్తాం. సూర్యాస్తమయాన్ని చూస్తూ ఆ సూర్యాస్తమయ సౌందర్యంలో పూర్తిగా లీనమవడంతో సుఖమనే ప్రశ్నను ఆలోచన తీసుకురాకుండా ఉండగలదా? దయచేసి దీనిని గ్రహించండి. అప్పుడు నడవడి ధార్మికమవుతుంది. ఆలోచన దేనిని సౌశీల్యత అనుకుంటున్నదో అది అపవిత్రము, వికృతము. ఆ దానిని ఆలోచన పెంపొందించనప్పుడే నడవడి శీలవంతంగా వుంటుంది. సౌశీల్యత కాలానిదో, ఆలోచనదో గాదు. అంటే సుఖాన్నో, బాధనో చుట్టూ అల్లకుండా సూర్యాస్తమయాన్ని చూడడము ఎలా సాధ్యమవుతుంది? అంత సావధానంగా, అంత పూర్తిగా ఆ సౌందర్యంలో లీనమయి యీ సూర్యాస్తమయాన్ని తాను చూడగలడా? అలా సూర్యాస్తమయాన్ని చూడడంతో అది ముగిసి, రేపు గూడా ఆ సుఖం కావాలన్న ఆలోచనకు హస్తగతమవకుండా వుంటుందా?

మనమొకరికొకరము భావ ప్రసారం చేసుకుంటున్నామా? (ప్రేక్షకులు: అవును - అవును) మంచిది, సంతోషం. అయితే, అంత త్వరగా 'అవును' అని సమాధానం చెప్పవద్దు. ఎందుకంటే ఈ సమస్య చాలా క్లిష్టమయినది. ఆలోచన ప్రమేయం లేకుండా సూర్యాస్తమయాన్ని చూడడానికి గొప్ప క్రమశిక్షణ అవసరము. కట్టుబాటులో ఉండే అణచివేతలో లేదా నియంత్రణలో ఉండే క్రమశిక్షణగా గాదు. ఆంగ్లంలో క్రమశిక్షణ అన్న పదానికి నేర్చుకోవడమని అర్థము. కట్టుబడి ఉండడముగాదు. విధేయతాగాదు.

ఆలోచనా విధానం మొత్తాన్ని దాని స్థానాన్ని గురించి నేర్చుకోవడం. ఆలోచనను కాదనడానికి గొప్ప పరిశీలన అవసరము. పరిశీలించడానికి స్వేచ్ఛ వుండాలి. ఈ స్వేచ్ఛలో ఆలోచన కదలికను తాను తెలుసుకుంటాడు. నేర్చుకోవడమప్పుడు చురుగ్గా జరుగుతుంది.

నేర్చుకోవడమంటే ఏమిటి? తాను పాఠశాలకో, కళాశాలకో వెళ్ళి ఎంతో సమాచారాన్ని నేర్చుకుంటాడు. బహుశా చాలా ప్రధానమయినది గాకపోవచ్చు. కాని తానది నేర్చు కుంటాడు. అది జ్ఞానమవుతుంది. ఆ జ్ఞానాన్నుండి సాంకేతిక రంగంలో గానీ, చేతనా రంగం మొత్తంలో గానీ పనిచేస్తాము. కాబట్టి నేర్చుకోవడం అన్న పదానికి అర్థమేమిటో తాను గ్రహించాలి. నేర్చుకోవడం అనేది యిప్పటి క్రియాశీల వర్తమానంలోనన్నది స్పష్టము. సమయమంతా నేర్చుకోవడం జరుగుతుంది. ఆ నేర్చుకోవడము జ్ఞానార్జనకొక మార్గమవడం వేరు. అదేమంటే గత అనుభవాన్నుండి నిప్పు కాలుస్తుందని నేను నేర్చు కున్నాను. జ్ఞానమది, నేనది నేర్చుకున్నాను కనుక నిప్పు జోలికి పోను. నేను నేర్చుకోవడమూ మానేశాను. మనలో చాలామంది నేర్చుకుని వుండడంతో నేర్చుకున్నదానినుండి స్పందిస్తారు. మన గురించి లేదా యితరుల గురించీ సమాచారాన్ని సేకరించడం జ్ఞానమవుతుంది. దాదాపు ఆ జ్ఞానం స్థిరపడిపోతుంది. అందులోనుండి మన క్రియ జరుగుతుంది. కనుక చర్య ఎప్పటికీ పాతదే. కనుక నేర్చుకోవడమనేది పూర్తిగా భిన్నమయిన విషయము.

ఈ సాయంకాలం సావధానంగా వినివుంటే భయ స్వభావాన్ని, సుఖ స్వభావాన్ని నేర్చుకుని వుంటారు. నేర్చుకోవడంతో దాని ప్రకారం నడుచుకుంటారు. ఈ తేడాను మీరు చూస్తారని ఆశిస్తాను. నేర్చుకోవడంలో నిరంతరం క్రియ యిమిడి వుంటుంది. సమయమంతా నేర్చుకోవడం జరుగుతుంది. నేర్చుకోవడమనే క్రియ చేయడము. చేయడము నేర్చుకోవటాన్నుండి వేరుగాదు. మనలో చాలామందిమి తెలుసుకోవడము, చేయడము వేర్వేరు. అంటే ఒక సిద్ధాంతము లేదా ఒక ఆశయం ఉంటుంది. మనం ఆ ఆశయం ప్రకారం చేస్తాము. కేవలం ఆ ఆశయానికి తగినట్లే ఆ పని వుంటుంది. కనుక క్రియ ఎప్పుడూ పాతదే.

చూడడమెలాగో నేర్చుకోవడమనేది ఒక గొప్ప కళ. మీరు ఒక పూవును చూస్తున్నప్పుడేమి జరుగుతుంది. మీరు పూవును యదార్థంగా చూస్తారా లేకుంటే ఆ పూవుగురించి మీకున్న ఊహారూపం ద్వారా చూస్తారా? ఈ రెండూ పూర్తిగా భిన్నమయినవి. ఒక పూవు వంక, రంగువంక చూస్తున్నప్పుడు, పేరు పెట్టకుండా నచ్చిందీ, నచ్చలేదు అనకుండా, మీకూ, మీరు చూస్తున్న పూవుకు మధ్య ఏరకమయిన అడ్డుతెరా లేకుండా మాట చొరకుండా, ఆలోచనలేకుండా చూస్తున్నప్పుడు పూవుకు అసాధారణమయిన రంగు, సౌందర్యము వుంటాయి. కాని వృక్షశాస్త్రజ్ఞానంతో పూవు వంక చూసి 'ఇది గులాబీ' అని చెప్పినపుడు మీరప్పటికే మీ చూపును నిబద్ధం చేసినట్లు. చూడడము, నేర్చుకోవడము ఒక గొప్ప కళ. అయితే ఆ కళను నేర్చుకోవడానికి, మీరు

కళాశాలకు వెళ్ళరు. ఇంట్లోనే చేయగలరు. మీరు పూవును చూసి, దానివంక ఎలా చూశారో కనుగొనగలరు. మీరు సున్నితంగా, సజీవంగా గమనిస్తూ వుంటే అప్పుడు మీకు పూవుకు మధ్య ఖాళీ లేకుండా పోతుంది. ఆ ఖాళీ లేకుండా పోయినప్పుడు ఆ వస్తువును ఎంతో సజీవంగా, ఎంతో గాఢంగా, చూస్తారు. అదేరీతిగా మిమ్మల్ని మీరు ఆ ఖాళీ లేకుండా చూస్తున్నప్పుడు పరిశీలించేవాడు, పరిశీలించబడుతున్న వస్తువు లేకుండా వైరుధ్యము లేకపోవడాన్ని దానితో ఘర్షణ లేకపోవడాన్ని చూస్తారు. భయ స్వరూపాన్ని చూడడంలో సుఖస్వరూపాన్ని, స్వభావాన్ని చూస్తారు. చూడడమే దానిగురించి నేర్చుకోవడము గనుక సుఖాన్ని వెన్నాడటంలో మనసు చిక్కుకుపోదు. అప్పుడు జీవితానికర్థం పూర్తి భిన్నంగా వుంటుంది. తాను జీవిస్తాడు - సుఖాన్ని వెతుకుతూ గాదు.

మీరు ప్రశ్న అడుగబోయే ముందు ఒక్క నిముషం ఆగండి. మిమ్మల్ని నేనొక ప్రశ్న అడుగుతాను. ఈ ఉపన్యాసాన్నుండి మీరేమి గ్రహించారు? దయచేసి నాకు సమాధానం చెప్పవద్దు, మీకున్నది మాటలు, వర్ణనలు, భావాలు. లేదా మీకు మీరే చూసినందువలన సత్యమైనది, తిరుగులేనిదీ, నశింపనిదీ ఏదయినా ఉన్నదేమో కనుగొనండి. అప్పుడు మీకు మీరే వెలుగు. అందుచేత మీ కొవ్వొత్తిని మరొక వెలుగు దగ్గర వెలిగించరు. మీరే ఆ వెలుగు. అది యదార్థమయితే, ఊహాజనితము గాక పోయినట్లయితే ఈ రకంగా ఒకచోట చేరడము అమూల్యమవుతుంది. బహుశా, ఇప్పుడు ప్రశ్నించాలనుకుంటున్నారా?

నిన్న మనం అనుకున్నట్లు మీరు ప్రశ్నిస్తున్నది తెలుసుకోవడం కోసమే. వక్త కంటే మీరు ప్రజ్ఞావంతులుగా కనిపించాలనిగాదు. పోల్చేమనిషి ప్రజ్ఞాశాలిగాదు. ప్రజ్ఞాశీలియైన మనిషి ఎప్పటికీ పోల్చడు. ప్రశ్నించడంవలన మిమ్మల్ని మీరు వ్యక్తం చేసుకుంటారు. మిమ్మల్ని మీరు వెల్లడించుకుంటారు. ఆ విధంగా నేర్చుకుంటారు. లేదా వక్త పొరపాటును ఎత్తి చూపడానికి ప్రశ్నిస్తారు. మీరు ఏదయినా చెయ్యొచ్చు లేదా విస్తారమైన దృష్టి సారించడానికి, తలుపులు తెరవడానికి ప్రశ్నిస్తారు. కనుక మీరు ఏ రకపు ప్రశ్నను, ఏ ధర్మమున్న ప్రశ్నను అడుగబోతున్నారనేది మీపైన ఆధారపడి వుంటుంది. మీరు ప్రశ్నించకుండా ఉండాలని వక్త అనుకోవడం లేదు. దయచేసి దాని అర్థం అది గాదు.

ప్రా: సూర్యాస్తమయాన్ని చూస్తున్నపుడు, అదే సమయంలో అందులోనికి ఆలోచన ప్రవేశిస్తుంటే తానేమి చేయాలి?

కృ: తానేమి చేయాలి? దయచేసి ప్రశ్నకున్న ప్రాముఖ్యాన్ని అర్థం చేసుకోండి. అంటే - మీరు సూర్యాస్తమయాన్ని చూస్తారు. మధ్యలో ఆలోచన వస్తుంది. అప్పుడు ఏమి చేయాలి అని మీరడుగుతారు. తానేమి చేయాలి అంటున్న ప్రాశ్నికుడు ఎవరు? నేనేమి చేయాలి అంటున్నది ఆలోచనేనా? ప్రశ్న మీకర్థమయిందా? దీనినిలా చెప్ప నీయండి. అక్కడ సూర్యాస్తమయమున్నది. దాని సౌందర్యమున్నది. అసాధారణమయిన దాని వర్ణము, దాని అనుభూతి, దాని ప్రేమ వున్నాయి. అప్పుడు దానితో పాటే ఆలోచన రావడంతో, 'ఇక్కడది ఉన్నది, నేనేమి చేయాలి' అని నాలో నేననుకుంటాను. దీనిని

శ్రద్ధగా వినండి. దానిలోనికి వెళ్ళండి. ఆలోచన గూడా 'నేనేమి చేయాలి' అనడం గాదు. నేనేమి చేయాలి అంటున్న ఆ 'నేనే' ఆలోచనా ఫలితము. కాబట్టి ఏదయితే ఈ సౌందర్యంలో జోక్యం కల్గించుకుంటున్నదో చూస్తూ ఆ ఆలోచన 'నేనేమి చేయాలి?' అంటున్నది.

ఏమీ చెయ్యొద్దు (నవ్వు) మీరేదయినా చేస్తే అందులోనికి ఘర్షణను తీసుకువస్తారు. అయితే మీరు సూర్యాస్తమయాన్ని చూస్తున్నప్పుడు ఆలోచన ప్రవేశిస్తే దాని గురించి ఎరుకతో వుండండి. సూర్యాస్తమయం, అందులోనికి ప్రవేశిస్తున్న ఆలోచనల పట్ల ఎరుక వహించండి. ఆలోచనను వెంటాడి తరమొద్దు, సూర్యాస్తమయం, అందులోనికి ప్రవేశిస్తున్న ఆలోచన-యీ మొత్తాన్ని గురించి ఎంపికలేని ఎరుకతో వుండండి. మీరంతటి ఎరుకతో వుంటే, ఆలోచనను అణచివేయాలనో, ఆలోచన జోక్యాన్ని ప్రతిఘటించాలనో అనుకోకుంటే యివేవీ మీరు చేయనప్పుడు ఆలోచన నిశ్శబ్దమవుతుంది. ఎందుకంటే, 'నేనేం చేయాలి?' అంటున్నది ఆలోచనే గనుక. ఆలోచన పన్నుగడలలో ఇదొకటి. ఆ ఉచ్చులో పడొద్దు. కాని జరుగుతున్నదేమిటో, ఈ స్వరూపం మొత్తాన్ని పరిశీలించండి.

ప్రా: సూర్యాస్తమయాన్ని ఎలా చూడాలన్న దానిలో నిబద్ధులమయాము. వక్తగా మిమ్మల్ని మేమెలా వినాలో నన్న నిబద్ధతా జరిగింది. కనుక మా, యీ నిబద్ధత ద్వారా మేము ప్రతిదానినీ చూస్తూ, వింటూవుంటే ఈ నిబద్ధత నుండి స్వేచ్ఛ నొందడమెలా?

కృ: ఈ నిబద్ధత గురించో మరొక నిబద్ధత గురించో ఎరుకతో మీరెప్పుడున్నారు? దయచేసి దీనిని మరికొంత గ్రహించండి. మీరు నిబద్ధులయినట్లు ఎరుక మీకెప్పుడు కలిగింది? మీరు అమెరికా వానినని, హిందువునని, కాథలిక్కునని, ప్రొటెస్టంటునని, కమ్యూనిస్టునని, ఇదని అదని నిబద్ధమయినట్లు ఎరుక వున్నదా? అంత నిబద్ధమయిన ఎరుక మీకే కలిగిందా లేక మరొకరు దానిగురించి చెప్పడంతో మీకా ఎరుక కలిగిందా? మీరు నిబద్ధమయినట్లు ఎవరో ఎత్తి చూపినందువలన మీకు ఎరుకకలిగితే అదొక విధము. మీ నిబద్ధత గురించి మీకు చెప్పకుండా మీకే ఎరుక వుంటే దాని స్వభావం వేరుగా వుంటుంది. మీకు ఆకలిగా వున్నదని మీకెవరయినా చెప్తే అదొకటి. మీకు నిజంగా ఆకలి వేయడం మరొకటి. మీరు నిబద్ధులని మీకెవరోచెప్పడం వలన తెలుసుకున్నారో, జీవించడమనే యీ పూర్ణ ప్రక్రియలో మీరున్నందువలన, మీకా ఎరుక ఉండడం వలన, మీరు నిబద్ధులయినట్లు ఎవరూ చెప్పకుండానే మీకు మీరే గ్రహించారో ఏమో అది మీరే కనుగొనండి. దానికప్పుడు జీవముంటుంది. అప్పుడది మీరెంతోలోతుగా అర్థం చేసుకోవలసిన ఒక సమస్య అవుతుంది. తనకు చెప్పడంవలన గాక తాను నిబద్ధుడయినట్లు తానే చూస్తాడు. మీరు ప్రజ్ఞావంతులయితే ఆ నిబద్ధతను త్రోసివేయాలన్న ప్రతిస్పందన తప్పదు. ఒక ప్రత్యేక నిబద్ధత గురించిన ఎరుక మీకు కలగడంతో దానికి వ్యతిరేకంగా ఉద్యమిస్తారు. కేవలం ఒక ప్రతిస్పందనలాగా యిప్పటి తరంవారిలా ఉద్యమిస్తారు. ఒక నిబద్ధతకు వ్యతిరేకంగా ఉద్యమించడము మరొక రకమైన నిబద్ధత. ఒక నిబద్ధతకు విరుద్ధంగా చేసే ఉద్యమం మరొక రకంగా నిబద్ధము చేస్తుంది.

ఒక కమ్యూనిస్టుగా, ఒక ప్రొటెస్టంటుగా, ఒక డెమోక్రాట్‌గా, ఒక రిపబ్లికన్‌గా తన నిబద్ధత గురించి తాను ఎరుకతో ఉంటాడు. ప్రతిస్పందించడంగాక ఈ నిబద్ధతంటే యదార్థంగా ఏమిటో ఎరుక కల్గితే జరిగేదేమిటి? ఏది మీకు మీరుగా కనుగొన్నారో ఆ నిబద్ధత గురించి ఎంపికలేని ఎరుకతో ఉంటే జరిగేదేమిటి? అక్కడ ప్రతిస్పందన లేదు. మీరు అప్పుడే నిబద్ధత తనలో ఎందుకు చోటు చేసుకుంటుందో నేర్చుకుంటారు. రెండువేల సంవత్సరాల ప్రచారం ప్రత్యేకమయిన మత దురాచారాలలో మీకు నమ్మకాన్ని కలిగించింది. శతాబ్దాల తరబడి, సంప్రదాయంతో, పునశ్చరణ ద్వారా, వివిధ కర్మకాండలు, వేడుకలద్వారా మన మనసుల నెలా చర్చి నిబద్ధము జేసిందో మీకు తెలుసు. రోజుల తరబడి, మాసాల తరబడి , చిన్ననాటినుండి పునశ్చరించడము, మనం బాప్టిజమ్ తీసుకోవడము యిత్యాది వన్నీ జరుగుతూనే వున్నాయి. ఇండియా, చైనా మొదలయిన యితర దేశాలలో అదే మరొక రకంగా జరుగుతున్నది.

మీకు దీని గురించి, ఎరుక ఉంటే, జరిగేదేమిటి? మనసెంత త్వరగా ప్రభావిత మవుతుందో చూస్తారు. మనసు మెత్తగా, లేతగా, అమాయకంగా ఉండడంతో కమ్యూనిస్టుగానో, కాథలిక్కుగానో, ప్రొటెస్టంటుగానో, ఇతరంగానో నిబద్ధమవుతుంది. ఎందుకని నిబద్ధమవుతుంది? ప్రచారంతో ఎందుకంతగా రూపుదిద్దుకుంటుంది? మీరు దీనిని గ్రహిస్తున్నారా? కొన్నింటిని చేజిక్కించుకోవడం కోసం, కొన్నింటిలో నమ్మకం కల్గించడానికి చేసే ప్రచారానికి మీరెందుకంత లోబడతారు? ఎందుకు? బయటినుండి యీ నిరంతర వత్తిడి వుండడమేగాక ఒకదానితో సంబంధంలో ఉండాలని, ఒక సమూహానికి సంబంధించి ఉండాలని అనుకుంటారు. ఎందుకంటే, ఒక సమూహంతో ఉన్న సంబంధం రక్షణనిస్తుంది. తాను ఒక తండాలోని వాడున్నట్లుగా వుండాలను కుంటాడు. దానివెనుక భయముంటుంది. ఒంటరితనమనే భయం. వదిలి వేయ బడతామోనని. మానసికంగా వదిలివేయబడతాననేగాదు, తనకు ఉద్యోగం రాదేమోనని భయం. అదంతా ఇందులో యిమిడి వుంటుంది. మనసప్పుడు నిబద్ధత నుండి స్వేచ్ఛ నొందగలదా? అని మీరడుగుతారు. ఒక కొండచరియవలన, ఒక క్రూరమృగంవలన ప్రమాదాన్ని చూసిన విధంగా నిబద్ధతకున్న ప్రమాదాన్ని మీరు చూస్తే ఎటువంటి ప్రయత్నమూ చేయకుండానే అది జారిపోతుంది. కాని నిబద్ధమవడంలోని ప్రమాదాన్ని మనము చూడము. జాతీయత మనిషిని ఎలా వేరుచేస్తున్నదో ఆ ప్రమాదాన్ని మనం చూడము. అదెంత ప్రమాదమో మీరు తీక్షణంగా, సజీవంగా చూసివుంటే తక్షణమే వదిలివేస్తారు.

అప్పుడు ప్రశ్నేమిటంటే నిబద్ధత గురించి అందులోని సత్యాన్ని మీరు చూసేటంత తీక్షణమైన ఎరుకతో ఉండడం సాధ్యమా? అది మీ కిష్టమా, అయిష్టమా అన్నదిగాదు. మీరు నిబద్ధులయారు గనుక మనసు స్వేచ్ఛగా ఉండడం లేదన్న యదార్థాన్ని చూడడం సాధ్యమా? ఎందుకంటే, కేవలం స్వేచ్ఛాపూరిత మయిన మనసుకే ప్రేమంటే ఏమిటో తెలుస్తుంది.

ప్రా: వర్తమానంలో సంపూర్ణంగా ఉండడమనే అగ్ని గతాన్ని కబళించి వేస్తుందన్నది సత్యమా?

కృ: వర్తమానమంటే ఏమిటి? అదంటే ఏమిటో మీకు తెలుసా? ఎందరో బుద్ధిజీవులు ప్రతిపాదించినట్లు మీరూ, 'వర్తమానంలో జీవించండి' అంటారు. వాళ్ళకు భవిష్యత్తు నిరాధారంగా అర్థరహితంగా వుంటుంది గనుక ప్రతిపాదిస్తారు. కనుక 'వర్తమానంలో జీవించు. వర్తమానంలో చేస్తున్నదానిని ఉన్నతంగా చేయి, దానితో పూర్తిగా ఉండు' అంటారు. వర్తమానమంటే ఏమిటో మనం తెలుసుకోవాలి. 'ఇప్పుడు' అంటే ఏమిటి? 'ఇప్పుడు' అంటే ఏమిటో, వర్తమానం అంటే ఏమిటో? మీకు తెలుసా? వర్తమానం అనే విషయమున్నదా? కాదు, దయచేసి దానిగురించి ఊహించవద్దు, పరిశీలించండి, 'ఇప్పుడు' అంటే ఏమిటో, వర్తమానం అంటే ఏమిటో మీరు ఎప్పుడయినా గమనించారా; ఇప్పటి దాని ఎరుకతో మీరుండగలరా? అదేమిటో తెలుసా? లేక గతం మాత్రమే, ఏదయితే వర్తమానంలో పనిచేస్తుందో, ఏది భవిష్యత్తును సృష్టిస్తుందో ఆ గతం మాత్రమే మీకు తెలుసా? మీరు గ్రహిస్తున్నారా? 'వర్తమానంలో జీవించు' అని మీరన్నప్పుడు యదార్థంగా ఆ వర్తమానమంటే ఏమిటో మీరు తెలుసుకోవాలి. అసలటువంటిది వున్నదా? వర్తమానమనేది ఉన్నదేమో తెలుసుకోవడానికి గతాన్ని మీరర్థం చేసుకోవాలి. ఒక మనిషిలాగా మీరేమిటో పరిశీలించినప్పుడు మీరు పూర్తిగా గతానికి ఒక ఫలితంగా వచ్చినట్లు చూస్తారు. మీలో కొత్తదనం ఏమీ లేదు, మీరు నకలు మనుష్యులు. వర్తమానాన్ని చూస్తున్న గతం మీరు. వర్తమానాన్నే తర్జుమా చేసుకుంటున్నారు. వర్తమానము ఒక సవాలవడము. ఏది గతానికి ఫలితమో, ఆ బాధను ఆందోళనను, డజను విషయాలను చూస్తూ చాలా భయపడుతూ ఏది మరొక సుఖాన్ని మళ్ళీ కలుగజేస్తుందో ఆ రేపటి గురించి ఆలోచిస్తూ దానివంక మీరు చూస్తారు. 'ఇప్పుడు'ను అర్థం చేసుకోవడం ధ్యానంలో ప్రధానమయిన సమస్య. ధ్యానమంటే అదే. గతాన్ని పూర్తిగా అర్థం చేసుకోవడము, దాని ప్రాముఖ్యత ఎక్కడున్నదో చూడడము. పూర్తిగా ముఖ్యముకానిదేదో చూడడము. కాల స్వభావాన్ని గ్రహించడము. అంతా ధ్యానంలో ఒక భాగము. మరొక సాయంకాలము బహుశా మనమందులోనికి వెళ్ళగలము. అయితేనండీ, మీరు ధ్యానం చేయగలగడానికి ముందుగా నార్మికత అనే పునాది, అంటే భయం లేకుండా ఉండాలి. భయం ఏ రకంగా ఉన్నా రహస్య మయినదయినా లేదా స్పష్టంగా ఉన్నా ధ్యానమనప్పుడు ప్రమాదకారి అవుతుంది. ఎందుకంటే, అద్భుతమైన పలాయనాన్ని ధ్యానం చూపుతుంది. ధ్యానంచేసి మనసేమిటో తెలుసుకోవడం గొప్ప విషయాలలో ఒకటి.

## 3

నిన్న మనమనుకున్నట్లు, శాస్త్రాలతో, సిద్ధాంతాలతో, కల్పనాత్మక తత్త్వశాస్త్రాలతో మనకు సంబంధంలేదు. ఉన్నటువంటి యదార్థాలతో, వాస్తవంగా ఉన్నదేదో దానితో సంబంధమున్నది. నిర్మోహంతో, ఉద్వేగరహితంగా, 'ఏది ఉన్నదో' అర్థం చేసుకోవడంలోనే

మనం దానిని అధిగమించి దాటిపోగలము. ఈ ప్రసంగాలన్నింటిలో ఒక భావనగానీ,ఆ భావనను కాదనడం గానీ ముఖ్యం కాదు. నిరాశతో, గాఢమయిన అనుభూతి లేకుండా ఉన్న జీవిత సంక్లిష్టతలలోనికి, దు:ఖంలోనికి ఎంతో కొంత వెళ్ళడం ముఖ్యమయినది. ఆంగ్లంలో మూలపదమయిన 'గాఢానుభూతి' అన్న పదానికి అర్థం దు:ఖం. అయితే దు:ఖాన్ని సూచిస్తూనో లేదా కోపం, ద్వేషం, ప్రతిఘటనల ద్వారా వచ్చే శక్తిని సూచిస్తూనో ఆ పదాన్ని వాడడం లేదు. ప్రయత్నం లేకుండా ఎక్కడ ప్రేమ ఉంటుందో అక్కడ సహజంగా వచ్చే గాఢానుభూతిని సూచిస్తూ వాడుతున్నాము. ఈ సాయంకాలం మరణాన్ని, జీవితాన్ని, ప్రేమనుగురించి మనం మాట్లాడుకోవాలి.

కేవలం వర్ణనపట్ల, వివరణపట్ల, మనం శ్రద్ధ చూపడం లేదు గాని కొంతమేరకు సమస్యను లోతుగా అర్థం చేసుకోవడము దానితో ఆ సమస్యలోనికి పూర్తిగా ప్రవేశించడము, అలా చేయడంతో మన జీవితానికి అదే ఊపిరి అవడము గురించి శ్రద్ధ వహిస్తున్నాము. కేవలం మేధో సంబంధంగా కాదు. జీవించడమనే ఈ సమస్య మొత్తం ఏమిటో చూసి, గ్రహించి, దృష్టి సారింపగలమా? జీవితాన్ని, ప్రేమను, మరణాన్ని విశ్లేషణాత్మకంగానో, సైద్ధాంతికంగానో గాక నిజంగా పట్టుకోగలమా? అతీతంగా ఉన్నదేదో ఊహించడం వృథా అని నా కనిపిస్తుంది. ఏది ఏమయినా దానికి విలువ లేదు. జీవిత ప్రాముఖ్యం మొత్తాన్ని అర్థంచేసుకోవడానికి జీవితమంటే ఏమిటో తాను పరీక్షించాలి. ప్రపంచమంతటా తెలివిగలవారు జీవించడానికి అతీతంగావున్న ఒక మహత్తును వెతికారు. కేవలం ఒక అంతిమమయిన దానికి ఈ జీవితమొక మార్గమని మతపరంగా చెప్పారు. ఏ మతధర్మమూ అనుసరించనివారు జీవితానికి అర్థంలేదన్నారు. ఆ తరువాత వారి బుద్ధికి, వారి నిబద్ధతకు అనుగుణంగా కొంత ప్రాధాన్యతను కనుగొనడానికి ఉపక్రమిస్తారు. ఈ సాయంకాలం మనమది చేయబోవడంలేదు. జీవించడం ఉన్నదిఉన్నట్లుగా మనం చూడబోతున్నాము. ఉద్వేగపూరితంగానో, భావ గర్భితంగానో చూడక, అదేమిటో వాస్తవంగా చూడడము. తానెప్పుడు ఒక్క భాగాన్ని గాక మొత్తం జీవితంవైపు పూర్తిగా చూడగలడో. అది అర్థవంతంగా వుంటుందను కుంటాను. బహుశా జీవితానికప్పుడు ఒక అర్థాన్నో లేదా ప్రాధాన్యాన్నో యివ్వకుండా జీవితసౌందర్యాన్ని దాని విశాలతను మనం చూస్తాము. మనం దేనిని జీవించడ మంటున్నామో దేనిని వాస్తవంగా చేస్తున్నామో దానిని లోతుగా పరీక్షిస్తేనే ఆ సౌందర్యాన్ని జీవించడంలో అసాధారణ లక్షణాన్ని అర్థం చేసుకోగలము, లోతుగా అనుభూతి చెందగలము. జీవించడమంటే ఏమిటో, అర్థం చేసుకోకుండా మరణమంటే ఏమిటో ప్రేమంటే, ఏమిటో మనమర్థం చేసుకోలేము.

'ప్రేమ', 'మరణము', 'జీవించడము'అనే పదాలను మనం చాలా తేలిగ్గా ఉపయోగిస్తాము-ప్రతి రాజకీయవేత్త ప్రేమగురించి మాట్లాడుతాడు. ప్రతి మతాచార్యునికి పెదాలమీదే ఆ పదముంటుంది. ప్రేమ, మరణం రెండూ అమిత ప్రధానమయినవి. మరణమంటే ఏమిటో అర్థం చేసుకోకుండా ప్రేమను అర్థం చేసుకోవడ ముండదు.

మరణమంటే ఏమిటో అర్థం చేసుకోవడానికి తాను జీవితమంటే ఏమిటో ఎంతో లోతుగా గొప్ప చిత్తశుద్ధితో అర్థం చేసుకోవాలి. స్వేచ్ఛగా, నిజంగానే ఎటువంటి ఆశా పెట్టుకోకుండా పరీక్షించాలి, పరీక్షించాలంటే మనం నిరాశా స్థితిలో ఉండాలని గాదు. నిరాశతో నున్న మనసు నిర్లిప్తమవుతుంది. బరువెక్కిన మనసు అప్పటికే పాక్షిక దృష్టితో ఉంటుంది గాబట్టి సరిగా పరీక్షించలేదు. కాబట్టి జీవించడమంటూ మనం పిలుస్తున్నదానిని, నిత్య జీవిత చర్యను వీక్షించడానికి స్పష్టత కావాలి, ఆలోచన గాదు, గ్రహించగల్గిన స్పష్టత, ఉన్నదేదో దానిని నిజంగా చూసే స్పష్టత.

'ఉన్నదేదో' చూస్తుండడమే. ఆ క్రియే గాఢానుభూతి. మనలో చాలామందికి ద్వేషాన్నుండి, దుఃఖాన్నుండి, కోపాన్నుండి, ఒత్తిడినుండి, 'గాఢానుభూతి' ఎప్పుడూ లభ్యమవుతుంది. లేదా ఏది మోహమవుతుందో ఆ సుఖం ద్వారా గాఢానుభూతి తీసుకు రాబడుతుంది. జీవించడం అనే యీ ప్రక్రియ మొత్తాన్ని అర్థం చేసుకోవడానికి కావలసిన శక్తి అటువంటి గాఢానుభూతికి ఉండదు. నిజంగా అర్థం చేసుకోవడమే గాఢానుభూతి. గాఢానుభూతిలేకుండా మీరేమీ చేయలేరు. బౌద్ధికమయిన గాఢానుభూతి గాఢానుభూతే కాదు. జీవించడం మొత్తాన్ని పరీక్షించడానికి ప్రత్యక్ష గ్రాహ్యతలోని అసాధారణ స్పష్టతేగాక గాఢానుభూతియొక్క తీక్షణత కూడా అవసరము.

కాబట్టి మనం జీవించడమని దేనినంటున్నాము? ఎలా వుండాలది అని మనమను కోవడం గాదు. అది కేవలం ఒక భావన. దానికి వాస్తవత లేదు. అది ఉన్నదికి కేవలం వ్యతిరేకం అయినది. ఉన్నదానికి వ్యతిరేకంగా ఉండేది. విభజనను సృష్టిస్తుంది. ఈ విభజనలో ఘర్షణ వున్నది. జీవించడమంటే ఏమిటో చూడడంలో ఎలా వుండాలి? అన్న భావాన్ని మనం సమూలంగా బహిష్కరించాలి. ఎందుకంటే, సిద్ధాంతపరంగా చూడడంలోనికి పారిపోవడము పూర్తిగా అసత్యం. కాబట్టి బహిష్కరించాలి. జీవించడమంటే నిజంగా ఏమిటో మనం పరీక్షించబోతున్నాము. పరీక్షించడం కంటే పరీక్షించే లక్షణం ఎంతో ప్రధానమయింది. మనసుకు కొంత పదును, కొంత సున్నితత్వం ఉంటే తెలివిగల వారెవరయినా పరీక్షించగలరు. తెలుసుకోవడం కేవలం బౌద్ధికమే అయితే కరుణ, వాత్సల్యము, శ్రద్ధఅన్న కొన్నిలక్షణాలున్నప్పుడు ఉండే ఆ సున్నితత్వాన్ని పోగొట్టు కుంటుంది. బహు స్పష్టంగా చూసే ఆ లక్షణంతో మనసుండడానికి శ్రద్ధ, వాత్సల్యం, కరుణ అనే ఈ లక్షణాలుండాలి. అయితే వాటిని బుద్ధి ఒప్పుకోదు. మన దైనందినజీవితంలో యదార్థంగా జరుగుతున్నదేమిటో పరీక్షించడంలో బుద్ధి అందిస్తున్న వాటిపట్ల మనం అప్రమత్తంగా వుండాలి. వర్ణన వర్ణింపబడినదిగాదని, పదం విషయముగాదని తెలుసుకునేందుకు నేనామాట వాడవచ్చునంటే-హెచ్చరిక అవసరము.

మనం యింతకుముందు అనుకున్నట్లు జీవితమంటే ఏమిటో అర్థం చేసుకోకుండా మరణమంటే ఏమిటోఎప్పటికీ అర్థంచేసుకోలేము. మరణమంటే ఏమిటో తెలుసుకోకుండా ప్రేమన్నది కేవలం సుఖమవుతుంది. దానితో అది బాధ అవుతుంది. 'జీవించడం' అని మనం దేనినంటున్నాము? నిత్య జీవితాన్ని చూస్తుంటే మనుషులతో, భావాలతో, ఆస్తితో,

వస్తువులతో ఉండే ప్రతిబంధంలో గొప్ప ఘర్షణ వున్నది. మనకు ప్రతి సంబంధం ఒక యుద్ధరంగమయింది. ఒక ఘర్షణయింది. జీవించడమంటే మనం పుట్టినప్పటి నుండి మరణించేవరకు సమస్యలను ప్రోగుచేసుకోవడంతో, వాటినెప్పటికీ పరిష్కరించక పోవడంతో, అన్నిరకాలయిన అంశాలతో బరువెక్కుతున్న ఒక ప్రక్రియ. మౌలికంగా, ఎందులోనయితే మనిషికి వ్యతిరేకంగా మనిషి ఉంటున్నాడో ఆ రంగము, కనుక జీవించడమంటే ఘర్షణ. దానినెవరూ కాదనలేరు. మనకు నచ్చినా, నచ్చకున్నా మనమంతా ఘర్షణలో వున్నాము. అనంతంగావున్న ఈ సంఘర్షణ నుండి మనం బయట పడదామనుకోవడంతో ఫుట్‌బాల్ ఆటనుండి, దేవుని ప్రతిమవరకూ ఎన్నో రకాలయిన పలాయనాలను కనుగొన్నాము. మనలో ప్రతి ఒక్కరికీ సంఘర్షణ బరువే గాక దుఃఖం, ఒంటరితనం, నిరాశ, ఆందోళన, అత్యాశ, అసంతృప్తి, అమిత విసుగు, రోజువారీ కార్యక్రమమూ తెలుసు. దేనినయితే మనసు అసాధారణమయినదేదో ననుకుంటూ మళ్ళీ కావాలనుకుంటూ వెంటనే పట్టు కుంటుందో ఆ ఆనందపు మెరుపులు అప్పుడప్పుడూ ఉంటాయి. అప్పుడా ఆనందం ఒక స్మృతి అంటే బూడిదవుతుంది. మనం జీవించడమని మనం పిలుస్తున్నది దానినే. మనం జీవితం వంక చూసుకుంటే, మాటలతోనో, లేదా బౌద్ధికంగానో గాక యదార్థాన్ని అలాగే చూసుకుంటే అదెంత శూన్యమో చూస్తాము. నలభై, ఏభై సంవత్సరాలు డబ్బు సంపాదించి కుటుంబాన్ని పోషిస్తూ తదితరమైనవి చేయడం ప్రతిరోజూ ఆఫీసుకు వెళ్ళి గడపడమూగురించి ఆలోచించండి. మనం జీవితమని దేనిని అంటున్నామంటే డబ్బును ముసలితనం, మరణాలతో నున్నదానిని, ఈ దుఃఖాన్ని మతం ద్వారా, తాగుడుద్వారా, పాండిత్యంద్వారా, లైంగికతద్వారా లేదా మరొకటిద్వారా అన్ని రకాలయిన వినోదాల ద్వారా తప్పించుకోవడానికి ప్రయత్నిస్తాము. మన సిద్ధాంతాలు, ఆశయాలు తత్త్వాలతో పాటుగా మనకున్నటువంటి జీవితమిది. మనం ఘర్షణలో, దుఃఖంలో జీవిస్తాము.

మనకేది ఉచ్చు అయిందో, ఎందులోనయితే చిక్కుకున్నామో, ఆ సంస్కృతిని, ఆ సమాజాన్ని జీవితం తెచ్చి పెట్టింది. మనచేతనే ఆ ఉచ్చు తయారుచేయబడింది. అందుకే మనలో ప్రతి ఒక్కరమూ ఆ ఉచ్చుకు బాధ్యులము. స్థాపితమయిన క్రమతకు వ్యతిరేకంగా ఉద్యమించినా గానీ ఆ క్రమతను ఏర్పాటు చేసి, నిర్మాణం చేసుకున్నది మనమే. అందుకే దానికి వ్యతిరేకంగా ఉద్యమించడంలో ఉన్న అర్థం బహు స్వల్పము. ఎందుకంటే, మీకు తిరిగి మరొక క్రమతనేర్పరచి, మరొక పెత్తనాన్ని సృష్టిస్తారు. జాతీయ విభేదాలను, జాతిమత విభేదాలను, యుద్ధాలను, రక్తపాతాన్ని, కన్నీళ్ళను దీనంతటినీ జీవితమంటున్నాము. మనకేమి చేయాలో తెలియదు. మనమెదుర్కొంటున్నదిది. ఏమి చేయాలో తెలియక పారిపోవడానికి ప్రయత్నిస్తాము. లేదా ఏమి చేయాలో చెప్పేందుకు ఒక అధికారాన్ని, గురువును, ఆచార్యులను, 'చూడు-ఇదీ మార్గం' అని ఎవరు చెప్తారో వారిని కనుగొనేందుకు ప్రయత్నిస్తాము.

ఆచార్యులు, గురువులు, మహాత్ములు, తత్త్వవేత్తలు మనలను ఎందుకూ పనికి

రానట్లుగా నడిపించారు. ఎందుకంటే, మన సమస్యలను మనంనిజంగా పరిష్కరించు కోలేము. మన జీవితాలూ భిన్నంగాలేవు. మనమూ అదేవిధంగా దురాశతో, సంతోష రహితంగా దు:ఖపూరితులమై వున్నాము. కనుక మొదటి విషయమేమంటే ఎవరినీ, వక్తతో సహా ఎవరినీ ఉనుసరించకూడదు. ఎలా ప్రవర్తించాలోఎలా జీవించాలో తెలుసుకునేందుకు ఎప్పటికీ ప్రయత్నించొద్దు. ఎందుకంటే ఎవరో చెప్పేది మీ జీవితంగాదు. మీరు మరొకరిని నమ్మితే వారిమీద ఆధారపడితే మిమ్మల్ని తప్పు త్రోవపట్టిస్తారు. గురువు, తత్త్వవేత్త, సిద్ధాంతవేత్త, అతడు కమ్యూనిస్టు గావచ్చు లేదా మత తత్త్వవేత్త గావచ్చు, అతని అధికారాన్ని మీరు కాదంటేనే మీ వంక మీరు చూసుకొని సమాధానాన్ని పొందగలరు. అయితే మరొకరిని నమ్మి అతని మీద ఆధారపడినంతవరకు అతడెంత వివేక వంతుడయినా, తాను కోల్పోయినట్లే. తనకు తెలుసునని చెప్పే మనిషికి తెలియదు. కనుక మొదటి విషయమేమంటే ఎవరినీ అనుకరించకపోవడము. మనకు ఏమి చేయాలో తెలియదు గనుక అది చాలా కష్టము. నమ్మడానికి, అనుసరించడానికి మనం బాగా నిబద్ధులమయాము.

జీవించడమని పిలువబడే యీ విషయాన్ని పరీక్షించడంలో మనం నిజంగానే సైద్ధాంతికంగా అన్ని రకాలయిన మానసిక అనుసరణను, ఏమి చేయాలని మనకెవరు చెప్తారో ఆ మనిషిని కనుగొని ప్రతి ఆరాటాన్ని ఒకప్రక్కకు పెట్టాలి. సత్యాన్నెవరు చెప్తారో గందరగోళంగా వున్న మనసెలా కనుగొంటుంది? తనలోని గందరగోళానికి అనుగుణంగా, గందరగోళపడే మనసు అటువంటివారినే ఎన్నుకుంటుంది. కనుక ఎవరినీ నమ్మి ఆధారపడవద్దు, మనమలా చేస్తే ఎంతో బరువును, పుస్తకాలమీద ఆధారపడటమనే బరువును, ప్రపంచంలోని సిద్ధాంతాల బరువును మోస్తున్నట్లు. అది చెప్పనలవిగానంత బరువు. దానినొక ప్రక్కన పెట్టినప్పుడే పరిశీలించే స్వేచ్ఛ మీకుంటుంది. అప్పుడు మీకు ఒక అభిప్రాయము, ఒక సిద్ధాంతము, ఒక నిర్ధారణ ఉండవు, కాని ఉన్నదేదో దానిని యదార్థంగా చూస్తారు. అప్పుడు మీరు చూడగలరు, తాను జీవిస్తున్న ఈ సంఘర్షణంతా ఏమిటి? అనగలరు.

వక్త మాటల మీద ఆధారపడకుండా మీరంతా గూడా పరిశీలిస్తున్నారని ఆశిస్తాను. పరిశీలిస్తున్నప్పుడు తనతో వైరుధ్యమున్నంతవరకూ, పరస్పర విరుద్ధమయిన కోరికల వైరుధ్యమున్నంతవరకూ, 'ఉన్నదేది, ఉండవలసిందేది' అనే వ్యతిరిక్తమున్నంతవరకూ ఘర్షణ ఉండడము చూస్తారు. ఉండవలసినది, ఉన్నదానికి వ్యతిరేకము. ఉండేదానితో ఉండవలసినది రూపుదిద్దబడుతుంది. కనుక వ్యతిరేకమయిన అది కూడా 'ఉండేదేది' అన్నదే. ఎందులో ఘర్షణ ఉన్నదో ఆ ఘర్షణ ప్రక్రియే జీవించడము అంటే 'ఉన్నదేదో' అది నిజం. అందుకు వ్యతిరేకమేదంటే, ఎందులో ఘర్షణ, హింసలేదో ఆ 'అహింస' ఎవరు హింసాపరుడో ఆ మనిషి అహింసాపరుడవాలని ప్రయత్నిస్తున్నాడు. అహింసా పరుడవడానికి పదేళ్ళు పట్టవచ్చు. లేదా మిగిలిన జీవితమంతా పట్టవచ్చు. ఈ మధ్య కాలంలో హింసాబీజాల నతడు నాటుతున్నాడు. కనుక అక్కడ హింస అనే వాస్తవం,

అందుకు వ్యతిరేకమయిన ఆ అహింస అనే అవాస్తవం వున్నాయి. ఈ వైరుధ్యంలో మనిషి ఏదోకావడానికి ప్రయత్నించడంలో ఘర్షణ వున్నది. మీరు వ్యతిరేకమయిన దానిని రానివ్వకుండా వుండగల్గితే, అహింసాపరుడు గావాలని ప్రయత్నించకుంటే అప్పుడు యదార్థంగా హింసనెదుర్కొనగలరు. అప్పుడు వ్యతిరేకమయిన దానిలో నున్న ఘర్షణవలన ఏది విచ్ఛిన్నమవదో ఆ శక్తి వుంటుంది. అప్పుడు 'ఉండేదేదో' కనుగొనే శక్తి, గాఢానుభూతి ఉంటాయి.

దీనిని నేను స్పష్టం చేస్తున్నానా? భావప్రసార మెంత ప్రయాసతో కూడుకున్నదయినా, భావప్రసారానికంటే అత్యంత ముఖ్యమయినది. 'ఒక్కటయి గ్రహించడము' ఈ సమస్యపై యిరువురికీ ఏకదృష్టి కలగడము. అంటే మన యిరువురమూ ఒకేసారి ఒకే స్థాయిలో పరిశీలించి నేర్చుకునే, కనుగొనే ఉద్దేశ్యంతో ఉండడము. అప్పుడే ఇరువురూ ఒక్కటవడమూ, అది భావప్రసారాన్ని మించిపోవడమూ జరుగుతుంది. మనం యీ రెండింటి కోసం భావ ప్రసారము చేసుకోవడానికి ప్రయత్నించడమే గాక అదే సమయాన ఈ సమస్యను ఒకేదృష్టితో చూసే ఏకస్థితికి ప్రయత్నిస్తున్నాము. ప్రచారం గాదిది. మిమ్మల్ని ప్రభావితం చేయాలని, నచ్చచెప్పాలని, మీ మీద ఇది రుద్దాలనీ మేము ప్రయత్నించడం లేదు. కేవలం పరిశీలించమంటున్నాము.

వ్యతిరేకమయినదెక్కడుంటే, అక్కడ వాస్తవంగా ఉన్నదేమిటో పరిశీలించడము, చూడడము, సాధ్యం గాదన్నది అప్పుడు చూశాను. ఆశయమనేది వైరుధ్యానికి, అందుచేత ఘర్షణకు కారణము. మీరు కోపంగా ఉన్నప్పుడు, 'నేను కోపంగా ఉండకూడదు' అంటే ఆ 'ఉండగూడదు' అనుకోవడం వైరుధ్యాన్ని తెస్తున్నది. దాని వలన అక్కడ కోపానికి తాను కోపంగా ఉండరాదన్న నటనకు మధ్య విభజన వుంటున్నది. మీ కోపాన్ని రానివ్వడానికి, దాని ఎరుకతో ఉండడానికి, ఆ కోపముయొక్క ప్రాముఖ్యాన్ని చూడడానికి మీకు శక్తి కావాలి. ఘర్షణద్వారా వ్యతిరేకమయినదానికోసం ప్రయత్నించడంద్వారా ఆ శక్తి చెల్లాచెదురై పోతుంది. కనుక వ్యతిరేకతను మీరు పూర్తిగా వదిలేయగలరా? వ్యతిరేకమయినది కేవలం ఒక ఆశయమేగాక కొలిచే, పోల్చే ప్రక్రియ గనుక వదిలేయడం చాలా కష్టము. ఎప్పుడూ పోల్చడము ఉండదు. అక్కడ వ్యతిరేకమయినది ఉండదు.

ఒక ముఖ్య పాత్రధారితో, ఒక దైవ సమానునితో, ఒక పెద్దమనిషితో మనను పోల్చి అంచనా వేయడానికి తర్ఫీదు పొందామని, నిబద్ధులమయ్యామని మీకు తెలుసు. ఉండేదేదో పరిశీలించడానికి పోల్చడమంతటి నుండి, ఆశయాన్నుండి, వ్యతిరేకమయిన దానినుండి మన మనసు స్వేచ్ఛనొందాలి. అప్పుడు వ్యతిరేకమయినది తెచ్చిన వైరుధ్యాన్ని ఒక పక్కకు పెట్టే శక్తి, సజీవత్వము ఉంటాయి. పోల్చే ప్రక్రియనుండి స్వేచ్ఛనొందడానికి క్రమశిక్షణ గావాలి. వ్యతిరేకమైన దాని వ్యర్థతను అర్థం చేసుకోవడంలోనే ఆ క్రమశిక్షణ వస్తుంది. దీనిని దగ్గరగా పరిశీలించడానికి ఆ సంఘర్షణ స్వరూప స్వభావాలు మొత్తాన్ని చూడడానికి, చూడడమనే యీ చర్యే క్రమశిక్షణను ఆశిస్తుంది. అదే క్రమశిక్షణ. క్రమశిక్షణ అంటే నేర్చుకోవడం. మనము అణచివేయడలేదు. మనమేదో అయిపోవాలని,

అనుసరించాలని కట్టుబడి వుండాలని ప్రయత్నించడంలేదు. నేర్చుకుంటున్నాము. ఈ క్రమశిక్షణ అసాధారణ ఒద్దికతో, సున్నితంగా ఉంటుంది.

ఈ ఘర్షణను మనలో ప్రతి ఒక్కరమూ పరీక్షిస్తూ వున్నాము. వ్యతిరేకమయిన దానివలన ఘర్షణ వస్తుంది అన్నాము. వ్యతిరేకమయినది గూడా ఘర్షణలో భాగమే. వ్యతిరేకమయినది గూడా ఉన్నదే. ఉన్నదానిని అర్థం చేసుకోలేక పరిష్కరించలేక 'ఎలా వుండాలి' లోనికి మనసు పారిపోతుంది. దానినంతా ఒక పక్కన పెడితే ఉన్నదానిని అంటే హింసను మనసు దగ్గరగా పరిశీలింపగలదు. దీనిని ఒక ఉదాహరణగా తీసు కున్నాము. కాబట్టి హింస అంటూ మనం పిలుస్తున్నదేమిటి? హింసకు వ్యతిరేకమయినది లేనప్పుడు వాస్తవంగా కోపమనే ఆ యదార్థాన్ని ద్వేషమన్న అనుభూతిని ఎదుర్కొన్నప్పుడు అక్కడ హింస వుంటుందా? కోపముంటుందా? దానిలోనికి వెళ్ళండి. నేను సూచింపవచ్చునంటే దీనిని మీలోనే చూడవచ్చు. దీనిలోనికి చాలా వివరంగా పోతాను. ఎందుకంటే, మరణమంటే ఏమిటో, ప్రేమంటే ఏమిటో మనమర్థం చేసుకోవాలి. కనుక కొంత త్వరగా ముందుకు వెళదాము.

జీవించడము అని మనమంటున్నదేదో అది ఘర్షణ. ఆ సంఘర్షణేమిటో మనం చూశాము. ఆ సంఘర్షణను అర్థం చేసుకుంటే 'ఉన్నదేదో' అదే నిజం. నిజాన్ని పరిశీలించడమే ఉన్నదానినుండి మనసును విడుదల చేస్తుంది. మన జీవితంలో చాలా దుఃఖం గూడా వున్నది. దానిని లేకుండా చేయడమెలాగో మనకు తెలియదు. దుఃఖం అంతమయి పోవడంతో వివేకం మేల్కొంటుంది. దుఃఖమేమిటో, దాని స్వరూప స్వభావాలేమిటో తెలియకుండా ప్రేమంటే ఏమిటో మనకు తెలియదు. ఎందుకంటే, మనకు ప్రేమంటే దుఃఖం, బాధ, సుఖం, అసూయ. ఒక భర్త తన భార్యకు ఆమెను ప్రేమిస్తున్నానని చెప్పిన ఆ సమయానే అత్యాశతో వుంటే ఆ ప్రేమకున్న అర్థమేమిటి? అత్యాశాపరుడయిన మనిషి ప్రేమించగలడా? పోటీ పడే మనిషి ప్రేమించగలడా? అయినప్పటికీ మనం పోటీ పడుతూనే, అత్యాశతో, మనదైన స్వంత స్థానం, పురోగమనం యిత్యాదిని వెతుక్కుంటూనే ప్రేమగురించి, ఆర్ద్రత గురించి యుద్ధాన్ని ఆపడంగురించి మాట్లాడుతాము. ఇదంతా దుఃఖాన్ని తెస్తుంది. దుఃఖం అంతమవగలదా? నిజంగా వున్నది అదే గనుక మిమ్మల్ని మీరు అర్థంచేసుకున్నప్పుడు మాత్రమే దుఃఖం అంతానికొస్తుంది. అప్పుడు మీకు దుఃఖమెందుకు కలిగిందో, తనపై తనకు జాలో లేదా ఒంటరితనమనే భయమో, మీ స్వంత జీవితం శూన్యమవుతుందనో, మరొకరిపైన ఆధారపడడంతో మీకు వచ్చే దుఃఖమో అర్థంచేసుకుంటారు. మన జీవితంలో యిదంతా ఒక భాగం. మన మిదంతా అర్థం చేసుకున్నప్పుడు మరెంతో పెద్దదయిన మరణమనే సమస్యలోని కొస్తాం. పునర్జన్మగురించి, మరణం తర్వాత ఏమి జరుగుతుందోనన్న దానిగురించి మాట్లాడు కోవడంలేదని దయచేసి మనసులో పెట్టుకోవాలి. మనం దాని గురించి, మరణభయంతో ఎవరున్నారో వారిగురించి మాట్లాడుకోవడం లేదు.

నిన్న మనం భయమనే ప్రశ్నలోనికెళ్ళాం. భయాన్నుండి మనసు విడుదలయితే

అప్పుడు మరణమంటే ఏమిటి? వ్యాధి, స్మృతిని కోల్పోవడము, వేల రుగ్మతలు, వయసు పైబడడమనే భయం-వృద్ధాప్యం యీ యిబ్బందులన్నింటితో ఉంటుంది. ఈ దేశంలో వృద్ధులందరినీ యువకులని పిలుస్తారు. ఎనభై ఏళ్ళ స్త్రీ యువతి అని పిలవబడుతుంది. ప్రజలు భయపడతారు. ఎక్కడ భయముంటే అక్కడ అవగాహన వుండదు. తన గురించి జాలిపడితే దుఃఖంపోదు. కాబట్టి మరణించేది ఏది? జీవి అంతమవుతుందన్నది రూఢియే. మనిషి జీవించేది తొంబది సంవత్సరాలు. శాస్త్రవేత్తలు మందేదయినా కనుక్కొంటే నూటయాభై సంవత్సరాలు జీవించవచ్చు. ఇప్పుడు మనం జీవిస్తున్నట్లే నూటయాభై సంవత్సరాలు జీవించాలని ఎందుకనుకుంటాడో దేవుడికే తెలియాలి! అయినప్పటికీ మీరు నూటఏభయి సంవత్సరాలు జీవించేసరికి జీవి ఉడిగిపోతుంది. ఎందుకంటే మనం ఘర్షణలో, భయంలో, ఆదుర్దాలో, జంతువులనూ, మనుషులనూ చంపుకుంటూ చాలా ఘోరమైన తప్పుదారిలో జీవిస్తున్నాము. మన జీవితాలను ఎంత చిందరవందర చేస్తున్నామో! కాబట్టి వృద్ధాప్యం భయంకరమైన విషయము. అయినా ఎప్పుడూ మరణం యవ్వనులకూ వుంటుంది. మధ్యవయస్కులకూ వుంటుంది. ఏ మరణమయితే తప్పదో ఆ భౌతికమరణంగాక మరణమంటే మరింత అర్థమేమిటి? కేవలం భౌతికమయిన దేహం అంతమవడమే గాక మరణానికి లోతయిన అర్థమున్నది. మానసికంగా 'నా, 'మీ' అన్నవి అప్పటికప్పుడే అంతానికి రావడము. అంటే 'నేను', 'మీరు' ఆర్జించిన జ్ఞానం, పడిన కష్టం, సుఖమయ లేదా బాధాకర జ్ఞాపకాలు, తెలిసిన వాటి తాలూకు వేదనలు అన్నీ, మానసిక సంఘర్షణలు, తాను అర్థం చేసుకున్న విషయాలు తాను చేయాలనుకుని చేయని విషయాలు. వీటన్నింటి మధ్య నేను 'మీరు' అంతమవడం. మానసిక పోరాటము, జ్ఞాపకాలు, సుఖం, బాధలు అవన్నీ అంతమవడము. నిజానికి తనకున్న భయమదే. మరణానికి ఆవల వున్నదేమిటోనన్నది గాదు. తెలియని దానిగురించి ఎప్పటికీ తాను భయపడడు. తెలిసింది అంతమవుతుంది అన్నదే తనను భయ పెడుతుంది. తెలిసినది అంటే మీ యిల్లు, మీ కుటుంబం, మీ భార్య, మీ పిల్లలు, మీ భావాలు, మీ సామానులు, మీ పుస్తకాలు మిమ్మల్ని మీరు ఏ విషయాలలో ఐక్యం చేసుకున్నారో అది. అదిపోతే మీరు పూర్తిగా ఒంటరి వారయిపోతారేమోనని. అదీ ఆ ఒంటరితనం గురించి మీరు భయపడుతున్నది.

దానిని సైద్ధాంతికంగా చూడక, వాస్తవంగా చూస్తూ తాను స్వంతం చేసుకున్నది, సృష్టించింది, కృషి చేసింది అంతా పోగొట్టుకుంటానేమోనన్న భయాన్ని చూస్తూ ప్రతిరోజూ తనకు తెలుస్తున్న ప్రతిదాని గురించీ మానసికంగా మరణించడం తనకు సాధ్యం గాదా? అనడుగుతాడు. ప్రతిరోజూ మరణించడంతో ప్రతిరోజూ మనసు స్వచ్ఛంగా, లేతగా, అమాయకంగా చూడగలదా? నిజంగా చేయండి. ఎంతటి అసాధారణ విషయాలు జరుగుతాయో తెలుసుకోవచ్చు. అప్పుడు మనసు అమాయకమవుతుంది. పాతమనసు ఎంతటి అనుభవశీలి అయినా ఎప్పటికీ అమాయకంగా ఉండదు. ప్రతిరోజూ బరువులన్నీ వదిలేసి, ప్రతి సమస్యనూ అంతమొందించిన మనసు మాత్రమే నిర్మలమవుతుంది. అప్పుడు జీవితానికి ఉన్న అర్థం పూర్తిగా వేరు. ప్రేమంటే ఏమిటో తానప్పుడు తెలుసు

కోగలడు. ప్రేమంటే సుఖం గాదు అన్నది స్పష్టము. నిన్న మనమనుకున్నట్లు భయంవలెనే సుఖం ఒక ఆలోచనా ప్రక్రియ గనుక సుఖం బాధనుగూడా తెస్తుంది. ప్రేమ ఒక ఆలోచనా ప్రక్రియ అయితే అది ప్రేమవుతుందా? మనలో చాలామందిమి ఈర్ష్యాసూయలతో ఉన్నప్పటికీ ప్రేమగురించి మాట్లాడుతాము. అసూయతో నున్న మనసు ప్రేమించగలదా? తాను ప్రేమిస్తున్నాను అంటే, అది ప్రేమేనా? లేకుంటే మనసు తన సుఖాన్ని రక్షించు కుంటూ భయాన్ని పెంచుతున్నదా? భయమూ, సుఖమూకూడా ఆలోచనలే. అటువంటప్పుడు ప్రేమను పెంపొందించగలమా? దానితో లైంగిక సమస్య వస్తుంది. (నవ్వులు) మీరెందుకు నవ్వుతారు? మీరు నవ్వడం నాకు సంతోషమే. కాని ఎందుకు నవ్వుతున్నారు?

మనం భయం గురించి అన్వేషించినట్లు, జీవితమంటే ఏమిటో అన్వేషించినట్లు, యీ ప్రశ్నను మనం అన్వేషించాలి. లైంగికతను మనమంత పెద్ద విషయం ఎందుకు చేశాము. లైంగికత మనకటువంటి సమస్యెందుకయింది? ప్రతిదీ దానిచుట్టూ తిరుగుతున్నట్లు, యిప్పుడే గాదు గతంలో కూడా అలా తిరుగుతున్నట్లు కన్పిస్తుంది. జీవితంలో యిదెంతో అపురూపమయిపోయింది. ఎందుకయింది? మీరు దయచేసి కనుక్కోండి. మనం ఒక అభిప్రాయాన్ని వెలిబుచ్చడంలేదు. పరీక్షిస్తున్నాము. అది అమిత ప్రధానమయింది. ఎందుకంటే, మొదట బౌద్ధికంగా మనం నకలు మనుషులము. ఇతరులేమి చేశారో, ఏమి చేస్తున్నారో మనకు తెలుసు. ఇతరులు-బుద్ధుడు, క్రీస్తు -ఇతరులంతా ఏమి చెప్పినా దానిని మనం సిద్ధాంతీకరించి వల్లిస్తాము. అది బౌద్ధిక స్వేచ్ఛగాదు. ఆలోచననుండి వచ్చే స్వేచ్ఛగాదు. మనం ఆలోచనతో కట్టి వేయబడ్డాము. ఆలోచన ఎప్పుడూ పాతదే. ఎన్నటికీ, క్రొత్తది కాదు. కనుక స్వేచ్ఛ అనే పదానికి లోతయిన అర్థంలో చూస్తే బౌద్ధికంగా స్వేచ్ఛలేదు. ఎందుకంటే, క్రైస్తవుడో, కాథలిక్కో లేదా కమ్యూనిస్టో చేసే ప్రచారానికి మనం బానిసలము. ఎక్కడా స్వేచ్ఛ లేకుండా ఇక్కడ మాత్రమే ఆ స్వేచ్ఛ ఉన్నది. అదీ స్వేచ్ఛగాదు. ఎందుకంటే, మీరు సుఖంలో, కుటుంబ సుఖమనే బాధ్యతలో చిక్కుకున్నారు. అయితే మీరు కుటుంబాన్ని, పిల్లలను నిజంగా ప్రేమించివుంటే, మీ హృదయంతో ప్రేమించివుంటే యుద్ధం ఒక్కరోజయినా ఉండే దనుకుంటున్నారా?

మీ భద్రత ఉన్నది సుఖంలో గనుక ఆ భద్రతలో బాధ, దుఃఖం, గందరగోళం వున్నాయి, కనుక అన్నింటిలో, లైంగికతతో సహా అన్నింటిలో బాధ, హింస, అవమానము, ఈర్ష్య ఆధారపడడము ఉన్నాయి. దేనిలో స్వేచ్ఛానుభూతి ఉన్నదో ఆ ఒక్కటి గూడా ఒక బంధమవుతుంది. ఇదంతా నిజంగా చూస్తూ మాటల్లో చూడడంగాదు. వర్ణనతో మైమరిచిపోవడం గాదు. ఎందుకంటే, వర్ణన ఎప్పటికీ వర్ణింపబడిన వస్తువుగాదు. మీ కళ్ళతో, మీ హృదయంతో, మీ మనసుతో పూర్తి సావధానంగా చూస్తుంటే మీకు ప్రేమ అంటే ఏమిటో తెలుస్తుంది. మరణమంటే ఏమిటో, జీవితమంటే ఏమిటో గూడా మీకు తెలుస్తుంది.

# 4

మనిషి అశాశ్వతమయినదానిని మించి దేనికోసమో అన్వేషిస్తున్నాడు. బహుశా మన ఊహకందని కాలాన్నుండీ పవిత్రమయింది, ప్రాపంచికము గానిది ఆలోచనకు బుద్ధికి అందనిది ఏదయినా వున్నదా అని ప్రశ్నిస్తూనే వస్తున్నాడు. మనసు కనిపెట్టలేని, ఆలోచన చూపెట్టలేని ఒక కాలరహిత స్థితి, నిజంగా కాలపు ఉనికే లేని మానసిక స్థితి, దివ్యము, పవిత్రము, పూర్ణము (ఆ పదాలను వాడవచ్చునంటే) అంతములేనటువంటి యదార్థ తత్వమొకటి ఉన్నదేమోనని ఎప్పుడూ ప్రశ్నిస్తూనే ఉన్నాడు సంస్థాపితమయిన మతాలు సమాధానాన్నందించినట్లు అనిపిస్తున్నది. అక్కడ సత్యమున్నదని, భగవంతుడు న్నాడని, మనసు అంచనాలకు సాధ్యమవనిదేదో ఉందని అంటారు. ఆ తర్వాత సత్యం అనుకున్న దానిని సంస్థాగతం చేయనారంభించడంతో మనిషి సత్యదూరంగా నడిపింప బడ్డాడు. మీకు దెయ్యంకథ గుర్తుండి ఉండొచ్చు. అది తన మిత్రునితో రోడ్డున నడుస్తున్నప్పుడు ఒక మనిషి తల క్రిందకువంచి రోడ్డు మీదినుండి ఏదో తీసుకోవడం చూశారు. తీసుకుని దాని వంక చూస్తున్నపుడు అతడి ముఖంలో ఎంతో సంతోషం కన్పించింది. ఆ దెయ్యం స్నేహితుడు అతడు తీసుకుంటున్నదేమిటని అడిగితే 'అది సత్యం' అని దెయ్యం చెప్పింది. దానితో మిత్రుడు 'వ్యాపారానికిది నష్టంగాదా?'అన్నాడు. 'కానే కాదు, దానిని నిర్వహించడంలో నేను సహాయపడబోతున్నాను' అని దెయ్యం బదులిచ్చింది. (నవ్వులు)

చేతితోగానీ, మనసుతోగానీ చేయబడిన ఒక మూర్తిని పూజించడము, సంస్థాగతమయిన మత విశ్వాసాలు, ఆచార వ్యవహారాలు, వాటి సౌందర్య భావంతో చాలా సంపూర్ణంగా పవిత్రంగా తయారయ్యాయి. దానితో ఏది కొలతకందనిదో, కాలానికి అతీతమోదాని అన్వేషణలో మనిషి చిక్కుకున్నాడు. ఆ ఉచ్చులో బడ్డాడు. మోసగించ బడ్డాడు. ఎందుకంటే అతనెప్పుడూ ఈ ప్రపంచంతో సంబంధం లేనిదేదో కనుగొనాలని ప్రయత్నించాడు. అసలు నిజానికి సంప్రదాయ, బూర్జువా, పెట్టుబడిదారీ లేదా కమ్యూనిస్టు సమాజాలు యిచ్చేవి మాత్రం ఏమున్నది? తిండి, బట్ట, గూడు తప్పించి అవి యిచ్చేది చాలాస్వల్పము. బహుశా పనిచేయడానికి, డబ్బెక్కువ సంపాదించడానికి అవకాశాలెక్కువ ఉంటే ఉండొచ్చు. కాని చివరకు చూడగా ఆ సమాజాల కివ్వడానికున్నదే బహు స్వల్పము. మనసు ప్రజ్ఞాశీలి, ఎరుక కల్గినదీ అయితే దీనిని తిరస్కరిస్తుంది. భౌతికంగా శరీరానికి కావలసినది ఆహారము, దుస్తులు, నివాసము. అవి తప్పక కావలసిందే కాని ఎప్పుడు వాటికే ప్రాధాన్యత పెరుగుతుందో అప్పుడు జీవితం అద్భుతమయిన తన అర్థాన్ని కోల్పోతుంది. కాబట్టి ఈ సాయంకాలం పవిత్రమయినదేదయినా ఉన్నదేమో, ఆలోచనలతోగానీ, పరిస్థితులతో గానీ కూర్చలేనిది, ప్రచారం ఫలితంగానిది ఏదయినా నిజంగా ఉన్నదేమో మనందరం కనుగొనడానికి సమయాన్ని వెచ్చించడం ఉచితంగా వుండవచ్చు. మనం ఈ ప్రశ్నలోనికి వెళ్ళగలగడం సముచితమైంది. ఎందుకంటే, మాటలతోగానీ, ఆలోచనతోగానీ, ఏ అనుభవంతోగానీ కొలవలేనిదానిని తెలుసు

కొనకపోతే జీవితం, నిత్యజీవితం అమితడొల్లగా ఉంటుంది. బహుశా అందుకే ఈ తరం ఈ సమాజాన్ని నిరాకరించి – అదిగాకపోవచ్చును – దినదిన పోరాటానికి, వికారతకు, క్రూరతకు ఆవల ఏదయినా ఉన్నదా అని చూస్తున్నది.

'ధార్మికమయిన మనసంటే ఏమిటి?' 'ఏది సత్యమో చూడగల్గిన మానసిక స్థితి ఏమిటి?' అన్న ప్రశ్నలోనికి మనం వెళ్ళి విచారణ సాగించగలమా? మీరనవచ్చు - 'సత్యం అన్నదేదీలేదు. దైవమన్నదీలేదు. దేవుడు మృతమయాడు. ఈ ప్రపంచాన్ని మనకు చేతనయినంత బాగా తయారుచేసి దానితో సాగిపోవాలి. అంతులేని గందరగోళం, దుఃఖం, ఆకలి బాధ, మురికివాడలు, జాతివిద్వేషాలు ఉన్నచోట యిటువంటి ప్రశ్నల నడగడమెందుకు? మనం వీటన్నింటిపట్ల శ్రద్ధతో మానవీయ సమాజాన్ని తీసుకు వద్దాము' అని. ఇది చేసేసిఉన్నా – చేస్తారని ఆశిస్తాను – ఈ ప్రశ్ననింకా అడుగ వలసే వుంటుంది. పది, పదిహేను, ఏభయి సంవత్సరాల తర్వాత మీరీ ప్రశ్న నడుగు తారేమో. కాని యీ ప్రశ్నను తప్పక అడుగవలసినదే. కాలాన్ని అంతంచేసే స్థితి ఏదయినా వున్నదా?అని అడుగవలసిందే.

మొట్టమొదట చూడడానికి స్వేచ్ఛ ఉండాలి. అటువంటి స్థితి ఉన్నా లేకున్నా ఏదీ ఉన్నట్లు భావించగూడదు. ఏ భావనో, ఆశో, ఏ భయమో ఉన్నంతవరకూ మనసు వక్రమయి స్పష్టంగా చూడలేదు. కనుక తెలుసుకోవాలంటే స్వేచ్ఛ తప్పక అవసరము. శాస్త్రప్రయోగశాలలోనయినా పరిశీలించాలంటే స్వేచ్ఛగావాలి. మీకు ఒక ఊహా ప్రతిపాదన ఉండొచ్చు అయితే అది మీ పరిశీలనడ్డుకుంటుంటే దానినో ప్రక్క వుంచుతారు. మీరు స్వేచ్ఛలో మాత్రమే పూర్తిగా కొత్తదానిని తెలుసుకోగలరు. కాబట్టి మన మిరువురము కలిసి మాటలతోనేగాక, మాటలకతీతంగా గూడా అందుకు సాహసించబోతుంటే అప్పుడు వ్యక్తిపరకోరికలు, భయం, ఆశ నిరాశలు మొదలయిన అన్నింటినుండీ స్వేచ్ఛ వుండాలి. మనకందుకు మచ్చలేని, నిబద్ధతలేని, స్పష్టమయిన దృష్టి వుండాలి. అప్పుడే మనం స్వేచ్ఛలో నుండి పరిశీలింపగల్గేది. అది మొట్టమొదటి విషయం.

గత మూడు ప్రసంగాలలో భయం, సుఖం అన్న సమస్యలున్నాయని తెలుసు కున్నాము. మనకది స్పష్టమవకపోతే, తనకున్న భయాన్ని ప్రశ్నించుకోకుంటే మనం తర్వాత అన్వేషించబోతున్న దానిని అర్థం చేసుకోవడం సాధ్యంగాదు. మన మనసులు నమ్మకాలతో - క్రైస్తవుల, హిందువుల, బౌద్ధుల నమ్మకాలతో నిబద్ధమయ్యాయన్నది స్పష్టము. ఏ రకమైన నమ్మకాన్నుండయినా సంపూర్ణ స్వేచ్ఛ లేనప్పుడు పరిశీలించడము, ఆలోచనతో కలుషితమవని నిజం ఏదయినా ఉన్నదేమో తెలుసుకోవడము అసాధ్యము. తాను మొత్తం సామాజిక నీతినుండి గూడా స్వతంత్రుడవాలి. ఎందుకంటే, సామాజిక నీతి నీతిగాదు. ఉత్తమనైతికతలేని మనసు, నిబిడీకృతమయిన ధార్మికతలేని మనసు స్వేచ్ఛగా వుండలేదు. అందుకే తనకు తాను అర్థం చేసుకోవడము, తనను తాను తెలుసుకోవడము, తన సంపూర్ణ స్వరూపాన్ని అంటే ఆలోచనలు, ఆశలు, భయాలు, ఆందోళనలు, అత్యాశలు, పోటీ, పోరాట తత్వాలను మొత్తం చూడడము ముఖ్యమైనవి. అర్థం చేసుకుని లోతైన

సత్ప్రవర్తనను అలవరుచుకోకపోతే అక్కడ స్వేచ్ఛ వుండదు. ఎందుకంటే, తనదయిన అస్పష్టతతో, అనుమానాలతో, అవసరాలతో, వత్తిళ్ళతో గందరగోళంలో పడుతుంది.

కాబట్టి ధార్మికమయిన మనసంటే ఏమిటో, అసలు అటువంటిది ఉన్నదేమో అన్న మౌలిక ప్రశ్నలోంచి విచారణ చేయాలంటే చేతనాస్థాయిలోనేగాక లోలోతుల్లో ఉన్న అచేతనా స్థాయిల్లో గూడా స్వేచ్ఛ ఉండాలి. నిక్షిప్తమయి, చీకటిగా, తెలియకుండా ఉండే అంతశ్చేతనేదో ఉన్నదని మనలో చాలా మందిమి అంగీకరించాము. ఆ అంతశ్చేతన మొత్తాన్ని అర్థంచేసుకోకుండా కేవలం విశ్లేషణాత్మక పరీక్షతో ఉపరితలాన్నే తాకటంలో అర్థమే లేదు. అది పండితులు చేసినా, తన విచారణద్వారానయినా. కాబట్టి చైతన్యవంతమయిన మనసులోనికేగాక దీనిలోనికి గూడా ఏదయితే లోలోతుల్లో ఎక్కడో రహస్యంగాదాగి, ఎన్నడూ ప్రజ్ఞాకాంతికి విచారణ వెలుగుకు అభివ్యక్తం కాలేదో, ఆ మనసులోనికి చూడాలి. చేతనా మనసు అంటే దైనికమయిన మనసు పోటీతో విద్యతో పదునెక్కిన మనసు, అటువంటి మనసు లోతుల్లో ఉన్న అంతశ్చేతనా పొరలను పరీక్షించగలదా అన్న ప్రశ్నలోనికిగూడా మనం వెళదామా?

నిధి నిక్షేపాలున్నాయంటూ అందరూ మాట్లాడుకుంటున్న యీ అంతశ్చేతనంటే ఏమిటి? అదేమిటో తెలుసుకోవాలంటే నిపుణులు వ్రాసిన గ్రంథాలన్నింటినీ తిరగ వేయవలసిందేనా? అదేమిటో చెప్పించుకోవడానికి ఒక ప్రతిభావంతుని దగ్గరకు వెళ్ళవలసిందేనా? తనకు తాను దానిని సాక్షికంగా, భాగాలలో గాక సంపూర్ణంగా తెలుసుకోగలడా? మీరు కలలుగనాలి. లేదంటే పిచ్చివారవుతారు అన్నారు. ఎందుకంటే అంతశ్చేతనలో దాగి కనుగొనబడని మనసు పొరలను తెల్పేవి, సూచించేవి కలలేగనుక ఈ లోతుపొరలను వ్యక్తీకరించేవి కలలే. ఈ విధంగా నీవో లేదా విశ్లేషకుడో కలలను వ్యాఖ్యానించగల్గితే అంతశ్చేతనను వెలికి తెచ్చి ఖాళీ చేయగలరు. అసలు కలలు కనడమెందుకని ఎవరూ ప్రశ్నించలేదు. మీరు కల గనాలి. అది ఆరోగ్యకరమయినది. సాధారణంగా జరిగేది అని చెప్పినా ఆ చెప్పినదానిలోని నిజానిజాలను ప్రశ్నించగలగాలి. ఎందుకంటే ప్రతిదానినీ సందేహించాలి. ఈ సందేహం మీకు శక్తినీ, జీవాన్ని తీవ్ర అనుభూతిని యిస్తుంది. అసలు కలలెందుకు? అని మనం ప్రశ్నించాలి. ఎందుకంటే నిరంతరం అంతులేకుండా కదులుతూ రాత్రింబవళ్ళు మనసు పనిచేస్తుంటే దానికి విశ్రాంతి ఉండదు. తనను తాను మళ్ళీ స్వచ్ఛంగా, సరిక్రొత్తగా చేసుకోలేదు. అది నిరంతరం పని చేస్తున్న ఒక యంత్రంలాగా ఉంటుంది. తనను తాను అరగదీసుకుంటుంది. కాబట్టి మనమిప్పుడడిగినట్లే 'కలలు గనకుండా ఉండడం సాధ్యమవుతుందేమో తెలుసుకోబోతున్నాము. ఎందుకంటే, అంతశ్చేతనలో గతం - జాతిపరంగా, కుటుంబపరంగా సంక్రమించినవి, సామాజిక సంప్రదాయము, వివిధ సూత్రాలు, నియామకాలు, ప్రేరణలు, జంతువులునుండి సంక్రమించినవి - యివన్నీ ఉన్నాయక్కడ. కలలద్వారా యివి కొంచెం కొంచెం బయటపడతాయి. వాటి అర్థాన్ని సవ్యంగా గ్రహించాలి. ఏది ఏమయినా అది అసాధ్యము. ఆ కలలన్నింటినీ తర్జుమా చేయడానికి

పండితులున్నారు. అయితే ఆ తర్జుమా వారి నిబద్ధతనుండో, జ్ఞానాన్నుండో, యితరుల ద్వారా పొందిన సమాచారాన్నుండో చేస్తుంటారు.

అందుకని మనమడుగుతున్నాము - కలల అవసరమున్నదా? అని. కలలు గనకుండా ఉండడము సాధ్యమా? చేతనత్వమంటే పైపైన ఉన్నదేగాక క్రింద ఉన్నదేదో అది గూడా - విషయమంతా. మనసులో ఉన్న విషయాన్ని మెలకువలో పరిశీలించగల్గితే నిద్రించినప్పుడు కలల అవసరముండదు. అంటే మెలకువతోనున్న సమయమంతా మీ ఆలోచనలు, మీ అనుభూతులు, మీ ప్రతిచర్యలు, మీ ప్రేరణలు, సంప్రదాయము, వెనుకాడటాలు, వివిధ రకాలయిన నిర్బంధాలు వత్తిళ్ళు మీరు గమనిస్తుంటే సరి దిద్దకుండా వేరుగా వుండాలంటూ వత్తిడి చేయకుండా వాటిని అనువదించకుండా పగటి సమయంలో నిజంగా ఎంపికలేని ఎరుకతో ఉంటే మనసప్పుడు ప్రతిదాని పట్లా, ప్రతి ఆలోచనా చలనం పట్లా ఎంతో జాగృతమై, సున్నితమైఉండడంతో ప్రేరణలు, జాతి సంక్రమణలు మిగిలినవన్నీ పైకొచ్చి వెల్లడవుతాయి. దీనిని గంభీరంగా తీవ్రతతో తెలుసుకోవాలన్న గాఢ అనుభూతితో చేస్తే మీ రాత్రులు ప్రశాంతంగా, ఒక్క కలగూడా లేకుండా ఉంటే మీరు మేల్కొన్నప్పుడు మనసు స్వచ్ఛంగా, స్పష్టంగా, ఎటువంటి వక్రతలూ లేకుండా ఉండడము కన్పిస్తుంది. వ్యక్తిగత అంశం కరిగిపోవడంతో సంపూర్ణ పరిశీలన జరుగుతుంది. ఇది సాధ్యం. నిష్ణాతులు చెప్పినవాటిని అన్వయించుకోవడం వలనగాదు. మీరు గడ్డం చేసుకునేటప్పుడు, మీ జుట్టు దువ్వుకునేటప్పుడు అద్దంలో అంతశ్చేతన మొత్తం అల్పంగా, లోతు లేకుండా ఆసక్తికరంగా లేని ఉపరితల మనసువలెనే ఉన్నదని, అంతశ్చేతన పవిత్రమయినదేదో గాదని తెలుసుకుంటారు. అప్పుడు భయాన్నుండి, సుఖం తెచ్చిన బాధనంతటినుండి విముక్తమయిన మనసు సుఖంకోసం చూడదు. ఆనందమంటే సుఖంగాదు. ఆనందం పూర్తిగా భిన్నమైంది. ఇందాక మనమనుకున్నట్లు సుఖం, దానితోపాటు బాధను, భయాన్ని తెస్తుంది. అయితే మనసు సౌఖ్యంకోసం ఆత్యంతికమైన సౌఖ్యంకోసం చూస్తూవుంటుంది. ఎందుకంటే యీ ప్రపంచంలో మనకున్న సౌఖ్యాలు పాతబడి నిరుత్సాహంగా వెలవెలబోతూ వున్నాయి. కాబట్టి నూతన సౌఖ్యాలకోసం ఎదురు చూస్తుంటాడెప్పుడూ. కాని అటువంటి మనసు ఎప్పుడూ భయంలోనే వుంటుంది. ఏ మనసయితే అంతులేని సుఖాన్ని కోరుతుందో, గొప్ప సుఖాలనిచ్చేటటువంటి అనుభవాలను కోరుతుందో అది చీకట్లో ఉన్నట్లు. చాలా సాధారణమైన వాస్తవాన్ని పరిశీలించినట్లుగా దీనిని చూడవచ్చు.

కాబట్టి మనసు భయాన్నుండి యింకా లోతయిన, విస్తారమైన సుఖాలకోసం వెతకడాన్నుండి, ఏది బాధను, ఆందోళనను, సౌఖ్యానికుండే భారాన్ని కష్టాలను తెస్తుందో ఆ వెతకడాన్నుండి స్వేచ్ఛ నొందకపోతే మనసుకు స్వతంత్రము లేదు. దేవుడున్నాడనో లేడనో నమ్మే మనసు గూడా నిబద్ధమయిన పాక్షికమైన మనసు లాంటిదే.

మీరిదంతా చేయగలరని ఆశిస్తాను. వక్త గట్టిగా చెప్పినా మీరు ఒప్పుకోనక్కరలేదు. ఎందుకంటే అతనికి సాధికారికత లేనేలేదు. ఈ తెలుసుకోవడంలో సాధికారత లేదు.

గురువులేడు. ఉపాధ్యాయుడు లేడు. నీకు నీవే గురువు. నీవే శిష్యుడూ. అధికారం మొత్తాన్ని ప్రక్కనపెట్టగల్గినప్పుడే, అదే చాలా కష్టమయినది కాబట్టి దానినుండి స్వేచ్ఛ నొందితేనే సద్ధర్మాన్ని, సౌశీల్యాన్ని సంతరించుకుంటాడు. ఎందుకంటే, సౌశీల్యతే సక్రమత. మనం గొప్ప అస్తవ్యస్తతలో జీవిస్తున్నాము. మనం జీవిస్తున్న సమాజము సాంఘిక అన్యాయాలతో, జాతి విభేదాలతో ఆర్థిక జాతీయ విభజనలతో అస్తవ్యస్తంగా వున్నది. మీలోకి మీరు చూసుకుంటున్నప్పుడు మనం గూడా యీ అస్తవ్యస్థతలోనే ఉన్నట్లు, సవ్యతలేని మనసుకు స్వేచ్ఛగా వుండడము సాధ్యంగానట్లు తెలుస్తుంది. సవ్యత అంటే సౌశీల్యత అవసరము. ఏదో ప్రణాళికాబద్ధంగా లేక, ఆచార్యుల ప్రకారం లేక మాకు తెలుసు, మీకు తెలియదు అనేవారి ప్రకారం ఉండే సవ్యతకాదు. సవ్యత అంటే సౌశీల్యత. అపసవ్యత నర్థం చేసుకున్నప్పుడే యీ సవ్యత వస్తుంది. అపసవ్యమైన దానిని నిరాకరించడం ద్వారా తనలో సవ్యత వస్తుంది. సామాజిక అస్తవ్యస్తతను కాదనడంలో సవ్యత వస్తుంది. ఎందుకంటే, సమాజం ఆర్జనాపరత్వాన్ని, పోటీని, ఈర్ష్యను, విరోధాన్ని, మూర్ఖతను, హింసను ప్రోత్సహిస్తున్నది. సైన్యాన్నీ, నౌకాదళాలను చూడండి. అదీ అపసవ్యత! మీలోనే లోపలి అంతరంగ అపసవ్యతను పెంచుతున్న భయాన్ని అత్యాశను, దురాశను, ఈర్ష్యను సుఖంకోసం, పరువుకోసం వెతుకులాటను మీరు నిరాకరించినప్పుడు - సమాజాన్ని కాదనడం గాదు - ఆ అపసవ్యతను పూర్తిగా కాదనడంతో ఏది సౌందర్యమో, ఏది కేవలం పరిసరాల వత్తిళ్ళకు, పరిసరాల కనుగుణమైన ప్రవర్తనకు ఫలితం గాదో ఆ సవ్యత వస్తుంది. సవ్యత వుండాలక్కడ. ఆ సవ్యతే సౌశీల్యతని మీరు తెలుసుకుంటారు.

తాను యిదంతా చేసిఉంటే -చేయాలి - అప్పుడు ధ్యానమంటే ఏమిటి? అని అడుగ వచ్చు. ధ్యానించే మనసు మాత్రమే తెలుసుకోగలదు. కుతూహలపడే మనసు, నిరంతరం అన్వేషించే మనసు తెలుసుకోలేదు. ఇక్కడ వింత ఏమంటే మనసు వెతుకుతూ వున్నప్పుడు అది దేనికోసం వెతుకుతున్నదో దానినే తెలుసుకుంటుంది. అయితే అది వెతికేది, తెలుసుకునేది అప్పటికే తెలిసి ఉన్నదానిని. ఎందుకంటే, తెలుసుకున్నది గుర్తింపబడాలి కదూ? ఈ అన్వేషణలో గుర్తించడం ఒక భాగం. అనుభవము, గుర్తించడము జరిగేవి గతాన్నుండి. గుర్తించడం యిమిడి వున్న అన్వేషణతో వచ్చే అనుభవంతో నూతనమయింది ఏదీలేదు. అప్పటికే తెలిసినదది. అందుకే మనుషులు రకరకాల మాదకద్రవ్యాలను తీసుకుంటారు. భారతదేశంలో యిది వేల సంవత్సరాలుగా చేస్తున్నారు. మనసును పదునుపెట్టడానికి, క్రొత్త అనుభవాలను పొందడానికి యిది పాత చిట్కా. అయితే ఆ అనుభవమేమిటో తానెప్పుడూ ప్రశ్నించలేదు. క్రొత్త అనుభవాలు, క్రొత్త దృష్టి కావాలంటాడు. తనకొక అనుభవము, ఒక నూతన దృష్టి వస్తే క్రీస్తుదో, బుద్ధునిదో, కృష్ణునిదో వస్తే ఆ దృష్టి తన నిబద్ధత ప్రక్షేపించినదే. కమ్యూనిస్టుకు - ఆదర్శ స్వప్నాలంటూ ఉంటే - అందంగా మలచబడి, ప్రతి ఒక్కటీ క్రమబద్ధంగా ఏర్పాటు చేసిన ఒక ఉత్తమ రాజ్యాన్ని చూస్తాడు. మీరు కాథలిక్కు అయితే క్రీస్తుదో మేరీ కన్యదో యితర దర్శనాలు ఉంటాయి. ఇదంతా నిబద్ధత మీద ఆధారపడి వుంటుంది. మీరు

ఆ దర్శనాన్ని ఎప్పుడు గుర్తిస్తారంటే అప్పటికే మీకది అనుభవంలోనికి వచ్చింది గనుక అప్పటికే తెలిసినది గనుక. కాబట్టి ఆ దర్శనాన్ని గుర్తించడంలో నిజానికి కొత్తదనం ఏమీ వుండదు. మాదక ద్రవ్యాలతో ప్రభావితమయిన మనసు తాత్కాలికంగా పదునెక్కినా చాలా స్పష్టంగా దేనినో చూసినా ఆ చూసినది తాను గొప్ప చేసి చూసిన తన నిబద్ధతనే, తన అల్పత్వాన్నే.

మీరిదంతా చేసి ఉంటే, మీరిది మీ కోసం చేసి ఉంటారని ఆశిస్తాను. ఇప్పుడొక గొప్ప గ్రహింపు, సౌందర్యం, సున్నితత్వభావం అవసరమైనదాని లోనికి మనం ప్రవేశించడానికి సిద్ధమయినట్లు. ఈ దేశానికి 'ధ్యానం'అన్న పదం తూర్పుదేశాలనుండి తీసుకురాబడింది. క్రైస్తవులకు వారి పదాలు, ఉపాసన యిత్యాదివి ఉన్నాయి. కాని ధ్యానానికి యిప్పుడెంతో ప్రజాదరణ ఉన్నది. తెలుసుకోవడానికి, అతీతంగా వెళ్ళడానికి కాలాతీతమయిన దానిని అనుభవించడానికి మార్గం ధ్యానమని యోగులు, గురువులు చెప్పారు. కాని అనుభవిస్తున్నదెవరని మీరడిగారా? అనుభవంలో ఉన్నవాడు తాను అనుభవిస్తున్న విషయాన్నుండి వేరుగా వున్నాడా? ఎంతమాత్రం లేదు. అనుభవిస్తున్నవాడు తన స్మృతులన్నింటితో ఉన్న గతం. అతడు అనుభవిస్తున్నప్పుడు, ధ్యానం వలనో లేదా మాదకద్రవ్యాన్ని తీసుకోవడంవలనో అతీతంగా వెళ్ళిపోయినప్పుడు, గతాన్నుండి ప్రక్షేపించి దానిని గుర్తించి 'ఇది అద్భుతమయిన దర్శనము' అంటాడు. ఇది అటువంటిదేమీగాదు. ఎందుకంటే, గతంతో 'భారమైన మనసుకు కొత్తదేదో చూడగలగడము సాధ్యపడదు.

మనమిప్పుడు ధ్యానం అంటే ఏమిటో కనుగొనే అంశానికి వచ్చాము. మీరొక పద్ధతినో, ఒక విధానాన్నో పరీక్షిస్తుంటే అందులో ఉన్న అర్థమేమిటి? ఎవరో 'ఇది చేయండి, ప్రతిరోజు సాధన చేయండి. పన్నెండేళ్ళు, ఇరవైయేళ్ళు, నలభైయేళ్ళు, సాధన చేయండి. చివరికి సత్యాన్ని చేరతారు' అని ఎవరో చెప్తారు. అంటే ఒక పద్ధతిలో సాధన చేస్తుంటే అది ఏదయినా ఆ పద్ధతిలో సాధన చేయడంలో ఏమి జరుగుతుంది? ఒక రోజువారీ కార్యక్రమంలాగా మీరేది చేసినా ఒకే సమయంలో పద్మాసనంలో లేదా పడకపై కూర్చుంటూ లేదా నడుస్తూ ప్రతిరోజూ దానిని వల్లెవేస్తుంటే మీ మనసు యాంత్రిక మవుతుంది. అంటే ఘర్షణ అణచివేత నియంత్రణ జరుగుతుంది. ఒక విధానంవలన మందకొడిగా చేయబడిన మనసుకు పరిశీలించగల్గడము ప్రజ్ఞాశీలమై, స్వేచ్ఛగా ఉండడము సాధ్యపడదు. వారు భారతదేశాన్నుండి మంత్రయోగాన్ని తెచ్చారు. కాథలిక్కు ప్రపంచంలో ఇది గూడా ఉన్నది. ఆ మరియా అంటూ వందసార్లు వల్లించడము పూసలతో జపం చేస్తారు. ఆ కొద్ది సమయం మనసును తప్పక ప్రశాంతంగా చేస్తుంది. మాటల వల్లింపు మందకొడిగా ఉన్న మనసును చాలా నిశ్శబ్దంగా ఉండేటట్లు చేయగలదు. కొత్త అనుభవాలు గూడా దానికి కలుగుతాయి. అయితే ఆ అనుభవాల కసలు అర్థమేలేదు. లోతులేని మనసు, భయంతోనున్న మనసు, సత్యం కోసం లేక ఈ ప్రపంచంలోని సంపద కోసం అత్యాశ దురాశపడే మనసు, పవిత్రమయిన ఆ పదాన్ని

ఎంత వల్లించినా లోతులేని మనసుగానే మిగిలిపోతుంది. మిమ్మల్ని మీరు లోతుగా అర్థం చేసుకుని ఉంటే, ఎంపికలేని ఎరుకతో మీ గురించి నేర్చుకుని ఉంటే సద్ధర్మమనే పునాదిని వేసినట్లు, అదే సౌశీల్యత. మీరు స్వేచ్ఛాజీవులు. ఆధ్యాత్మికపరమయిన ఆధిపత్యాన్ని దేనిని అంగీకరించవద్దు. సామాజిక సూత్రాలు కొన్నింటిని అందరూ తప్పక అంగీకరించి తీరాలన్నది స్పష్టమే.

మీరప్పుడు ధ్యానమేదో కనుగొనగలరు. ధ్యానంలో గొప్ప సౌందర్యమున్నది, ధ్యానం ఎలా చేయాలి అన్నదిగాక ధ్యానమంటే ఏమిటో తెలుసుకోవడం అసాధారణ విషయం. 'ఎలా' అన్నదానిలో ఒక పద్ధతి ఉన్నది. అందుకే ఎలా' అని అడగవద్దు. పద్ధతిని అందించడానికి సుముఖంగా ఉన్నవారూ కొందరున్నారు. కాని ధ్యానమంటే భయాన్ని అదేమి చేస్తుందో, సుఖస్వరూప, స్వభావాలను తెలుసుకోవడము. తనను అర్థం చేసుకోవడము. దానితో సవ్యతకు అంటే సౌశీల్యతకు పునాది వేయడము. అందులో అణచివేత, నియంత్రణ, అనుకరణ గాని క్రమశిక్షణ ఉండడము. అటువంటి మనసు ధ్యానస్థితిలో ఉన్నట్లు.

ధ్యానం చేయడమంటే చాలా స్పష్టంగా చూడడము. పరిశీలకునికి, పరిశీలించబడే దానికి మధ్య ఎడముంటే స్పష్టంగా చూడడము, చూసినదానిలో పూర్తిగా ఉండి పోవడము సాధ్యమవదు. అంటే మీరొక పూవును, ముఖానికున్న అందాన్నో, లేక సాయంకాలపు అందమయిన ఆకాశాన్నో, ఎగురుతున్న పక్షినో చూస్తున్నప్పుడు, భౌతికంగానేగాక మానసికంగా గూడా మీకు పూవుకు, మీకు వెలుగుతో ప్రకాశవంతంగా ఉన్న మబ్బుక మధ్య దూరముంటుంది. మానసికమయిన దూరముంటుంది. ఆ దూరమున్నప్పుడ ఘర్షణ ఉంటుంది. ఆ దూరం ఆలోచనతో కల్పించబడింది. అదే పరిశీలకుడ మీరెప్పుడయినా మధ్యలో దూరం లేకుండా ఒక పూవు వంక చూశారా? పరిశీలకునిక పరిశీలింపబడేదానికిమధ్య, మీరు పూవుకుమధ్య దూరం లేకుండా మీరెప్పుడైనా పరిశీలించారా?మనం మాటల అడ్డుతెరలనుండో నచ్చింది నచ్చలేదు అన్న ఆలోచనా తెరనుండో ఆ పూవు తన తోటలో వుండాలనుకుంటూనో ఇదెంత అందంగా వున్నది?' అంటూనో పూవు వంక చూస్తాము. ఆ పరిశీనలతో మీరు చూస్తు న్నప్పుడే మాటలతో, ఇష్టపడుతూ సంతోషిస్తూ ఉన్న మీ అనుభూతితో సృష్టించబడిన విభజన ఉంటుంది. అందువలన మీకు పూవుకుమధ్య అంతరంగ విభజన జరగడంతో అక్కడ సూటిగా పూవును గ్రహించడముండదు. కాని మధ్య ఎడం లేనప్పుడు మీరింతకు ముందెన్నడూ ఆ వూపును చూడనట్లే చూస్తారు. అక్కడ ఆలోచన, ఆ పూవుగురించి వృక్షశాస్త్ర సమాచారం లేనప్పుడు, యిష్టాయిష్టాలు లేనప్పుడు పూర్తి సావధానత మాత్రమే ఉన్నప్పుడు మధ్య నున్న దూరం కన్పించకుండా పోవడం చూస్తారు. కాబట్టి ఆపూవుతో, ఎగిరే పక్షితో మేఘంతో లేక ఆ ముఖంతో పరిపూర్ణమైన సంబంధంలో ఉంటారు.

ఎందులో పరిశీలకునికి పరిశీలింపబడేదానికి మధ్య దూరం లేకుండాపోతుందో

అటువంటి లక్షణంతోనున్న మనసు ఉంటే విషయం స్పష్టంగా, తీవ్ర అనుభూతితో తీక్షణంగా చూడబడుతుంది. అప్పుడక్కడ ఉండే లక్షణం ప్రేమ. ఆ ప్రేమతోపాటు సౌందర్యమూ.

దేనినయినా మీరు గొప్పగా ప్రేమిస్తే సుఖం బాధల దృష్టితో గాదు. నిజంగా ప్రేమిస్తే భౌతికంగా, మానసికంగా రెండింటిలోనూ దూరం లేకుండా పోతుంది. 'నేను' 'మీరు' వుండవు. ఈ ధ్యానంలోనికి మీరంత దూరం వస్తే అప్పుడు ఆలోచన కోరుతున్న నిశ్శబ్దానికి ఫలితంగాని ఆ మౌనగుణాన్ని చూస్తారు. ఆ రెండూ భిన్న విషయాలు కావా? ఆలోచన తనను నిశ్శబ్దం చేసుకోగలదు. మీరెప్పుడయినా దీనిని ప్రయత్నించారేమో నాకు తెలియదు. మనం ఆలోచనకు విరుద్ధంగా పోరాడతాము. ఎందుకంటే, అది నిశ్శబ్దంగా లేకపోతే ప్రపంచంలో శాంతిగాని, అంతరంగంలో ఆనందంగానీ ఉండక పోవడం ఎంతో బాగా చూశాము. అందుకే మత్తు పదార్థాలతో, మాటల వల్లింపులతో మనసును నిశ్శబ్దంగాచేసే మార్గాలనెన్నింటినో మనం ప్రయత్నిస్తాము. అయితే ఆలోచనచేత నిశ్శబ్దంగా ఉంచబడిన మనసుకు ఉన్న మౌనం మనమనుకున్న విషయాలన్నింటినుండి స్వేచ్ఛను తీసుకువచ్చే నిశ్శబ్దంగా పోల్చలేము. ఆలోచనతో తీసుకురాబడిన మౌనమనే గుణానికి ఎంతో భిన్నంగా ఉన్న ఆ మౌనంలో ఒక నూతనస్థాయి ఉంటుంది. ఇది మీకు మీరే తెలుసుకోవలసిన ఒక భిన్నస్థితి. మీ కోసం ఎవరూ తలుపులు తెరువరు. కొలవలేని దానిని ఏ పదమూ ఏ వర్ణనా కొలవలేవు. తానీ సుదూర ప్రయాణం చేయకుంటే జీవితానికుండే అర్థం బహు స్వల్పం. ఇది దూరంలో ఉండదు. తక్షణమే ఉంటుంది. మీరది చేసినప్పుడు పవిత్రమయినదేదో మీకు మీరే తెలుసుకుంటారు.

మీరు ప్రశ్నలేమయినా అడగదలుచుకున్నారా? ప్రశ్నలకంటే యీ మౌనమే బాగుండలేదా? మీరు అంతరంగంలో , మౌనంగా ఉంటే అది ప్రశ్న సమాధానాల కంటే బాగా ఉండదా? మీరు నిజంగా నిశ్శబ్దంగా ఉంటే ప్రేమ, సౌందర్యం ఉంటాయి. ఆ సౌందర్యం ఒక భవనంలోనో, ముఖంలోనో, మేఘంలోనో, అడవిలోనో లేదు. మీ హృదయంలో ఉన్నదా సౌందర్యం. ఆ సౌందర్యాన్ని వర్ణింపలేము. వ్యక్తం చేయడానికి అది అతీతము. మీకది ఉంటే ప్రశ్నించవలసిన అవసరమే ఉండదు.

★ ★ ★

# స్టాన్ ఫర్డ్ విశ్వవిద్యాలయంలో చేసిన ప్రసంగాలు

## I

ఒక ఆశ్రమంలోనికో, తనను బంధించుకున్న ఒక సిద్ధాంతంలోనికో వెళ్ళిపోయి, ఏకాంతంగా వుండి పోకుండా జీవించడము, ఈ ప్రపంచంలో నానాటికీ చాలా కష్టమవుతున్నది. ఈ ప్రపంచం అటువంటి అస్తవ్యస్తతలో ఉండడంతో ఎలా జీవించాలో ఏమి చేయాలోనన్న వాటి గురించి ఎన్నో సిద్ధాంతాలు, ఊహాత్మక సూచనలు వస్తూ ఉన్నాయి. దానిపై తత్త్వవేత్తలు చాలాకాలంగా మనిషంటే ఏమిటి, అతడు చేయవలసిన దేమిటి అంటూ భావాలను అన్వేషిస్తున్నారు. ఒక తత్త్వవేత్తగా సిద్ధాంతాలతో తలకిక్కిరిసిపోయిన మానవునిగాగాక దేనిగురించీ ఎటువంటి నమ్మకాలూ లేని ఒక మనిషిగా ప్రపంచమంతా ప్రయాణంచేస్తున్నప్పుడు, మనుషులను మార్చడం సాధ్యమేనా అని ప్రశ్నించుకున్నారు ఒకరు.

ఆ ప్రశ్న ఎవరయినా ఎంతో కొంత ఆలోచనాపరులు, గంభీరులు మాత్రమే ప్రశ్న అడుగుతారనుకుంటాను. ముందు మనం ప్రపంచాన్ని అంటే సామాజిక స్వరూపాన్ని, ఆర్థిక నిర్మాణంతో సహా మార్చాలి; ప్రపంచంలో కేవలం ఒక్క భాగంలో జరిగే మార్పుగాక ప్రపంచమంతటా జరగాలి. అది ప్రాపంచిక విప్లవంగావాలి అనడము వింటూ ఆ తర్వాత ఆ మార్పును తీసుకురావడానికి ఒక్కొక్క వ్యక్తీ మారవలసిన అవసరం లేదని, సహజంగానే అందరూ మారతారని చెప్పడం జరిగింది. అప్పుడా పరిసరాలే సరయిన వృత్తి, సరయిన సంబంధం, విరామం, దయ, ప్రేమ, అవగాహన ఇత్యాదివాటిని తెచ్చిపెడతాయి - కాబట్టి కొందరటువంటి వివేచనతో ప్రపంచాన్ని మార్చమని అది ప్రాపంచిక మార్పుగావాలని, ఆ పరిసరంలో జీవించే మనిషీ అప్పుడు సహజంగా మారతాడని వాదిస్తున్నారు.

మనకు బయట లోపల అనే యీ విభజన వున్నది. బయట అంటే పరిసరాలు, సమాజము. సమాజంలో లోతయిన మార్పును తీసుకురమ్మని, ఇవి వ్యక్తిలో మార్పుకు మీలో నాలో మార్పుకు దారితీస్తుందని వారంటారు. వేలాది సంవత్సరాలపాటు ఆత్మ అంటున్నదానికి ప్రాపంచికమయిన పదార్థానికి-మతపరమయినదానికి ప్రాపంచికమయిన దానికి మధ్య యీ విభజన కొనసాగుతూనే వున్నది. ఈ విభజనే ఎంతో వినాశనకారి. ఎందుకంటే యిది లోనున్నది బాహ్యమైన దానితో ఎలా సర్దుబాటు చేసుకోగలదో, బాహ్యమైనది లోనున్నదానిని ఎలా రూపుదిద్దగలదోనంటూ వేర్పాటును, ఘర్షణల పరంపరను పెంచుతున్నది. ఈ సమస్య ఎప్పుడూ ఉన్నదే. కమ్యూనిస్టు ప్రపంచం మొత్తం లోపల ఉన్నదానిని కాదంటుంది. మీరు 'దీనిని పట్టించుకోవద్దు. ప్రతిదాన్ని బాగా వుత్తమంగా వ్యవస్థీకరిస్తే దాని సంగతది చూసుకుంటుంది' అంటారు.

మనిషికుండే ఆందోళన, హింస, నిరాశ, భయం, ఆర్జనలన్నింటితో అతడి ఎడతెగని పోటీతత్వంతో కూడుకొని నీతి, హింసతోపాటు ఒక స్వరూపాన్ని తయారుచేసి దానిని

సమాజం అంటున్నాడు. కాబట్టి ఒక మనిషిగా ప్రపంచంలో జరుగుతున్న వాటన్నింటికీ తాను బాధ్యుడు. తనకు లోపల బయట జరుగుతున్న యుద్ధాలకూ గందరగోళానికీ ఘర్షణలకు బాధ్యుడు. మనలో ప్రతి ఒక్కరమూ అందుకు బాధ్యులము. కాని మనలో దానిని ఎంతమందిమి అనుభూతి చెందుతున్నామన్నదే సందేహము. బహుశా మనం దీనిని బౌద్ధికంగా మాటలతో అంగీకరించవచ్చు. కాని వియత్నాంలోనో లేదా మధ్య ఆసియాలోనో జరిగే యుద్ధానికి, ఈ తూర్పుదేశాల ఆకలిబాధకు, కష్టాలకు, విభజనకు ఘర్షణ లన్నింటికి మనమే బాధ్యులమని నిజంగా భావిస్తున్నామా? నాకు సందేహమే. అలా భావించివుంటే మన విద్యావిధానం మొత్తం యిందుకు భిన్నంగా వుండేది. అలా భావించకపోబట్టే మనం పిల్లలను ప్రేమించడంలేదని స్పష్టమవుతున్నది. అలా ఉండుంటే రేపటినుండి యుద్ధమే వుండదు. భిన్న సంస్కృతీ, భిన్నమైన విద్య తీసుకురావాలని నిశ్చయించి వుండేవారము.

మనిషి బలవంతంగానో, పారితోషికం ఆశతోనో, భయంతోనో మారడం గాక, తాను పూర్తిగా మారాలి అనుకునేట్లు తయారుచేయగలమా అన్నది మన ప్రశ్న. అతడు మారనప్పుడు, దుఃఖం బాధ, మరణం, నిరాశలతో ఉన్న ప్రపంచాన్ని సృష్టిస్తాడు. లేదా అదే ప్రపంచాన్ని కొనసాగనిస్తాడు. ఈ సమస్యను ఏ సిద్ధాంతాలూ, దైవాన్ని గురించిన వూహాపోహలు, అధికారిక వుత్తర్వులూ పరిష్కరించబోవు. కాబట్టి తానేం చేయాలి? ఈ గందరగోళం, వివాదం, వ్యతిరేకత, హింస, మూఢతలను ఎదుర్కొన్న మనిషి ఏం చేయాలి? ఎలా స్పందించాలి? తనకు తానీ ప్రశ్నను గంభీరంగా వేసుకుంటాడా? హృదయ దౌర్బల్యంతో, కల్పనలతో బాగా ఉత్సాహంగా ఉన్న క్షణంలో గాదు. నిరంతరం దానికున్న పూర్తి గాంభీర్యంతో ఉంటుందా ఆ ప్రశ్న అన్నది నా విచారం. దానికి మన సమాధానమెలా ఉంటుందా అని ఒక సందేహం. నూతన సమాజాన్ని సృష్టించడానికి, అంత లోతుగా, తక్షణమే సమూలంగా మారడం, సాధ్యమవదని మనం ప్రకటిస్తామేమో! అయితే అది సాధ్యమవదని చెప్పిన ఆ క్షణంలోనే అది నిర్ధారణ చేసినట్లు. మిమ్మల్ని మీరు అడ్డుకున్నట్లు. సాధ్యమని చెప్తే తనలో మానసిక విప్లవాన్నెలా తీసుకురావాలన్న ప్రశ్న నెదుర్కొంటాడు. కాబట్టి తానేం చేయాలి? ఏదో ఒక తెగకున్న నమ్మకాన్ని స్వీకరిస్తూ పారిపోవడమా? లేక 'జెన్' సాధన చేసే ఏ ఆశ్రమానికో పరుగెత్తి పోవడమా? మీకు కావలసినది దొరుకుతుందని వాగ్దానం చేసే ఒక క్రొత్త సంస్కృతిలోనో, తెగలోనో చేరిపోవడమా?

జాతీయతలనీ, మతాలనీ, హిందువులనీ, బౌద్ధులనీ, క్రైస్తవులనీ, కాథలిక్కులనీ, జాతి విభజనలు, వాటి పాక్షిక ధోరణులతో సహా ప్రపంచంలో నున్న అసాధారణ విభజనను చూస్తూ, చర్చి, పవిత్ర గ్రంథాలు, తత్త్వవేత్తలు, సిద్ధాంతవేత్తల ప్రచారంతో అమిత నిబద్ధమయిన మన మనసులను చూస్తూ దీనంతటినీ ఎదుర్కొంటూ 'నేనేమి చేయాలి? ప్రపంచంతో సంబంధమున్న మనిషిగా నేనేం చేయగలను?' అని తనను ప్రశ్నించుకుంటాడు. ఆ ప్రశ్నను తనకే వేసుకుంటే 'క్రియంటే ఏమిటి?' అని గూడా

అడగాలి. నేనేం చేయాలి, దేని సంబంధంగా చేయాలి?' అని మనమడుగుతాము. ఈ సృష్టి మొత్తంలో ఒక భాగంతోనా - ఒక ముక్కతోనా? ఈ సృష్టి మొత్తంలో, జీవితం మొత్తంలో ఒకే ఒక్క భాగానికి మనను మనం అంకితం చేసుకుని ఒక నిపుణుడిలాగా ఒక్క భాగాన్ననుసరించే పనిచేయాలా? ఈ జీవితం మొత్తాన్ని చూస్తూ - మానవుని దుఃఖజీవితాన్ని, గందరగోళాన్ని, బొత్తిగా సంబంధం లేకపోవడాన్ని, తననేకాకిని చేసే ఆలోచనా ప్రక్రియను, హింసను, భయాలు, ఆందోళనలు, కన్నీళ్ళు, మరణం, కరుణ లేకపోవడాలతో కూడిన మన జీవిత మూఢతను అంతటినీ చూస్తూ మీరైనా, నేనైనా ఆ మొత్తంతో వ్యవహరిస్తామా? లేక ఒక్క భాగంతో వ్యవహరిస్తామా? దానంతటితో తలపడాలంటే, అందులో పూర్తిగా నిమగ్నమవాలంటే వున్నవారిని ఉన్నట్లుగా మనను గురించి తెలుసుకోవాలి మనం. ఎలా వుండడానికిష్టపడుతున్నామని గాదు. మన మనసులను తెలుసుకోవాలి. హింసాయుతులమని, మూర్ఖులమనీ, కూడబెట్టుకునే మానవులమని తెలుసుకుని తక్షణమే మార్పు చెందగలమేమో అడగాలి.

ఆ ధర్మస్థితి - అంటే అహింస, స్వేచ్ఛ ప్రేమలున్న స్థితి ఉండదు. కేవలం అదొక భావన. 'ఉన్నదేదో' అదే వుంటుంది. 'ఉన్నదేదో మారగలదా? అయితే ఏది ఉండాలో అది గావడంతో గాదు. ఉండవలసిన దానిని వెన్నాడటానికి ఆ భావనను వెన్నాడటానికి మనం నిబద్ధులమయ్యాము. ఆశయంకోసం, తానూహిస్తున్న పరిపూర్ణ అసాధారణ స్థితి కోసం ప్రయత్నించడం కాలయాపన అన్పిస్తుంది. మీరొక ఆశయాన్ని, ఉండవలసిన దేనినో వెన్నాడితే అది వృథాశ్రమ. ఉన్నదానిని తప్పించుకోవడమూ. ఒక ఆదర్శాన్ని అంగీకరించడంలో అపరిమితంగా నిబద్ధమయిన మనసు దానిని వదిలి 'ఉన్నదానిని' ఎదుర్కోగలదా? ఎందుకంటే ఉన్న అసత్యాన్ని వదిలిపెట్టినప్పుడు ఉన్నదిలోని నిజమైన శక్తి మనకుంటుంది. అంటే జంతువునుండి సంక్రమింప జేసుకున్న మనిషి స్వభావం పోట్లాడుతూ, హింసతో, కోపంతో, ద్వేషం, ఈర్ష్యలతో నిండి ఉంటుంది. ఆదర్శమేమో అహింసాపూరితంగా ఉండడము. ఆ ఆశయమూ తిరిగి దూరంగా నెట్టివేయబడుతుంది. మనమేమాత్రం గంభీరంగా ఉండడం జరిగినా సమయాన్ని, శక్తిని అహింసాపరుడవడానికి వెచ్చిస్తాము. తానెంతగా నిబద్ధుడయిందీ తనలోనే పరిశీలించుకోవచ్చు. ఏది ఉన్నదో ఏది ఉండాలో నన్నవాటి మధ్య యీ ఘర్షణ వుంటుంది. ఏ రకమయిన విభజన ఉన్నా, వేరుగా అనే భావంవున్నా ఘర్షణెప్పుడూ వుంటుంది. తమ కార్యకలాపాలలో ప్రతి ఒక్కరూ తనను తాను ఒంటరిగా చేసుకుంటున్నారు. కాబట్టే మన సంబంధాలలో ఘర్షణ ఉంటుంది.

కాబట్టి అమితంగా నిబద్ధమయిన మనసును, యిప్పుడున్న దానిని అంటే హింస, ద్వేషం కోపం మిగిలిన వీటన్నింటినీ ఎదుర్కొంటున్న ఆ మనసును ఎలా మార్చాలి? అది మనలో ప్రతి ఒక్కరినీ మానసికంగా ఆందోళనపరుస్తున్న ప్రశ్న. ఈ వేరు భావం అంతమయేదెలా? దానితో మనం నిజమయిన సంబంధాన్నెలా ఏర్పరచుకోగలము? ఎందుకంటే అక్కడ విభజన లేనప్పుడు ఘర్షణ లేకుండా వుంటుంది.

ఆ ఉన్నదానిని మార్చే ప్రయత్నంలో మనిషొక బాహ్య ప్రతినిధిని కనుగొనడం చూస్తాము. అతడు హింసాత్మకంగా మూర్ఖుడయి, కోపంతో, అసూయతో ఉన్నాడని పరిపూర్ణుడవడానికి చాలాకాలం పడుతుందని తెలుసుకోవడంతో ఏమి చేయాలో తోచదతనికి. కాబట్టి పూర్తి అధికారంతో ఉన్న ఒక బయటి ప్రతినిధిని దేవుడిని, ఒక ఆదర్శాన్ని, ఒక గురువును, ఒక ఆచార్యుడిని అలా ఎవరినో ఒకరిని తానేమి చేయాలో చెప్పే వానిని తయారుచేసుకుంటే తాను ప్రశాంతంగా, ఎటువంటి ఘర్షణ లేకుండా జీవించగలననుకుంటాడు. కాని, తానెప్పుడయితే మొత్తం అధికారాన్నే వదిలేస్తాడో – వదిలేయాలి – ఎందుకంటే, అధికారంలో భయముంటుంది – గురువును ఆచార్యులను, బయట ప్రతినిధిని వదిలేస్తాడో అప్పుడు ఒంటరిగా మిగిలిపోతాడు. అది చాలా భయంకర స్థితి- మనో వైకల్యాలు, మానసిక అల్లకల్లోలాలు లేకుండా వుండడము అత్యంత కష్టం. తానెప్పుడు అధికారాన్నంతా వదిలేస్తాడో, తనకు తానే గురువూ శిష్యుడూ – మరొకరికి కాదు – అవుతాడో అప్పుడు తానెక్కడున్నట్లు. ఆదర్శాలు లేక మార్గదర్శకులూ లేక మీరంత దూరంవస్తే మీరెక్కడున్నట్లు? ఎందుకంటే, మార్గం చూపించాలని ప్రయత్నించిన వారంతా మనిషిని ఎందుకూ కొరగాకుండా నడిపారు. అసలు ఆనందమే లేకుండా ఇంకా ఎక్కువ గందరగోళపడేట్లు ఆందోళనపడేటట్లు, భయపడేట్లు చేశారు. తానెప్పుడు గురువును ఆచార్యుడిని, అధికారాన్ని, ఆదర్శాన్ని వదిలేస్తాడో, అంటే మానసికంగా ఎవరిమీదా ఆధారపడకుండా ఉంటాడో, అప్పుడేమి చేయాలి? తానేమయినా చేయగలడా?

మాటల్లో విషయాన్ని ప్రసారం చేయడం కొంత సులభమేనని మీకు తెలుసు. ఒకే భాషను ప్రయోగిస్తూ ఖచ్చితమయిన అర్థాలతో పదాలను ఉపయోగిస్తున్నప్పుడు విషయ ప్రసారం కొంత సులభము. ఈ సమస్యల గురించి ఒకరితో నొకరు భావ సంగమంలో ఉండడము నా కెంతో ప్రధానంగా కన్పిస్తున్నది. కాబట్టి ఈ జీవితము, జీవించడము అనే సమస్య మీద కేవలం శాబ్దికమయిన భావ ప్రసారమే గాక ఒకే సమయంలో ఒకరితో ఒకరికి భావ సంగమం గూడా ఉండాలి. అవగాహన అప్పుడు మరికొంత సులభమవుతుంది.

మన జీవితంలో ఎంతో క్లిష్టమయిన, గందరగోళ అంశాలలో ఒకటయిన ఈ భయమనే ప్రశ్న వున్నది. ఈ భయ కారణాలను ఎంత వివరించినా, భయ స్వరూపాన్ని వర్ణించినా పదం విషయమెన్నటికీ గాదని, వర్ణన వర్ణింపబడిన విషయమెన్నటికీ గాదని తాను తెలుసుకోవాలి. పదంతో, వర్ణనతో చిక్కుబడకుండా ఆ భయమని పిలుస్తున్న దాని వాస్తవ స్పర్శలోనికి హింసని పిలుస్తున్న దానితో అంటే వాస్తవంగా ఉన్నదానితో నేరుగా సంబంధంలోకి రాగలమా? కాబట్టి పరిశీలకునికి పరిశీలింపడేదానికిమధ్యనున్న సంబంధమనే ప్రశ్నలోనికి వెళ్ళాలి. భయాన్ని తీసుకోండి. పరిశీలకుడు పరిశీలింపడేదానికి భిన్నంగా వున్నాడా? పరిశీలకుడే పరిశీలింపబడేదయినప్పుడు సంబంధం సూటిగా ఉంటుంది. క్రియను కోరే అసాధారణ జీవలక్షణంతో ఉంటుంది. కాబట్టి పరిశీలకునికి పరిశీలింపబడేదానికి మధ్య విభజన ఉంటే ఘర్షణ ఉంటుంది. మిగిలిన మనుషులతో

మనకు దగ్గర సంబంధాలు వుండటమూ, లేకపోవడమూ విభజనపైన, వేరు భావంపైనే ఆధారపడి వుంటాయి. భర్తకు భార్యగురించి ఒక ఊహారూపముంటుంది. భార్యకు భర్త గురించి ఒక ఊహారూపముంటుంది. ఈ ఊహారూపాలు చాలా సంవత్సరాలుగా సుఖం, బాధ, చికాకు యిత్యాది వాటితో కూర్చబడ్డవి. మీకు తెలుసు భార్యాభర్తల మధ్య నుండే సంబంధం. కాబట్టి భార్యాభర్తల మధ్యనున్న సంబంధం నిజానికి రెండు ఊహారూపాల మధ్యనున్న సంబంధం. లైంగికంగాకూడా, ఆ చర్యలు గాదు ఊహారూపం ప్రధానపాత్ర వహిస్తుంది.

కాబట్టి తనను తాను పరిశీలిస్తున్నప్పుడు, సంబంధంలో నిరంతరం ఊహారూపాల నేర్పరచుకుంటూ, దానితో విభజనను సృష్టిస్తూ ఉండడం చూస్తాడు. కాబట్టి నిజానికి అక్కడ ఎటువంటి సంబంధమూ లేనట్లు. కుటుంబాన్ని, భార్యను ప్రేమిస్తున్నా నంటున్నప్పటికీ అది ఊహారూపాన్నే. కాబట్టి నిజమయిన సంబంధం లేదక్కడ. సంబంధమక్కడ కేవలం భౌతిక స్పర్శేగాక మానసిక విభజన లేని స్థితి కూడా. మాటల్లో గాక వాస్తవంగా దానినర్థం చేసుకుంటే అప్పుడు 'నా భయం' అంటున్న పరిశీలకునికి, భయమనే విషయానికి మధ్యనున్న సంబంధమేమిటి? అవి రెండూ భిన్న విషయాలా? భయాన్ని విశ్లేషణతో తుడిచివేయగలమా? అన్న ప్రశ్నకు మననిది తెస్తుంది. ఇది మీకు ఆసక్తికరంగా ఉన్నదా?

**శ్రోతలు:** అవును.

**కృ:** ఎందుకంటే మీకు ఆసక్తి లేదంటే నేను లేచి వెళ్ళిపోతాను. మీరూ వెళ్ళవచ్చు. నాకిది అత్యంత గంభీరమయినది. నేను తత్త్వవేత్తను గాదు. అధ్యాపకుడిని గాదు. భారతదేశాన్నుండి సనాతన తత్త్వశాస్త్రానికి ప్రాతినిధ్యమూ వహించడంలేదు. భగవంతుడు అలా జరగనివ్వకుండు గాక (నవ్వులు).

ప్రపంచమంతటా తరచుగా ప్రయాణిస్తూ చాలా మందితో మాట్లాడడంతో మానవుల దుఃఖాన్నేగాక విపరీతమయిన నిర్భాధ్యతను కూడా చూశాక సహజంగానే తీవ్ర గంభీర స్వభావం ఏర్పడింది. అంటే బొత్తిగా హాస్యమే నాలో లేదనికాదు. అయితే ఒక అసాధారణమైన ప్రగాఢత్వం తీక్షణత నాలో చోటుచేసుకున్నాయి. మనకి యీ సమస్యలను పరిష్కరించుకోవడానికి మనం చాలా గంభీరంగా తీవ్రంగా ఉండి తీరాలి. ఎందుకంటే పైకి భిన్న మర్యాదలు, భిన్న వస్త్రధారణలు, ఆచారాలు ఉన్నప్పటికీ ప్రపంచమంతా మనలోనే వున్నది. మొత్తం మానవాళే మనలో ఉన్నది.

కాబట్టి గాఢంగా, ఆలోచిస్తున్నప్పుడు మనసు భయాన్నుండే స్వతంత్రమవగలదో, విశ్లేషణతో అంటే ప్రతిరోజూ తనను విశ్లేషించుకుంటూనో నిపుణుల దగ్గరకు వెళ్తూ విశ్లేషింపబడడంతోనో భయాన్ని వదిలించుకోగల్గుతాడా అన్నసమస్యలను ఎదుర్కొంటారు. ఈ మనో విశ్లేషకులకు, బహుశా మరో పది సంవత్సరాలపాటు మీ దగ్గర డబ్బుంటే పెద్ద మొత్తాల్లో చెల్లిస్తూనే ఉంటారు. లేదంటే ఈ సమస్యకు మరో మార్గమున్నదా? మరోరకంగా దీనినెదుర్కుంటే విశ్లేషించకుండానే భయం పోగలదా? ఎందుకంటే విశ్లేషణలో

ఎప్పుడూ పరిశీలకుడు, పరిశీలింపబడేది విశ్లేషకుడు విశ్లేషింపబడేది ఉంటాయి. విశ్లేషించడానికి విశ్లేషకుడు అసాధారణ మెలకువతో నిబద్ధత లేకుండా, పాక్షికత, వక్రీకరణ లేకుండా ఉండాలి. అతడికి ఏ మాత్రం వక్రతవున్నా విశ్లేషిస్తున్నదేదయినా, పక్షపాత ధోరణితోనూ, వక్రంగానూ ఉంటుంది. విశ్లేషణలో అదొకసమస్య. మరొకటేమిటంటే క్రమేణ నెమ్మదిగా, కొంచెం, కొంచెంగా భయానికున్న కారణాలన్నింటినీ తీసివెయ్యాలంటే సమయం తీసుకుంటుంది. తానప్పటికి చచ్చిపోవచ్చు. (నవ్వులు)

ఈ లోపల తాను చీకట్లో, హీనంగా, పిచ్చివాడయి ప్రపంచంలో అల్లరిని సృష్టిస్తూ వుంటాడు. నీవు భయానికి కారణాలు కనుక్కున్న తర్వాత దానికేమయినా విలువ ఉంటుందా? నాకేమంటే భయమో తెలిస్తే భయం మాయమవగలదా? బౌద్ధికంగా కారణాన్ని వెతికితే భయాన్ని విచ్ఛిన్నం చేయగలదా? ఈ సమస్యలన్నీ విశ్లేషణలో వున్నాయి, ఎందుకంటే విశ్లేషకునికి విశ్లేషింపబడేదానికి మధ్య ఆ విభజన వున్నదని అంగీకరిస్తున్నాం కాబట్టి. అందుచేత, విశ్లేషణ మార్గంకాదు. కానేకాదు. ఎందుకంటే అది ఎందుకో ఎందుకుకాదో మనం చూశాము. అందులో నిజాన్ని గమనించాము. విశ్లేషణకు సమయం పడుతుంది. సమయమేమో లేదు. చెప్పాలంటే మానసికంగా రేపన్నది లేదు. దానిని మనం సృష్టించుకుందాం. కాబట్టి విశ్లేషణలోని అసత్యాన్ని చూడడంతో పరిశీలకుడే నిజానికి పరిశీలింపబడేది అనే సత్యాన్ని చూడడంతో విశ్లేషణ పనికిరాకుండా పోతుంది.

భయపడుతూవున్న పరిశీలకుడుగాక మీరే భయం అన్న వాస్తవం మీ ముందుంటుంది. పరిశీలకుడు, పరిశీలింపబడేది మీరే? విశ్లేషకుడు విశ్లేషింపబడేది మీరే. మీరు ఒక చెట్టును చూస్తున్నప్పుడు నిజంగా ఒక చెట్టువంక మాటలతో ప్రమేయం లేకుండా వాస్తవంగా చూస్తున్నప్పుడు మీకు చెట్టుకు మధ్యభౌతికంగా దూరమేకాక మానసికంగానూ దూరమున్నది. అది ఒక చెట్టుగానో మరొకదానిగానో ఆ చెట్టు గురించి మీకున్న ఊహారూపంతో ఆ దూరం కల్పించబడింది. కాబట్టి పరిశీలకుడికి పరిశీలింపబడే చెట్టుకు మధ్య భేదమున్నది. ఈ భేదం, ఎడంలేకుండా చేయగలమా? మీరే చెట్టవడమూ గాదు. అది మరీ అసంబద్ధమూ అర్థం లేనిదీ. కాని పరిశీలకునికి చెట్టుకు మధ్యనున్న దూరం లేకుండా పోయినప్పుడు పూర్తి భిన్నంగా చెట్టును చూస్తారు. మీరెప్పుడయినా ప్రయత్నించారేమో నాకు తెలియదు.

ప్రా: మీకు చెట్టుకు మధ్యనున్న దూరం లేకుండాపోవడమంటే ఖచ్చితమయిన అర్థమేమిటి?

కృ: ఒక్క నిముషమండీ, నన్ను పూర్తి చేయనీయండి, తర్వాత ప్రశ్నలడగవచ్చు.

సరేనా? మీరు తప్పకుండా అడగాలనే ఆశిస్తాను. విశ్లేషణలో యీ ఎడం ఉంటుంది. కాబట్టి విశ్లేషకునికి, విశ్లేషింపబడేదానికి మధ్య సూటి సాన్నిహిత్యం లేదా సంబంధం ఏదీ ఉండదు. భయంతో తక్షణ సంబంధమున్నప్పుడే పూర్తిగా భిన్నమయిన క్రియ ఉంటుంది. చూడండి. మీరు వేరొకరిని మీ భార్యనో మిత్రురాలినో, భర్తనో

పరిశీలిస్తున్నప్పుడు ఆ వ్యక్తి గురించి మీరు ప్రోగుచేసుకున్న జ్ఞానం మీద ఆధారపడి పరిశీలన జరుగుతుంది. అలా జరిగితే ఆ జ్ఞానం వేరుచేసి విభజిస్తుంది. కాబట్టి అక్కడ ఘర్షణ ఉండడంతో సంబంధం ఉండదు. కాబట్టి మరొకరివంక, ఇక్కడనుండి వెళ్ళిపోయాక ఇక ఎటువంటి సంబంధమూ ఉండదు, కాబట్టి ఈ వక్తవంక అట్లా చూడవచ్చుననుకోండి. కాని మీ భార్యవంకో, పిల్లలవంకో, మీ పొరుగువానివంకో లేదా రాజకీయవేత్తవంకో ఆ దూరంలేకుండా చూడగలరా? మీరిది చేయగల్గితే విషయాలను పూర్తి భిన్నంగా చూస్తారు.

వినోదం కోసమో, ఉత్తేజం కోసమో, దర్శనాల కోసమోగాక నిజంగా ఏమి జరుగుతుందో చూడడంకోసం కొన్ని మాదకద్రవ్యాలు తీసుకునే కొంత గంభీర స్వభావులు నాతో చెప్పినదేమంటే ఆ తీసుకున్నవానికి బల్లమీద ఉన్న పుష్పగుచ్ఛానికి మధ్యనున్న దూరం పోతుందని, దానితో వారు పూవును, రంగును చాలా గాఢంగా చూస్తారని, ఇంతకు ముందెన్నడూ లేని లక్షణం ఆ గాఢతలో ఉంటుందని మీకు తెలుసా? మీరు మాదక ద్రవ్యాలను తీసుకోవాలని, నేను చెప్పడం లేదు. నేను ఆ సలహా ఇవ్వడం లేదు. మనం అనుకున్న విధంగా సంబంధాలలో యీ దూరం అంటే విశ్లేషకునికి, విశ్లేషింపబడేదానికి, పరిశీలకునికి, పరిశీలింపబడేదానికి, అనుభవించేవానికి, అనుభవింప బడుతున్నదానికి మధ్యదూరం ఉన్నంతవరకూ ఘర్షణ, బాధ తప్పవు.

కాబట్టి మనమిది నిజంగా అర్థం చేసుకుంటే ఒక భావనగానో, సంభాషణగానో గాక యదార్థంగా అనుభూతి చెందితే పరిశీలకునికి, పరిశీలింపబడుతున్న దానికిమధ్య, ఉన్నట్లు అనుభవించిన హింస, కోపం, ద్వేషం అన్న అనుభూతులు విపరీతమయిన మార్పుకు లోనవుతాయి. ఇంతకు ముందున్నది గాదది. చిన్ననాటినుండి మరణించే వరకు నిరంతర ఘర్షణో, కార్యాలయంలో, కుటుంబంలో అంతు లేకుండా ఉండే యుద్ధరంగమో గాదు. దానిని పరిష్కరించకుండా ఘర్షణలో ఉండడంతో లోపల భయం పుడుతుంది. సుఖమున్నప్పుడు భయం గూడా వుంటుంది. మనమెప్పుడూ సుఖంకోసం ప్రాకులాడుతాము. మనకు గావలసింది గొప్ప సుఖం. మనం సుఖం కోసం వెంటబడితే బాధ, భయము తప్పవు.

కాబట్టి ఈ మధ్యాహ్నం మన ప్రశ్నేమిటంటే కాలంతోపాటు గాక కాల ప్రమేయం లేకుండా మనసు తనను తాను మార్చుకోగలదా? కాల భావనలేకుండా అంతరంగంలో ఒక గొప్ప మానసిక విప్లవం రాగలదా? ఏదేమయినా ఆలోచనే కాలం కదూ? ఆలోచన వచ్చేది గతాన్నుండి. అది స్మృతికి, జ్ఞానానికి, అనుభవానికి ప్రతిస్పందన. ఒక సిద్ధాంతమన్నట్లుగాక యదార్థమన్నట్లు తనలోనే దీనిని పరిశీలింపగలగాలి. దేని గురించి భయపడుతున్నామో, ఏది సౌఖ్యాన్నిస్తుందో వాటిగురించే ఆలోచన యోచిస్తుంది. సుఖ దుఃఖాల గురించిన ఆలోచన కాలపరిధిలోనే ఉంటుంది. తాను సూర్యాస్తమయాన్ని చూస్తున్నప్పుడు లేదా వివిధ రకాల ఉత్తేజాలు, ఆనందాలు యిత్యాది వాటిద్వారా సౌఖ్యాన్ననుభవిస్తాడు.

ఏది ఉత్తేజాన్ని, ఆనందాన్ని యిచ్చిందో దాని గురించి ఆలోచన ఆలోచిస్తుంది. దయచేసి దీనిని గమనించండి. మీకు మీరే దీనిని చూడగలుగుతారు. చాలా సులభమిది. దీని గురించి చేసే ఆలోచన తాను ఆనందించిన దానిని కొనసాగనిస్తుంది. నిన్న అందమయిన సూర్యాస్తమయం ఉన్నది. నిన్ననే అయిపోయిన ఆ సూర్యాస్తమయాన్ని అక్కడే ముగించకుండా దానిగురించి ఆలోచిస్తాము. ఆ ఆలోచనా చర్యే ఆ సన్నివేశానికి కాలాన్ని పొడిగిస్తుంది. అంటే రేపు మళ్ళీ ఆ ఆనందం కావాలని ఆశిస్తూ ఉన్నాను. కాబట్టి సుఖాన్ని బాధను రెండింటినీ ఆలోచన పొడిగిస్తుంది. అప్పుడు మరీ లోతయిన ప్రశ్న దీనిలో నుండి ఉద్భవిస్తుంది. ఆలోచన నిశ్శబ్దంగా ఉండగలదా? ఎందుకంటే నిజమైన మార్పుండేది అప్పుడే. మీరు ఇప్పుడేదయినా ప్రశ్న అడగాలనుకుంటున్నారా?

ప్రా: బాధ్యతగా ఉండడంగురించి మీరు మాట్లాడారు. కాని నా ఆలోచనకు నేను బాధ్యుడినిగాకపోవచ్చు. నేనే మార్పు చేయాలనుకున్నా ఆలోచనలతో చేయవలసిందే. బహుశా నా ఆలోచనలకు నేను బాధ్యుడిని గాదు. నేనేమి ఆలోచించాలి అన్నది నేను నిర్ణయించలేను.

కృ: సర్! బాధ్యతగా ఉండడం అనే మాటకు మన అర్థమేమిటి? బాధ్యత అన్న అనుభూతి ఆలోచనా ఫలితం గాదా?

ప్రా: కాదు... అవును గూడా.

కృ: చూడండి. ప్రేమ ఆలోచన ఫలితమా?

ప్రా: కాదు.

కృ: ఆహా, ఆగండి, నెమ్మదిగా సాగండి (నవ్వులు). అప్పుడు మీరు కాదు అంటే మీరు ప్రేమిస్తున్నప్పుడు ఆలోచనకున్న స్థానమేమిటి?

ప్రా: ప్రేమగురించి నాకున్న అవగాహనకు ముందు అది వుంటుంది.

కృ: ఆహా! ఆగండి, అందుకే నేనడిగింది ప్రేమంటే సుఖమా? అని. అది సుఖమే అయితే ఆలోచనా ఫలితం. అప్పుడు ఎంతంటే అంత సుఖాన్ని అలవరుచుకుంటూ కూర్చోవచ్చు. మనం చేస్తున్నది అదే. కాని ప్రేమనలా అలవరచుకోలేము. కాబట్టి ప్రేమ ఆలోచనా ఫలితం గాదు. ప్రేమ అక్కడున్నప్పుడు బాధ్యతంటే ఏమిటి? దయచేసి మ్మదిగా సాగండి. బాధ్యత ఆలోచనా సుఖాలమీద ఆధారపడి ఉంటే అందులో స్వహించడము యిత్యాదివి యిమిడి వుంటాయి. అయితే ప్రేమ సుఖంగానప్పుడు దీనిలోనికి చాలా చాలా జాగ్రత్తగా వెళ్ళి అర్థం చేసుకోవాలి. అప్పుడు ప్రేమకు – ఆ మాట వాడవచ్చునంటే – ఆమోదయోగ్యమయిన అర్థంలో బాధ్యత ఉంటుందా? నా కుటుంబాన్ని ప్రేమిస్తాను. కాబట్టి నా కుటుంబానికి నేను బాధ్యుడిని, ఆ ప్రేమ సుఖంమీద ఆధారపడి వున్నదా? అలా ఉంటే బాధ్యతనే ఆ పదానికి పూర్తిగా భిన్న అర్థం వస్తుంది. అప్పుడు ఆ కుటుంబం నాది, నా స్వంతము, నేను దానిమీద ఆధారపడ్డాను. నేనే దానిని చూసుకోవాలి. నేనప్పుడు ఈర్ష్యపడతాను. ఎందుకంటే ఆధారపడడమెక్కడుంటే

అక్కడ భయం, ఈర్ష్య ఉంటాయి. కాబట్టి నాకు కుటుంబమంటే ప్రేమ. దానికి నేను బాధ్యుడిని అని మనం చెప్తున్నప్పుడు ఈ ప్రేమన్న పదాన్ని వాడతాము. ఇంకా లోతుగా పరిశీలించి చూడండి. చంపడంకోసం పిల్లలకు శిక్షణ ఇస్తున్నారు. విద్యావంతులను చేయడం వారి జీవనభృతిని సంపాదించుకోవడం కోసమే. జీవితానికి అదే పరమార్థం, ఉద్యోగం సంపాదించడం చాలా ప్రధానం-అని చదువులు చెప్పిస్తున్నారు బాధ్యత అంటే అదేనా?

ప్రా: మనం ఒక సంకల్పంగా దేనినీ చేసుకోలేము. ఎందుకంటే, మన నిబద్ధతే మన సంకల్పాన్ని నిర్ణయిస్తుంది.

కృ: సంకల్పమంటే ఏమిటండీ? దయచేసి చూడండి, ఈ ప్రశ్నలకు చాలావరకు వివరణ అవసరమవుతున్నది. ప్రతిఒక్కరికీ విసుగేస్తున్నది. వెళ్ళిపోవాలి. ఇక్కడితో ఆపేస్తే మంచిది.

**శ్రోతలు:** వారు వెళ్ళవలసిన అవసరం వున్నది. విసుగువలన కాదు. కుటుంబ బాధ్యతలు!

కృ: వెళ్ళేవారికి మీరు బాధ్యులు గారే! (నవ్వులు) మంచిది చూడండి. మనం సంకల్పాన్ని ఉపయోగించాము. ఇట్లా చేయాలి, ఇట్లా చేయగూడదు. ఇది నేను చేసి తీరాలి. కూడదు. మీరు పైకి రావడంకోసం అధికారంకోసం, పదవికోసం, గౌరవంకోసం సంకల్పాన్ని ఉపయోగించాలి. ఇతరుల మీద పెత్తనం చేయడానికి మీరు సంకల్పాన్ని ఉపయోగించారు. సంకల్పం మన జీవితాలలో గొప్ప పాత్ర నిర్వహించింది. మీరన్నట్లు అది మనం జీవించే సమాజానికి, పరిసరాలకు, సంస్కృతికి ఫలితము. అయితే మనం జీవిస్తున్న సంస్కృతి తిరిగి మానవులు తయారుచేసిందే. కాబట్టి సంకల్పానికి స్థానమే మయినా ఉన్నదా? అని మనమడగాలి. ఎందుకంటే సంకల్పమంటే ఘర్షణ పోరాటం, వైరుధ్యం. 'నేనిది కావాలి అది కావాలి. అది కావాలంటే నా సంకల్పాన్ని వినియోగించాలి. సంకల్పం లేకుండా పూర్తిగా వేరొకరకంగా పనిచేయలేమా?' అని మనమడుగుతున్నాం.

ప్రా: మీరు 'సంకల్పాన్ని' ఉపయోగించకపోతే ఆలోచనను ఉపయోగించి తీరాలి కదా?

కృ: చూడండి. మీకొకటి చూపుతాను. మీరొక అపాయాన్ని చూస్తే ఆలోచననో, సంకల్పాన్నో ఉపయోగిస్తారా? అక్కడ తక్షణ చర్య వుంటుంది. జరుగుతుంది. ఆ చర్య గత ఆలోచనా ఫలితంగావచ్చు. మీరు ఒక నిటారైన కొండ అంచునో, ఒక పామునో అపాయకరమైన దానినో చూసినప్పుడు తటాలున, అప్పటి కప్పుడు మీ చర్య వుంటుంది. ఆ చర్య గత నిబద్ధతా ఫలితమే గావచ్చు. అవునా? పామును సమీపించడం అపాయమని మీకు చెప్తారు. అది మీ జ్ఞాపకం. మీరు నిబద్ధులయి చర్య చేస్తారు. ఇప్పుడు జాతీయత ఎంత అపాయకరమో చూస్తే - అది యుద్ధాన్ని పెంచడము, దేశాలకు సంబంధించిన

వేర్వేరు ప్రభుత్వాలు, వేర్వేరు సేనలు యిత్యాది భయంకర విభజనలు యీ ప్రపంచంలో కొనసాగుతూ వుండడం చూస్తే, జాతీయత అన్న నిజమైన అపాయాన్ని బౌద్ధికంగానో, శాబ్దికంగానోగాక వాస్తవంలో దాని ప్రమాదాన్ని చూస్తూ, వినాశనాన్ని తెచ్చే దాని స్వభావాన్ని చూస్తే అప్పుడు సంకల్పం చర్య తీసుకుంటుందా? ప్రత్యక్షంగా గ్రహించడం అంటే ఒకదానిని అది నిజమా అని చూడడానికి ఆలోచన కావాలా? మంచితనం లేదా సౌందర్యం లేదా ప్రేమ ఆలోచనా ఫలితమా? ఆలోచన ఎప్పుడయినా క్రొత్తగా ఉండగలదా? ఎందుకంటే ప్రేమ కొత్తగా ఉండాలి. ప్రేమ ప్రతిరోజూ మారేది గాదు. కుటుంబం మధ్య, కుటుంబంలోనూ రోజురోజుకూ మారదు - ఒక రకంగా స్వంత ఆస్థివలె ఆలోచన ఎప్పుడూ పాతదే. కాబట్టి మనం సంకల్పాన్ని ఉపయోగించకుండా, గందరగోళం లేకుండా స్పష్టంగా చూడగలమా? ఎందుకంటే అప్పుడే పూర్తిచర్య వుంటుంది.

ప్రా: సంపూర్ణచర్య రసానుభూతిని కలిగిస్తుందనుకుంటా.

కృ: సంపూర్ణ చర్య అంటే మీ అర్థం ఏమిటో నాకు తెలియదు. రసమయ సౌందర్యమని ఎందుకంటాము? అదే ఇంకో సమయంలో చాలా అపాయకరంగా కనబడవచ్చు. సంపూర్ణ చర్యంటే మన అర్థమేమిటి? ఒక చిన్న విషయాన్ని తీసుకోండి. తులనాత్మక చర్య ఎక్కడ ఉన్నదో, ఎటువంటి చర్య బాగుంటుందో అంటూ పోల్చడం జరిగితే అక్కడ కొలత వుండడంతో మంచి అంతమవుతుంది. మధ్యతరగతి మంచితనం అనే అర్థంలో ఈ మంచి అన్న పదాన్ని ఉపయోగించడం లేదు నేను. చూడండి, సంపూర్ణ సహృదయత అంటే పూర్తి సావధానత. మీ శరీరం మొత్తం-కళ్ళు, చెవులు, హృదయం అంతా సావధానంగా ఉండడము. మీరెప్పుడు ప్రేమిస్తారో-అప్పుడు అక్కడ తక్కువ ఎక్కువలుండవు. అది సంపూర్ణచర్య.

ప్రా: నా భావాలను నా ఆలోచనలను నేను మార్చుకోగలనా? ఉదాహరణకు ప్రతిరోజూ నేను కార్యాలయానికి వెళ్ళినప్పుడు అత్యాశతో, దురాశతో భయపడుతూ ఉండాలనుకుంటారు. ఆ విధంగా వుండాలని నా మీద వత్తిడి చేసి, మళ్ళీ వాళ్ళే నా అల్పతను, దురాశను, ఆకాంక్షనూ, భయాన్ని నాకు ఎత్తి చూపుతారు. నేనిలా వుండాలని కోరుకోవడంలేదు అని గ్రహించినప్పుడు నేను మారగలనా?

కృ: నేను భయస్తునిగా, దుడుకుగా, ఆర్జనాపరునిగా ఉండాలని కోరేటటువంటి వ్యవస్థకు చెందిన నేను ఏ ఆకాంక్షలూలేకుండా కార్యాలయానికి వెళ్ళగలనా? నేను ఆకాంక్షలతో, పూర్తి దురాశతో లేకుంటే, మాటల్లోగాదు – నిజంగా బొత్తిగా అత్యాశన్నదే లేకుంటే నన్ను దురాశలో పడవేసేది ఏదీ అప్పుడుండదు. ఎందుకంటే దురాశయొక్క సత్యా సత్యాలను నేను చూశాను. నేనది స్పష్టంగా చూసినప్పుడు కార్యాలయానికి వెళ్ళినా, భ్రష్టమైపోకుండా ఉండనూ? పాక్షికంగా దురాశతో ఉన్నప్పుడే నేను చిక్కుకుపోతాను. అందుకే తాను సంపూర్ణంగా ఉండాలి. అంటే పూర్తిగా సావధానమయివుంటే ఆ సావధానతలో తులనాత్మకంగాని, కొలత వేయలేని మంచితనం ఉంటుంది. మనసు దురాశగా లేనప్పుడు ఏ వ్యవస్థా దాన్ని దురాశకలదిగా చేయలేదు.

ప్రా: బాధాకరమయిన సన్నివేశంలో ఆ బాధాకరమయిన సంఘటనను అడ్డుకోవాలని నా లోపలి నుండి ఒక సహజేచ్ఛ కలుగుతుంది. అప్పుడు నేను సావధానంగా ఎట్లా వుండగలను?

కృ: ముందుగా, దేనినీ అడ్డుకోవాలని అనుకోకూడదు. సుఖాన్నయినా, బాధనయినా దానిని అర్థం చేసుకోవాలనుకోవాలి. దానివంక చూస్తాను. దానిలోనికి వెళతాను. ఒకదాని నడ్డుకోవాలంటే ప్రతిఘటించాలి. ఎక్కడ ప్రతిఘటన ఉంటుందో అక్కడ భయ ముంటుంది. మెదడు, మనసు ప్రతిఘటించడానికి నిబద్ధమయాయి. కాబట్టి ఏ ప్రతిఘటనయినా ఒక రకమైన భయమేనన్న సత్యాన్ని మనసు చూడగలదా? కాబట్టి ప్రతిఘటన అంటున్న దానికి నా అవధానత నివ్వాలని అర్థం. ప్రతిఘటించడం పట్ల సంపూర్ణ అవధానతతో ఉండడము. అది ఏదయినా అడ్డుకోవడము, పారిపోవడము, మత్తుపానీయాలను, మాదక ద్రవ్యాలను తీసుకోవడము, - ఏ రకంగా పారిపోవడం లేక ప్రతిఘటించడమున్నా - దానిపట్ల పూర్తి గమనికలో ఉండడము.

ప్రా: అది ఎంతకాలం చేయగలరండీ?

కృ: ఎంతసేపు, ఎంతకాలం, ఎంతవరకూ అన్నది గాదు ప్రశ్న. చూశారా? మీరు యింకా ఎంతకాలం అన్న పరిభాషలోనే ఆలోచిస్తున్నారు.

ప్రా: అది నిబద్ధత.

కృ: మంచిది అమ్మా, గమనించండి. దయచేసి దానిని గమనించండి. మీరు నన్ను మెచ్చుకుంటారు లేక అవమానిస్తారు. సుఖప్రదమో, బాధాకరమో. నాకు కావలసినది సౌఖ్యకరమయినది. బాధాకరమయినదానిని వదిలేస్తాను. లేదా ప్రతిఘటిస్తాను. కాని నేను సావధానంగా ఉంటే నాకొచ్చిన పొగడ్తపట్ల, అవమానంపట్ల ఎరుకతో ఉంటాను. నేనా విషయాన్ని బహు స్పష్టంగా చూస్తాను. అప్పుడు అది ముగిసిపోతుంది కదూ? మరోసారి మెచ్చుకోండి. అవమానించండి. అది నన్ను ప్రభావితం చేయదు. ఇది సావధానతను నిలుపుకోవడమన్న ప్రశ్న గాదు. మీరు ఎప్పుడయితే సావధానంగా ఉండాలని కోరుకుంటారో అప్పుడు సావధానత లేనట్లే. సరేనా? దయచేసి దీనిలోనికి కొంచెం సాగండి. సావధానంగా ఉన్న మనసు 'నేనెంతసేపు సావధానంగా ఉండాలి' అని అడగదు (నవ్వులు). సావధానంగా లేని మనసు సావధానతంటే ఏమిటో తెలిసి 'నేనెప్పుడూ సావధానంగా ఉండగలనా?' అంటుంది. కాబట్టి తాను శ్రద్ధవహించవలసింది సావధానతాలేమి పట్ల. సరేనా? సావధానతా లేమిగురించి ఎరుకే గాని అవధానతను నిలుపుకునేదెలా అనిగాదు. అంటే కేవలం నేను సావధానంగాలేనని, నేను అనుకోకుండా ఏదో మాట్లాడేస్తానని, నాకు నిజాయితీలేదని ఎరుక ఉండడము. ఊరక సావధానమయి ఉండడము. సావధానత లేకపోవడం హానిని తీసుకొస్తుంది. అవధానతనుగాదు. సావధానత లేకపోవడం గురించి మనసుకు తెలిస్తే అప్పటికే సావధానమయినట్లు. మరింకేమీ చేయనక్కర లేదు.

ప్రా: మనం చేస్తున్న ఒక రకమైన పని కొందరిని బాధించి, మరికొందరికి లాభం చేకూరుస్తుంటే ఏం చేయాలి, ఏది సరయినది అనే గ్రహింపు, మనకి వున్నదో లేదో ఎట్లా తెలుస్తుంది?

కృ: మీరొకదానిని స్పష్టంగా, సత్యమయినదిగా చూసినప్పుడు అక్కడ స్పష్టమయిన చర్య తప్ప మరే చర్యా ఉండదు. స్పష్టత ఎప్పుడూ, సత్యమైనదే. అది బాధిస్తుందా లేదా అన్నది అసమంజసం. చూడండి. జాతీయత ఒక విషం - అది యుద్ధాలను పెంపొందించింది. పెంపొందిస్తూనే వుంటుంది. జాతీయభావం లేనప్పుడు మిలటరీవారిని, రాజకీయవేత్తలను ఆచార్యులను ప్రపంచంలో జెండా లెగరేసే వారందరినీ, ఆ సమూహాన్నంతటినీ బాధిస్తుంది. అయినప్పటికీ అదెంత భయంకరమయిన విషయమో నాకు తెలుసు. దానిని విషంలాగా చూస్తాను. నేనేమి చేయాలి? నాకు నేనుగా దానిని స్పృశించను. నాలో నేను జాతీయతనంతటినీ సంపూర్ణంగా తుడిచిపెట్టేశాను. కాని 'మీరు మమ్మల్ని బాధిస్తున్నారు' అంటుంది యుద్ధసేన. ఏది సత్యమో, ఏది అసత్యమో చూసి, చేసి ఉంటే ఎవరినో బాధించడము, మెప్పించడము అనే ప్రశ్నే ఉండదు. సంస్థాగతమయిన మతం మతమే గాదని మీరు చూస్తే ఏమిచేస్తారు? మనుషుల్ని మెప్పించడం కోసం చర్చికి వెళతారా? నేను వెళ్ళకపోతే మా అమ్మ బాధపడుతుందేమో? సర్! యిక్కడ ప్రధాన మయినదేమంటే 'ఏది బాధిస్తుంది, ఏది మెప్పిస్తుంది? అన్నది గాదు. సత్యమేదో చూడడము. అప్పుడా సత్యమే తన పనిచేస్తుంది. మీరు గాదు.

## 2

మన జీవితం మొత్తం నిరంతర పోరాటమని నిన్న మనం చెప్పుకున్నాము. పుట్టినప్పటినుండి మరణపర్యంతమూ మన జీవితమొక యుద్ధరంగం. కల్పనలోగాక, నిజంగా ఆ పోరాటం అంతమవగలదా అని, అంతరంగంలోనేగాక బాహ్యంగానూ, సంపూర్ణ శాంతితో జీవించగలడా అని సందేహం కలుగుతున్నది. నిజానికి అంతర బాహ్య విభజన లేదు. అదంతా వాస్తవంగా ఒకే చలనము. ఈ విభజన మన చర్మానికి లోనున్న ప్రపంచం, బయటున్న ప్రపంచం అన్నట్లే గాక నా - మీ, మన - వారి, మిత్రుడు - శత్రువు యిత్యాది వాటి మధ్యా విభజన వున్నట్లు భావించబడుతున్నది. మనచుట్టూ ఒక వలయాన్ని గీసుకోవడంతో అది మీ వలయం. నా వలయం లేదా కుటుంబ వలయం, దేశ వలయం, మత నమ్మకాల వలయం. ఈ వలయాలన్నీ మనను విభజిస్తాయి. దానితో జరుగుతున్న నిరంతర విభజన తప్పక ఘర్షణ తెస్తుంది. దాటి బయటకెప్పుడూ వెళ్ళము. దానిని దాటి చూడమెప్పుడూ. మనచిన్న వలయాన్ని వదిలి వెళ్ళడమన్నా, మరొకరి చుట్టూ ఉన్న వలయాన్ని అవరోధాన్ని తెలుసుకోవడమన్నా మనకు భయం. అందులో మొత్తం భయ స్వరూప స్వభావాల ప్రక్రియ ఆరంభమవుతుందనుకుంటాను. తనచుట్టూ సూత్రాలతో, భావనలతో, మాటలతో, విశ్వాసాలతో ఎంతో జాగ్రత్తగా తయారుచేసుకున్న తన ప్రపంచాన్ని తనలో మూసిపెడుతూ ఒక అవరోధ మేర్పరచుకున్నాడు. ఈ గోడవల మధ్య నివసిస్తూ, బయటకు వెళ్ళాలంటే భయపడుతున్నాడు.

ఈ విభజన రకరకాల బలహీన ప్రవర్తనేగాక ఎంతో ఘర్షణను గూడా పెంచుతుంది. ఒక వలయాన్ని ఒక గోడను వదిలేసినా మన చుట్టూ మరోగోడ కట్టుకుంటాము. కాబట్టి భావనలతో కట్టే ఈ నిరంతర శాశ్వత ప్రతిఘటన ఉంటుంది. ఏ విభజనా లేకుండా ఉండడము, మొత్తం విభజనే అంతం చేయడము, దానితో ఘర్షణకు, ముగింపు తీసుకురావడము సాధ్యమా అని మనిషి ఆశ్చర్యపోతాడు.

మన మనసులు సూత్రాలతో నా అనుభవాలు, నా జ్ఞానం, నా కుటుంబం, నా దేశం, ఇష్టం-అయిష్టం, ద్వేషం, ఈర్ష్య, అసూయ, దుఃఖం, ఈ భయం, ఆ భయం అంటూ నిబద్ధతకు లోనయాయి. నేను ఆ వలయంలో ఆ గోడ వెనుక జీవిస్తాను. నాకు లోనున్న దాని గురించేగాక గోడవెనకాలున్న దాని గురించీ భయం. గొప్ప పుస్తకాలను తత్త్వశాస్త్రాన్ని, మిగిలిన వాటన్నింటినీ చదవకుండానే తనలోనే తాను యీ నిజాన్ని ఎంతో సులభంగా చూడగలడు. తన గురించి తనకు-నిజానికి తానేమిటో యదార్థంగా తనలో జరుగుతున్నదేమిటో తెలియకుండా ఇతరులేమి చెప్పారోనని చదవడంతో యిలా జరుగుతూ ఉండవచ్చు. మనలోనికి మనం చూసుకుంటే, మనమెలా ఉండాలోనన్నది పట్టించుకోకుండా మనం నిజంగా ఏమిటో చూస్తుంటే బహుశా యీ సూత్రాలు, భావనలు, వాస్తవానికి మనిషిని మనిషికి వ్యతిరేకంగా చేసే విధానాలు, పక్షపాతాలు, దురభిప్రాయాలు ఉండడము తెలుసుకుంటాము. కాబట్టి మనిషికి మనిషికి మధ్యనున్న సంబంధాలన్నింటిలో భయం, ఘర్షణ, లైంగిక హక్కులు, సరిహద్దు హక్కుల ఘర్షణేకాక ఇంతకుముందు ఉన్నదేది-ఇప్పుడున్నది - ఉండవలసినదేదిల మధ్యగూడా ఘర్షణ ఉంటూ వున్నది.

తనలోనే యీ నిజాన్ని చూడడము - ఒక భావనలాగా చూడడమో బయటి కిటికీగుండా లోనిదాని వంక చూస్తూన్నట్లుగాక -యదార్థంగా మీలోనే చూస్తే అప్పుడు సూత్రాలు, నమ్మకాలు, ప్రతికూల అభిప్రాయాలు, భయాలు వీటన్నింటి నిబద్ధతా మనసులో లేకుండా చేసుకోవడం ఏ మాత్రమయినా సాధ్యమేమో తెలుసుకుంటారు. చరిత్రలో, నేడూ రెండింటిలోనూ మనిషి యుద్ధాన్ని ఒక జీవితవిధానంలాగా అంగీ కరించినట్లు చూస్తాము. కాబట్టి యుద్ధాన్నెలా అంతం చేయాలి. ప్రత్యేకంగా ఒక యుద్ధాన్ని గాదు. అన్ని యుద్ధాలనూ, ఎటువంటి ఘర్షణలేకుండా పూర్తి ప్రశాంతతతో ఎలా జీవించాలి అన్నది కేవలం బౌద్ధికమయిన ప్రశ్నేగాదు. సంపూర్ణంగా సమాధానం చెప్పవలసిన ప్రశ్న. ఖండఖండాలుగా, ప్రత్యేక రంగాలలోనే కాదు. మనిషి అంటే నేనూ, మీరూ - సంపూర్ణ శాంతితో జీవించగలమా? అంటే నిరుత్సాహంగా జీవించడం గాదు. లేదా చురుకుగా, నడిపించే శక్తి తనకు లేదనీగాదు. అటువంటి ప్రశాంతత సాధ్యమేమో తెలుసుకోగలడా? అవి తప్పకసాధ్యమే. లేదంటే మన జీవితానికుండే అర్థం అత్యల్పము. ప్రపంచమంతటా మేధావులు జీవితానికి ప్రాధాన్యతను కనుగొనడానికి, ఒక అర్థాన్నివ్వడానికి ప్రయ త్నించారు. అన్ని మతాలు భగవంతుడు అంతిమమని, భగవంతుడే నిజంగా ప్రధానమని జీవితం ఒక మధ్యేమార్గము మాత్రమేనని అంటాయి. మీరు మతధర్మాన్ని నమ్మే వ్యక్తిగాకుంటే దైవానికి బదులు దేశాన్నుంచుతారు. లేదా ఆ నిస్పృహనుండి ఏ సిద్ధాంతాన్నో కనుగొంటారు.

కాబట్టి మన ప్రశ్నేమంటే, నిజంగా మనిషి ప్రశాంతంగా జీవించగలడేమో తెలుసుకోవడము. ఒక సిద్ధాంతంలాగా ఒక భావనలాగా కాదు, మీరొక సూత్రం చేసుకొని దాని ప్రకారం ప్రశాంతంగా జీవించాలనుకోవడమూ కాదు, యదార్థంగా జీవించడము. అటువంటి సూత్రాలే తిరిగి గోడలవుతాయి. అంటే నా సూత్రం - మీ సూత్రం, నా భావన - మీ భావన దాని ఫలితంగా వచ్చే విభజనలు, అంతులేని యుద్ధమూ. ఏ సూత్రమూ విభజన లేకుండా, దాని వలన ఘర్షణ లేకుండా తాను జీవించగలడా? ఆ ప్రశ్న ఎప్పుడయినా గంభీరంగా మీకు మీరు వేసుకున్నారేమో నాకు తెలియదు. 'నాది' 'నాది కాదు' అనే యీ విభజనమండి మనసు స్వేచ్ఛ నొందగలదా? 'నేను' నా కుటుంబము, నా దేశము, నాకు దేశంలేకుంటే నేను నా కుటుంబము, నా భావన, నా సిద్ధాంతము అన్న విభజన నుండి మనసు స్వేచ్ఛనొందగలదా?

దీనంతటి నుండీ స్వేచ్ఛ నొందడం రాత్రికి రాత్రే సాధ్యమా? చివరికి ఎప్పుడో గాదు. చిట్టచివరికి అన్న సిద్ధాంతానికి మనం తావిస్తే మనమసలు జీవిస్తున్నట్లే కాదు. చివరికి స్వేచ్ఛ నొందుతాము. లేదా చివరికి ప్రశాంతంగా జీవిస్తాము. అదెంత మాత్రం మంచిది గాదు. ఒక మనిషి ఆకలిగా వుంటే వెంటనే తినాలనుకుంటాడు. అప్పుడు మనసును మొత్తం నిబద్ధతనుండి విడుదల చేసే చర్య ఏది? ఒకచర్య - చర్యల వరుస కాదు. ఇక్కడ యీ విభజనలను సృష్టిస్తున్న యీ స్వీయ కేంద్రక చర్య. ఒక సూత్రాన్ని ఒక సిద్ధాంతాన్ని, ఒక దేశాన్ని, ఒక నమ్మకాన్ని చుట్టి ఒక కుటుంబం యిత్యాది వాటిని చుట్టి ఉన్న స్వీయ కేంద్రక చర్య ఉన్నది. అంటే స్వార్థం కేంద్రంగాగల చర్య. ఈ స్వీయ కేంద్రక చర్య వేరు చేస్తుంది. దానితో ఘర్షణకు కారణమవుతుంది. ఇప్పుడు ఈ సూత్రపు కదలిక, అంటే 'నేను' అన్నది, దాని స్మృతులతోపాటు, దేని చుట్టూ గోడలు కట్టబడినవో ఆ కేంద్రం, ఆ నేను వేరుగా ఉన్న అది తన స్వకేంద్రిత చర్యతో సహా అంతమవగలదా? చర్యల వరుసతోగాదు, ఒక పూర్ణమయిన చర్యతో?

ఆ ఘర్షణను కొంచెం కొంచెంగా బ్రద్దలు చేయడానికి ప్రయత్నిస్తామని మీకు తెలుసు. వేరు వరకూ పోకుండా చెట్టును కొంచెం కొంచెం నరికేసినట్లు. కాబట్టి ఒక్క చర్యతో ఈ విభజనను, వేర్పాటును స్వకేంద్రిత చర్యల స్వరూపాన్ని - అవి పెంచే ఘర్షణ, యుద్ధం, పోరాటాలను అంతమొందించడము ఏమాత్రమయినా సాధ్యమా అని అడుగుతాడు, ఇది సాధ్యమా?

ఎంతో గంభీరంగా ఈ ప్రశ్న నడిగినప్పుడు మరొకరి నుండి సమాధానంకోసం ఎదురు చూస్తాడా? ఆ ప్రశ్న వేసిన తర్వాత వక్త నుండి సమాధానంకోసం ఎదురు చూస్తున్నారా? సమాధానమివ్వడం వక్త తప్పించుకుంటున్నాడని గాదు. మీరు సమాధానం కోసం ఎదురుచూస్తున్నారా? మీకేమాత్రం శ్రద్ధ ఉన్నా - సమాధానం కోసం ఎదురు చూస్తారా? తానలా వుండాలని నిన్న అనుకున్నాము. ఉండాలి. ఎందుకంటే జీవించడమంటే ఏమిటో ఎవరు తెలుసుకుంటారో గంభీరమయిన ఆ వ్యక్తి మాత్రమే జీవితాన్ని తెలుసుకుంటాడు. మీరు వక్తనుండి సమాధానంకోసం చూస్తే ఆ సమాధానం ఎవ్వో

బూడిద రేణువులు, ఎన్నో మాటలు, ఎన్నో భావాలు మరొక సూత్రాల పరంపర అవడంతో తిరిగి వాటిలో అవే విభజనకప్పుడు మరొక కారణమవుతాయి. అది కృష్ణమూర్తి సూత్రమో-మరొకరి సూత్రమో గావచ్చు. ఎవరి నుండీ, వక్తనుండీ గూడా సమాధానంకోసం ఎదురు చూడకపోతే అప్పుడు మనమిరువురమూ కలిసి ప్రయాణించగలము. అప్పుడా బాధ్యత మీదీ, వక్తదీనూ. మీరప్పుడువింటున్నది కేవలం మాటలను, భావాలనుగాదు. అప్పుడు మనమిరువురమూ కలిసి నడుస్తున్నట్లు. వక్తకు మీకు మధ్య నున్న విభజనను వదిలించుకోవడము అది ముఖ్యమనుకుంటున్నాను. మనం కలిసి వున్నాము. ఏ సూత్ర ప్రకారమో గాదు. అప్పుడు ప్రయాణంలోనున్న మన మధ్య సూటి సంబంధమున్నది. ఎందుకంటే, మనమిరువురమూ యదార్థంలోనికి వెళ్తున్న మార్గాన్ని అనుభూతి చెందుతున్నాము. యదార్థమంటే, మాటలో వర్ణనో, వివరణో లేక నేర్పరియైన మనసుయొక్క తత్వశాస్త్రంలో గాదు.

కాబట్టి తగినంత శ్రద్ధతో తాను ఉన్నాననుకున్నప్పుడు మన సమస్య ఏమిటి? మన నిత్యజీవితాన్నెలా జీవించాలి? ఒక సన్యాసాశ్రమంలోనో లేదా కాల్పనికస్వప్నప్రపంచంలోనో గాదు, ఉద్వేగపూరిత, పిడివాద, మాదకద్రవ్యాలకు లోబడివున్న ప్రపంచంలోగాదు-యిక్కడ యిప్పుడు ప్రతిరోజూ గొప్ప శాంతితో, గొప్ప ప్రజ్ఞతో ఎటువంటి అసంతృప్తి భయం లేకుండా ఎలా జీవించాలి? సంపూర్ణంగా జీవించడం, దానితో ఆనందంలో ఉండడం, అంటే ధ్యానంలో ఉండడము-అదీ నిజంగా మౌలికమయిన సమస్య. ఈ జీవితాన్ని విడి విడి భాగాలుగా కాక-మొత్తాన్ని పూర్తిగా, అర్థం చేసుకోవడం, అందులో కలిసిపోయి, ఏ భాగానికీ అంకితమయిపోకుండా, ఎంటువంటి ఘర్షణ, క్లేశం, గందరగోళం లేదా దుఃఖం లేకుండా జీవించడమనే పూర్ణ క్రియలో ఉండడం సాధ్యమా? అదీ నిజమైన విప్లవం, అంతరంగ మానసిక విప్లవం, దానినుండే తక్షణ బాహ్యావిప్లవం చొచ్చుకొస్తుంది. మనం కలిసి ప్రయాణం చేద్దాము. కలిసి అంటే అర్థం మీరక్కడ, నేనిక్కడ వేదిక మీద కూర్చోడముగాదు-ఈ జీవితరంగం మొత్తాన్ని కలిసి చూడడంతో అర్థం చేసుకోవడము ఎవరో అర్థం చేసుకుని ఎలా అర్థం చేసుకోవాలో తర్వాత మనకు చెప్పడము గాదు, మనం అప్పుడే గురువు-శిష్యుడు-రెండూను.

వేటి వెనుక మనం జీవిస్తుంటామో ఆ నేను నేను కానిది. మనము - వారు అనే ఈ విభజనలు, యీ సూత్రాలు భయాన్ని పెంచుతాయన్నది చూస్తాము. ఈ భయమంతటి గురించి, ఈ మొత్తం భయంగురించి ఎరుక ఉంటే ప్రత్యేకంగా ఉన్న భయాన్ని అర్థం చేసుకోగలడు. భయమన్న ఆ ప్రశ్న మొత్తాన్ని అర్థం చేసుకోనంత వరకూ కేవలం ఒక ప్రత్యేకమయిన వెర్రి భయాన్ని, దానికి ఎన్ని రంగులు పూసి అలంకరించినా దానిని ఒక్కదానిని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించడంలో అర్థం లేదు, భయం స్వేచ్ఛను పోగొడుతుంది. మీరు ఎదురు తిరగవచ్చు. అయినా అది స్వేచ్ఛగాదు, ఆలోచన మొత్తాన్ని భయం చెడుపుతుంది. తనలోని భయం సంబంధం మొత్తాన్ని పాడు చేస్తుంది. దయచేసి ఇవి మాటలు మాత్రమే గాదు. మన జీవితం మొత్తంలో మొదటి నుండి చివరిదాకా ఉన్నది భయమేనన్నది స్పష్టము. ప్రజాభిప్రాయ

భయం, ప్రేమింపబడనన్న భయం, నాయకునిబట్టి మనను మనం అంచనా వేసుకోవడం వలన భయం పెంపొందడము. మనసులో ఒక స్పష్టమయిన స్థాయిలోనే గాక ఎక్కడో అడుగులోతుల్లో గూడా ఈ భయం పరుగెడుతూ వుంటుంది. ఈ భయం క్రమేణా కొంతకొంతగా గాక సంపూర్ణంగా అంతానికొస్తుందా అని మన మడుగుతున్నాము.

ఈ భయమంటే ఏమిటి? తానెందుకు భయపడుతున్నాడు? అది వలయానికవతల ఉన్నదాని గురించా, వలయంలో ఉన్నదాని గురించా లేక వలయమంటేనే భయమా? మన అర్థమేమిటో గ్రహించారా? మనం ప్రయత్నిస్తున్నది ఈ భయానికి ఉండే ఒక ప్రత్యేక కారణాన్ని తెలుసుకోవడానికి గాదు. ఎందుకంటే, నిన్న మనమనుకున్నట్లు కారణాన్ని తెలుసుకోవడము, కార్యకారణాలనర్థం చేసుకునే విశ్లేషణ ప్రక్రియ, భయాన్ని అంతం చేయదన్నది స్పష్టము. ఆ ఆట చాలా కాలంపాటు ఆడారు. అయితే యీ మైక్రోఫోనును చూస్తున్నంత వాస్తవంగా తానా భయాన్ని చూస్తున్నప్పుడు అది ఉన్నది గోడలోపలనా, గోడ బయటనా, లేక గోడవలనే భయం ఉంటున్నదా? భయం కలిగేది తప్పక గోడవల్లనే, మీరు గోడలోపల ఉండడమువలన గాదు, గోడను దాటి చూడడానికి మీరు భయపడి నందువలనా గాదు. మీ పరిశీలనలో అది నిజంగా గోడవల్లనే ఉన్నదని తెలుస్తుంది. అసలీ గోడ తనలోనికెలా వచ్చింది?

దయచేసి యీ ప్రయాణం మనమిరువురమూ కలిసి చేస్తున్నదని, వక్తనుండి సమాధానంకోసం ఎదురు చూడడంలేదని గుర్తుంచుకోండి. మనమిద్దరమూ కలిసి చేతులు పట్టుకుని ప్రయాణిస్తున్నాము. మీరొక్కసారి వేరయి పోయి చెయ్యి తీసేసుకుని 'నా కంటే ముందు మీరెళ్ళి దాన్నంతా నాకు చెప్పండి' అనడంలో అర్థంలేదు. ఇరువురమూ కలిసి చేస్తున్న ప్రయాణంలో మాటల్లో జరిగేదానికంటే ఎక్కువైనదేదో ప్రసరిస్తున్నది, వాత్సల్యం, కరుణ అవగాహనలతో కూడుకున్న ఒక రకమైన భావ సంగమం ఇక్కడ ఉంటుంది. ఎందుకంటే, మనం విచారిస్తున్నది మొత్తం మానవ సమస్యగురించి కాబట్టి. ఆ సమస్య నాది అనుకొని పరిష్కరించి, నా తీర్పును మీరూ సమ్మతించండి అనడం లేదు. ఇది మనందరి సమస్య.

ప్రతిఘటన, విభజన వేర్పాటు అనే యీ గోడ తనలోనికెలా వస్తుంది? మనం చేసే ప్రతిదానిలో మనం సంబంధాలన్నింటిలో అది ఎంత దగ్గరయినా గందరగోళాన్ని క్లేశాన్ని, ఘర్షణను తీసుకువస్తున్న యీ విభజన వుంటున్నది, తనలోనికి ఈ అడ్డు ఎలా వచ్చింది? నిజంగా దీనినర్థం చేసుకుంటే బౌద్ధికంగాగాక దానిని యదార్థంగా చూసి, అనుభూతి చెందితే అప్పుడు అంతమవడం తెలుసుకుంటాడు. దానిలోనికి మనం వెళదాము. ఈ గోడ తనలోనికెలా వచ్చిందని అడిగాము. దానికి మీరు సమాధానమివ్వాలి గాబట్టి మీరేమి చెప్తారో అని అనుకుంటున్నాను. మనలో ప్రతి ఒక్కరికీ ఒక అభిప్రాయం వున్నది. లేదా ఒక అభిప్రాయాన్ని వెలిబుచ్చుతాము. నా అభిప్రాయం సరయింది, మీది తప్పుకావచ్చు. తార్కికంగా మనం పరీక్షించవచ్చు. కాని తార్కిక పరీక్ష చేసి ఒక ఖచ్చితమైన నిర్ణయానికి రావడంపట్ల మనకు శ్రద్ధలేదు. సత్యం ఒక అభిప్రాయంతో,

ఒక నిర్ణయంతో కనుగొనేది కాదు. ఎప్పుడూ నూతనంగా ఉండేదేదో సత్యం గనుక ఒక నిర్ణయంతోనో, ఒక అభిప్రాయంతోనో, ఒక తీర్పుతోనో మనసు సత్యాన్ని చేరలేదు. మనసు స్వేచ్ఛనొందాలి. కాబట్టి ప్రతిఘటన అనే యీ గోడ తనలోనికెలా వచ్చిందోనని మనం అడిగినప్పుడు ఒక అభిప్రాయం కోసం, ఒక తెలివయిన, పండితుడయిన వ్యక్తి ఎలా వచ్చిందో చెప్తాడని అడగడం లేదు - ఎందుకంటే అక్కడ అధికారం లేదు. మన మిరువురమూ కలసి దానిని చూస్తున్నాము. కలిసి పరీక్షిస్తున్నాము. ఇక అందులోనికి లోతుగా వెళ్ళాలని చూస్తున్నాము.

గోడలోనికి వచ్చింది-ఆలోచనా యంత్రాంగం ద్వారానన్నది స్పష్టం కాదా? దయచేసి దీనిని కాదనవద్దు. దీనిని, ఆలోచనను ఊరికే చూడండి. మరణాన్ని గురించి ఆలోచించకపోతే మరణంగురించి భయపడవు. ఒక క్రైస్తవునిగానో, కాథలిక్కుగానో, ప్రొటెస్టంటుగానో, హిందువుగానో, బౌద్ధునిగానో దేవుడికే తెలియాలి. ఎన్నో - అలా పెంచబడకపోతే ప్రచారంతోనో, మాటలతోనో, ఆలోచనతోనో మీరు నిబద్ధులవకపోతే ఎటువంటి ఆటంకమూ ఉండదు. 'నా','మీ' అంటూ ఆలోచన దీనినెలా తీసుకు వస్తుందో తాను చూడగలడు. కాబట్టి ఆలోచన స్వకేంద్రిత కార్యకలాపాలతో కూడిన యీ గోడను సృష్టించడమేగాక, ఈ గోడలోపల మీ స్వంత కలాపాన్ని గూడ సృష్టిస్తుంది. ఈ విభజనను, అది సృష్టించే భయాన్ని తీసుకు వచ్చేది ఆలోచన, ఆలోచన సుఖమయినట్లే ఆలోచన భయం కూడా. చాలా అందమైన దానిని ఒక అందమయిన ముఖాన్ని, ఒక ప్రీతి గల్గించే సూర్యాస్తమయాన్ని, ఆనందింప గల్గిన నిన్నటి సన్నివేశాన్ని చూస్తాను. ఆలోచన 'అదెంత బాగుంది' అంటూ యోచిస్తుంది. దయచేసి దీనిని చూడండి. ' ఆ అనుభవం ఎంత బాగుంది'అనడం చూడండి. ఆలోచించడమనేదే ఆ అనుభవ సుఖాన్ని కొనసాగనిస్తుంది. కాబట్టి ఆలోచన భయానికేగాక సుఖానికి గూడా బాధ్యురాలు. అది చాలా స్పష్టము. ఎందుకంటే మీరీ మధ్యాహ్న భోజనాన్ని ఆనందించారు. అది తిరిగి కావాలనుకుంటారు. లేదా మీకొక లైంగికానుభవముంటే దాని గురించి ఆలోచన ఆలోచిస్తుంది. దానిపైనే ధ్యాసపెడుతుంది. నెమరు వేస్తుంది. ఒక చిత్రాన్ని, ఒక ఊహాబింబాన్ని కల్పిస్తుంది. తిరిగి అదే కావాలనుకుంటుంది. పునశ్చరించిన సుఖమిది. దానిని మీరు ప్రేమంటున్నారు. ఆలోచన, అడ్డు, ప్రతిఘటన, నమ్మకము అనే ఈ వలయాన్ని సృష్టించి అది విచ్ఛిన్నమవుతుందేమోనని గోడ కావలివైపునుండి ఏదయినాలోనికి వస్తుందేమోనని భయపడుతుంది. కాబట్టి ఆలోచన భయాన్ని, సుఖాన్ని రెండింటినీ పెంచుతుంది. మీకు భయం లేకుండా సుఖముండడము సాధ్యమవదు. ఆ రెండూ కలిసేవుంటాయి. ఎందుకంటే, ఆ రెండూ ఆలోచనకు పుట్టిన బిడ్డలు. ఆలోచన కేవలం సుఖం, భయాలు గురించి శ్రద్ధ చూపే మనసుయొక్క నిష్ప్రయోజమయిన బిడ్డ. దయచేసి దీనిని చూడండి. దీనిని తిరిగి మనమిద్దరమూ కలసి ప్రయాణిస్తున్నామని గుర్తు చేయనీయండి. మిమ్మల్ని మీరు మాటలనే అద్దంలో గమనించుకుంటున్నారు. మిమ్మల్ని పరీక్షించుకుంటున్నారు.

కాబట్టి, భయం, బాధ, సుఖం అనేవి ఆలోచన ఫలితాలు. అయినా ఆలోచన సాంకేతిక ప్రపంచంలో ఎక్కడ అవసరమయితే అక్కడ తార్కికంగానే, మంచిగానే,

ఆరోగ్యంగానే నిర్దిష్టంగానే పనిచేయాలి. మానవసంబంధాలలో చేయనక్కరలేదు. ఎందుకంటే, మానవ సంబంధాలలో ఎప్పుడు ఆలోచన ప్రవేశిస్తే అప్పుడు భయ ముంటుంది. అప్పుడందులో సుఖమూ, బాధా వుంటాయి. ఇవి అర్థంలేని మాటలు గాదు. దీనిని మీకు మీరే చూడొచ్చు. స్మృతికి, అనుభవానికి జ్ఞానానికి వచ్చే సమాధానం ఆలోచన. ఆలోచన ఎప్పుడూ పాతదే గనుక స్వేచ్ఛగా ఉండదు. ఆలోచించే స్వేచ్ఛ అన్నది తప్పక మీకు కావలసింది చెప్పడానికుంటుంది. అయితే ఆలోచన ఎప్పటికీ స్వేచ్ఛగా ఉండదు. స్వేచ్ఛను తీసుకురాలేదు. ఆలోచన భయాన్నిగాని, సుఖాన్నిగాని ఉండేటట్లు చేస్తుంది గాని స్వేచ్ఛను రానివ్వదు. భయం, సుఖం ఎక్కడుంటే అక్కడ ప్రేమ ఆగిపోతుంది. ప్రేమంటే ఆలోచనా గాదు, సుఖమూ గాదు. కాని మనకు ప్రేమంటే సుఖం, కాబట్టి భయం.

ఈ జీవనవ్యాపారం మొత్తాన్ని ఉన్నదున్నట్లు తెలుసుకుంటే మనముండాలను కుంటున్నట్లు గాక ఒక తత్వశాస్త్రవేత్త ప్రకారం, పవిత్రుడయిన ఆచార్యుల ప్రకారం గాక, యదార్థంగా ఎలా ఉంటే అలా తెలుసుకుంటే అప్పుడు ఆలోచనకూ సరైన స్థానము వుంటుంది. అయితే ప్రతి సంబంధంలోనూ జోక్యం చేసుకోకుండా ఉంటుంది. దీనర్థం ఆలోచన, ఆలోచనా శూన్యత అనే రెండు స్థితుల మధ్య విభజన ఉండడము గాదు. మీరు చూడండి. మీరీ ప్రపంచంలో జీవించాలి. దురదృష్టవశాత్తూ జీవికను సంపాదించాలి. కార్యాలయానికి వెళ్ళాలి. ఎప్పటికైనా ఐక్య ప్రపంచపు సఖ్యమయిన ప్రభుత్వం వస్తే బహుశా అప్పుడు ఒక్క రోజుకంటే ఎక్కువ పనిచేసే అవసరముండకపోవచ్చు. అప్పటినుండి కంప్యూటర్ల ఆక్రమణకు వదిలివేయడంతో మనకు కొంత విరామ అవకాశముంటుంది. అది జరుగనంతవరకూ తానే జీవికను సంపాదించుకోవాలి. సమర్థవంతంగా తగినంత జీవికను సంపాదించుకోవాలి. ఉదాహరణకు దురాశవలన గానీ విజయాన్ని సాధించి ఎవరి మాదిరో కావాలనుకునే యీ భయంకర కోరికవలన గానీ, ఆ సమర్థత వికృతమవుతుంది. అప్పుడు 'నేను', 'నేను కాదు' అనే యీ అవరోధం తనలో ఉద్భవించి పోటీని, ఘర్షణను తీసుకువస్తుంది. దీనంతటిలోని సత్యాన్ని గ్రహించి గౌరవంగా, సమర్థంగా, నిర్ణయం లేకుండా వున్నప్పటికీ ప్రకృతితోనే గాక మరొక మనిషితోనూ ఎలా పూర్తి సంబంధంలో ఉండడము? అంటే ఎందులోనయితే ఆలోచన కల్పించిన అవరోధము అంటే 'నేను' 'మీరు' అనే నీడలు పడవో ఆ పూర్తి సంబంధంలో మనమెలా ఉండాలి?

మనం మాట్లాడుకుంటున్న యీ విషయాన్నంతా మాటల్లోగాక, యదార్థంగా చూస్తే ఆ చూడడమే, యదార్థంగా ఆ చూడడమే వేరు అన్న గోడను నేలమట్టం చేసే చర్య. అపాయకరంగా ఉన్న ఏ కొండఅంచునో, క్రూరమృగాన్నో, మరే ప్రమాదాన్నో చూసినప్పుడు అక్కడ చర్య ఉంటుంది. ఆ చర్య నిబద్ధతా ఫలితంగావచ్చు. భయంతో చేసే చర్య మాత్రం గాదు. ఇది ప్రజ్ఞాక్రియ.

అదేవిధంగా ఈ నిర్మాణ స్వరూపం మొత్తాన్ని - ఈ విభజన స్వభావాన్ని, ఘర్షణను, పోరాటాన్ని, క్లేశాన్ని, స్వకేంద్రమవడాన్ని, ప్రజ్ఞాయుతంగా చూడడము. దాని ప్రమాదాన్ని

యదార్థంగా చూడడమంటే అది అంతమవడమని అర్థం. 'ఎలా' అన్న ప్రశ్నే లేదక్కడ. కాబట్టి ముఖ్యమయినదేమంటే దీనంతటిలోనికి ప్రయాణం చేయడము. మరొకరు తీసుకువెళితే గాదు. అక్కడ ఒక మార్గదర్శి లేడు కనుక ఈ ప్రపంచం మొత్తాన్ని యదార్థంగాచూస్తూ , అసాధారణ గందరగోళాన్ని, మనిషికున్న అంతులేని దుఃఖాన్ని వున్నదున్నట్లుగా చూస్తూ ప్రయాణించడము. అప్పుడు దీని సంపూర్ణ స్వరూపాన్ని చూడడమే దానిని అంతం చేయడమూ అవుతుంది.

బహుశా, శ్రద్ధ వుంటే మనం దీనిని ప్రశ్నించుతూ మాట్లాడుకోవచ్చు. సరేనాండీ!

ప్రా: ఏదయినా యదార్థంగా చూడడమంటే అర్థమేమిటి?

కృ: మీ భార్యనో, భర్తనో యదార్థంగా చూస్తారా? లేక ఊహా రూపం ద్వారా అభిప్రాయాల నిర్ణయాల ముసుగుద్వారా చూడడంవలన అసలే చూడలేకపోతారా? అదేనయితే సంబంధముండదు. ఎందువలనంటే, సంబంధమంటే అర్థం స్పృశించడము. దానికి సంబంధించి ఉండడము. భర్త అత్యాశాపరుడు, దురాశాపరుడు, అసూయాపరుడు అయి విజయాన్నే కోరుతూ కలతతో, పారిపోయి తన వలయంలోనే జీవిస్తుంటే, భార్యా తన వలయంలో జీవిస్తుంటే సంబంధమెక్కడుంటుంది? అయినా మనం సంబంధ మంటున్నది దానినే - మిగిలిన ప్రపంచానికి విరుద్ధంగా నా కుటుంబమంటున్నాము, ఇది కనుక చూస్తే, ఏ ఊహారూపం ద్వారా చూస్తున్నానో నిజంగా కనుక దానినే చూస్తే సృష్టించుకున్న ఊహాబింబాన్ని గాదు - యదార్థంగా వున్న ఊహాబింబాన్ని ఉన్నదున్నట్లు చూస్తే ఆ సత్యాన్ని చూడడమే ఊహారూపాన్ని తొలగిస్తుంది.

ప్రశ్నడగడము చాలా కష్టమయిన విషయాలలో ఒకటని మీకు తెలుసు. అయినా మనం ప్రశ్నించాలి. ఈ భూమి మీద ప్రతిదానినీ సందేహించాలి. మన నిర్ణయాలను, భావాలను, అభిప్రాయాలను మన తీర్పులను సందేహించాలి. అంతేగాదు, ఎప్పుడు సందేహించగూడదో తెలుసుకోవాలి. గొలుసుతోనున్న కుక్కను కొంత వదిలివేసినట్లు కొన్నిసార్లతనిని వెళ్ళనివ్వాలి. ఎందుకంటే స్వేచ్ఛలోనే సత్యాన్ని తెలుసుకునేది. అయితే ప్రశ్న, సరయిన ప్రశ్న నడగడానికి గొప్ప అప్రమత్తత, ప్రజ్ఞ, సమస్య గురించి ఎరుక కావాలి. సమస్యలోనికి నిజంగా వెళ్ళకుండా నేనేదో ప్రశ్నించగలను. ఏదో సమాధానాన్ని ఆశించగలను. కాని నా హృదయం, మనసు మొత్తంతో సమస్యలోని కెళ్తే దానినుండి పారిపోయే ప్రయత్నం చేయకుండా ఉంటే ఆ సమస్యలోనికి చూడడంలోనే సమాధాన ముంటుంది. కాబట్టి తానెప్పుడయినా ప్రశ్నిస్తే దీనర్థం ప్రశ్నించకుండా మిమ్మల్ని అడ్డుకుంటున్నట్లు గాదు - తాను ప్రశ్నిస్తే ప్రశ్నించడానికేగాక సమాధానమందుకోవడానికి గూడా బాధ్యత వహించాలి.

మీరెలా ప్రశ్నిస్తారన్నదానికంటే సమాధానాన్నెలా అందుకుంటారనేది ముఖ్యము. ఎందుకంటే సమాధానం మీకు నచ్చకపోవచ్చు. కాదనవచ్చు. ఎందుకంటే మిమ్మల్నది ఆ సమయంలో సంతోషపెట్టనందువలన లేదా దాని విలువను మీరు చూడనందువలన లేక లాభనష్టాల దృష్టితో మీరాలోచిస్తుండడం వలన.

ప్రా: ఆలోచనకు, మనోభావానికి ఇంద్రియజ్ఞానానుభూతికి ఉద్వేగానికి మధ్యనున్న భేదం స్పష్టంగా లేదు.

కృ: ఇంద్రియానుభూతి అంటే ఏమిటండీ? ఉద్దీపన. మీరో అందమయిన ముఖం, చక్కటి రంగు చూస్తారు. ఆ ప్రత్యక్ష వీక్షణననుసరించి సంవేదన, తర్వాత స్పర్శ. తర్వాత కోరిక, చివరకి ఆలోచనలోకొచ్చి 'ఆహా! నాకది ఉంటే బాగుండు' అనడము మనకక్కడ ప్రత్యక్షవీక్షణ, సంవేదన, స్పర్శ, కోరిక, అదే యీ కదలిక మొత్తం వుంటుంది. అది 'నాకు కావాలి' 'వద్దు', 'ఇది నాది' 'నాది కాదు' అనే ఆలోచనతో పటిష్టంగా చేయబడుతుంది. అప్పుడు ఆలోచన అడ్డురాకుండా ఒక అందమైన ముఖం లేక అద్భుతమయిన సూర్యాస్తమయం ప్రత్యక్షంగా వీక్షించగలగడ ముంటుందా అన్న ప్రశ్న ఉత్పన్నమవుతుంది. మరొక విధంగా చెప్పాలంటే అక్కడ అనుభవంలేని కేవలం ప్రత్యక్ష వీక్షణమే ఉండే స్థితి. అన్ని అనుభవాలకంటే ఉన్నత స్థితి ఉండగలదా అన్న ప్రశ్న ఉత్పన్నమవుతుంది. నేనది సరిగ్గా వివరించానా? లేక ఇదంతగా నిజం అనిపించకపోగా అంతకంటే అర్థం పర్థంలేకుండా ఉన్నదా? చూడండి. ఒక అందమయిన కారుకు ప్రత్యక్షంగా చూడడముంటుంది. (శ్రోతలతో సహా నవ్వుతారు.) బహుశా అందమయిన ముఖం యింకా సరయినదేమో! (నవ్వులు.) అప్పుడు ఇంద్రియ సంవేదన లేక ఇంద్రియానుభూతి ఉంటుంది. దానిని తాకి చూడాలనుకుంటారు. దాని వంక చూస్తారు. చివరికి ఆలోచన ప్రవేశిస్తుంది. సౌఖ్యం, బాధ అనే యంత్రాంగం మొత్తం ఆరంభమవుతుంది. ఆ ముఖాన్నప్పుడు బాధ, సుఖం అన్న సూత్రపు జోక్యం లేకుండా పరిశీలించడము జరుగగలదా? నేనేమి మాట్లాడుతున్నానో మీ కర్థమవుతున్నదా? నిజంగా యిదెంతో ఆసక్తికరమయిన సమస్య.

మానసికంగా మనం యితరుల మీదెంతో ఆధారపడతాము. ఆ ఆధారపడుతున్నది భయం, సుఖాలమీద ఆధారపడడంలోని బాధ తెలియడంతో ఆధారపడడాన్నుండి స్వేచ్ఛ నొందడానికి ప్రయత్నిస్తాడు. అయితే చేసే ప్రయత్నమే యితర రకాల భయాన్ని, బాధను, ఘర్షణను పెంపొందించుతుంది. మానసికంగా మరొకరిమీద ఎందుకు ఆధార పడుతున్నాడన్న ప్రశ్ననెప్పుడూ తానడగడు. మీరు పాలవానిమీదా, పోస్టువానిమీదా, అలాగే మిగిలినవారిమీద ఆధారపడతారు. అయితే ఆ విషయం పూర్తిగా వేరు. కాని మానసికంగా అంతరంగంలో ఆధారపడడమెందుకు? ఒంటరిగా ఉన్నందువలనా? తనలో ఏమీ లేనందువలనా? తగినంత లేనందునా? ఆధారపడేది ఏ విషయంలోనంటే సంవేదనా, సౌఖ్యాల ఫలితం మీద. ఇంతేకాదా? కాబట్టి ఆలోచనకు ఫలితమూ, కారణమూ రెండూ ఆధారపడడమే. అంతేనా? ఇది సరిగా అర్థం చేసుకుంటే అనుభవం ఎంత క్లిష్టమైన విషయమో తెలుస్తుంది. అయినా మనమంతా గొప్ప అనుభవాలను, ఎంతో క్లిష్టమైన అనుభవాలను కావాలనుకుంటున్నాము. మానసికమైన ఒక అనుభవం ఎందుకు అవసరమా అని మనమెప్పుడూ అడగలేదు. ఎన్నో విషయాల నంగీకరిస్తున్నట్లే జ్ఞానోదయానికి, అవగాహనకు ఆనందానికి, ఆ అనుభవం అవసరమని అంగీకరించాము. అందుకు విరుద్ధంగా, అమాయకంగా ఉండే మనసు మాత్రమే ఆనందాన్ని

పొందగలదు గానీ, అనుభవాలతో బరువెక్కిన మనసు పొందలేదు. అంతేగాక, ఈ అనుభవాలు, భయం, సౌఖ్యం, అన్న యీ విభజన మీద ఆధారపడ్డాయి. మనమిష్టపడేవీ, పడనివీ తప్ప ప్రతి అనుభవమూ వదిలేయబడుతున్నది.

ప్రా: నిజమైన ప్రేమకు పెరుగుదల అవసరం అవుతుందా?

కృ: అబద్ధ ప్రేమ ఒకటుందా? (నవ్వులు.) నవ్వకండి, తనను లోతుగా తాకే విషయాల గురించి నవ్వడం సులభమే. నవ్వుతూ దానిని ప్రక్కన పెట్టేస్తాము. మనకు ప్రేమంటే ఏమిటో తెలుసా? లేక మనకు బాధ, సుఖం, ఈర్ష్య, ప్రేమ అని పిలుస్తున్న దానివేదన మాత్రమే తెలుసా? అత్యాశాపరుడు, పోటీదారుడు, నైపుణ్యాన్ని సంపాదించిన వాడు ప్రేమంటే ఏమిటో తెలుసుకోగలడా? పరాజయాన్ని గురించి భయపడే మనిషి, జయం పొందాలని పోరాడుతున్న మనిషి ప్రేమంటే ఏమిటో తెలుసుకోగలడా? మీకు ప్రేమ, ఈర్ష్య ఒకేసారి ఎప్పుడయినా ఉండగలిగాయా? ప్రేమిస్తున్న యువతో, యువకుడో, ఈర్ష్య, ఆధిక్యతలతో సొంతం చేసుకుంటూ, పట్టి ఉంచుతూ, ఆధారపడుతూ, ఎప్పుడూ ఉండగలరా? నిజానికి మనకు తెలిసినదంతా ప్రేమని పిలుస్తున్నదంతా సుఖము, బాధ. అది సాధారణంగా లైంగికతగా మారుతుంది. కాబట్టి లైంగికత ఒక అసాధారణ సమస్యవుతుంది. మనం దానిని వ్యతిరేకించడం లేదు. దేనికయినా విరుద్ధంగా ఉండడము భయంకరము. అదేమిటో చూడాలి. అంతే ప్రేమంటున్నది దాని తాలూకు బాధను, సుఖాన్ని మాత్రమేనని మీకుతెలుసు గాబట్టి అది ప్రేమగాదు. ప్రేమను పెంపొందించుకోలేము. అలవరుచుకునేదయితే అది ప్రేమ గాదు. ఒక మొక్కను పెంచినట్లు నీళ్ళు పోయడం పోషించడం దానిని చూసుకోవడం అద్భుతంగా వుండేది, ప్రేమ విషయంలో మీరది చేయగల్గితే చాలా సులభంగా వుంటుంది. దురదృష్టవశాత్తూ ఆ విధంగా పనిచేయదది. ఎందులో బాధ, సౌఖ్యం ఉండవో ఆ ప్రేమించడము పూర్తిగా భిన్నం. కాబట్టి ఈ భయాన్ని, సౌఖ్యాన్ని, మిగిలినవాటన్నింటినీ అర్థం చేసుకోవాలి. అలా చేస్తే విభజన ఉండదు.

ప్రా: ప్రపంచం అస్తవ్యస్థంగా ఉండడము వాస్తవము. మనిషి నిస్పృహతో ఉండడము అది వాస్తవము. అప్పుడు మనిషిని మార్చేదేది? అసలది సాధ్యమా?

కృ: సరే! ప్రపంచం మననుండి వేరుగా ఉన్నదా? మనము, మనలో ప్రతి ఒక్కరమూ అపసవ్యంగా, గందరగోళంలో లేమా? కేవలం పైపైన గాదు. వ్యతిరేకమయినవాటి ఘర్షణలో, వైరుధ్యాలలో, వ్యతిరేకమయిన కోరికలతో లేమా? అదంతా అపసవ్యతే. అదంతా మార్చాలా? అని అడుగుతున్నారు. ప్రశ్న అదేనా?

ప్రా: కాదు. పూర్తిగా అదేగాదు మార్చడమనే యీ కోరిక ఉన్నది. కాని ప్రపంచంలో నున్న అపసవ్యత అన్న నిజాన్ని ఎదుర్కొన్నప్పుడు మార్పు స్వభావం ఎలా వుంటుంది?

కృ: మార్పు స్వభావమేమంటే, అపసవ్యతను కాదనడము. అపసవ్యత సవ్యతగా చేయబడడం లేదు. అయితే ఖండించడం మార్పు స్వభావము. ఆ ఖండనే మార్పు.

మార్పు యొక్క నిజస్వభావం అపసవ్యతను కాదనడము. అంటే నాలోని అపవస్యవతను, కోపాన్ని, ఈర్ష్యను, మూఢతను, హింసను, సందేహాన్ని, అపరాధ భావాన్ని చూడడంతో మనుషులెలా ఉండేది తెలుస్తుంది. నాకది తెలుసు. ఈ అపసవ్యతంతా మనసుకు పూర్తిగా తెలుసు. పూర్తిగా దానిని నిరాకరించి ఆవల పెట్టేయగలదా? ఆ విధంగా చేస్తే నిరాకరణతో సానుకూలత సవ్యత మార్పు స్వభావమవుతుంది. ప్రతికూలతతోనే అనుకూలమయింది రాగలదు. చూడండి, జాతీయతను, మత విభజనను, ఆ నమ్మకం తెచ్చే వేర్పాటును, ఘర్షణను, అపసవ్యతను మొత్తాన్ని చూస్తాను. యదార్థంగా చూస్తాను. నా రక్తంతో అనుభూతి చెందుతాను. ఆవలపెడతాను. మాటల్లో గాదు. యదార్థంగా నాలో, నేను ఏ దేశానికి, ఏ మతానికి చెందను. ఏ పిడివాదాన్ని, నమ్మకాన్ని సమ్మతించను. అప్పుడు అబద్ధాన్ని నిరాకరించడమే సత్యం. మార్పు స్వభావమదే.

ప్రా: మీరు చెప్పినదానిని, యిది ఖండించడం లేదా? మీలోని ఈర్ష్యను తెలుసు కున్నప్పుడు కాదనకుండా ఆ ఈర్ష్య మీరే అవడము ఖండించడం కాదా?

కృ: కాదమ్మా! పరిశీలకుడే పరిశీలింపబడేది అన్నాను. 'నేను ఈర్ష్యకు వేరుగా వున్నాను' అంటున్న పరిశీలకుడిలో ఆ వేరు భావం ఉన్నప్పుడు అక్కడ పరిశీలకునికి పరిశీలింపబడేదానికి మధ్య ఘర్షణ ఉంటుంది. మనం నెమ్మదిగా వెళదాము. మిగిలిన వాటన్నింటివలెనే మానవ సమస్య నిజానికెంతో క్లిష్టమయింది. కాబట్టి దీనితో కొంత ఆట ఆడుతున్నట్లుగా మనకు మనమే చూద్దాము. భార్య నేను గాక, నాకు వేరయితే అక్కడ సంబంధముండదని మీకు తెలుసు. అప్పుడు 'నేను' భార్యను వేరు పదార్థంగా చూస్తాను. ఆ విభజనే ఘర్షణకు దారితీస్తుంది. అది స్పష్టము. ఈర్ష్యకు వేరుగా నేను ఉంటే ఘర్షణ ఉంటుంది. దీనిని వదిలించుకోవడమెలా? ఈర్ష్యపడడం సరయిందే ఈర్ష్యపడడం ఆనందంగా వుంటుంది. ప్రేమలో ఈర్ష్య పడడమొకభాగం. ఇలాంటి మిగిలినవన్నీ వుంటాయి. అయితే పరిశీలకునికి ఈర్ష్య అంటున్నదానికి మధ్య విభజన లేకుంటే అది అతడే. అతడు ఈర్ష్యాపరుడవడం గాదు. ఇది అతడే. అప్పుడు మీరేం చేస్తారు? మీకు సమస్య అర్థమయిందా?

శ్రోత: ఆ యువతి అడుగుతున్నదీ అదేనండీ. ఏదయితే మార్పో దానిని నిరాకరిస్తారు అంటున్నది. మీరు అపసవ్యతను నిరాకరించడమే మార్పు అంటున్నారు. నేనే అపసవ్యతయితే దానినెలా కాదంటాను? అంటుందా యువతి.

కృ: ఆహా! నేను వివరిస్తాను. నేను అపసవ్యమయినప్పుడు దానినెలా నిరాకరిస్తాను? నేను జాతీయభావాన్ని, నేను నమ్మకాన్ని, అపసవ్యతను. అపసవ్యతను 'నేను' కాదంటుంటే ఆ వేరయిన నేనే మరొక రకమయిన అపసవ్యతను సృష్టిస్తుంది. మీ ప్రశ్న అదేనా అమ్మా? సరే 'అపసవ్యతను నిరాకరించు' అని మీరన్నప్పుడు దానిఅర్థమేమిటి? ఆ అపసవ్యతను నిరాకరిస్తున్నదెవరు? దయచేసి దీనికి నెమ్మదిగా అడుగు తర్వాత అడుగువేస్తూ గ్రహించండి. ఈ అపసవ్యత ఆలోచనకు కారణము. నా నమ్మకం - మీ నమ్మకం, నా దైవం - మీ దైవం, నా సూత్రం - మీ సూత్రం, నా అపోహకు విరుద్ధంగా మీ

అపోహ. కాబట్టి నేను అపసవ్యతను. ఆ అపసవ్యత ఆలోచనే. ఎందుకంటే నేనే ఆలోచన. అంతేనా? ఆ ఆలోచనే నేను. నేనే అపసవ్యత. కనుక దీనిని నిరాకరించినప్పుడు ఆలోచనను నిరాకరించినట్లు. అపసవ్యతను గాదు. 'నేను' నిరాకరించడము గాదు. చూడండి. నేను అపసవ్యత. ఈ అపసవ్యత సృష్టించబడింది. ఆలోచన చేత. అంటే నేను ఆ వేర్పాటును తెచ్చే నేను అది యదార్థం. అప్పుడీ నిజాన్ని నిరాకరించడమంటే ఏమిటి? ఈ అపసవ్యతను నిరాకరిస్తూ ఆవల పెట్టేదెవరు? దీనిని మార్చేదెవరు? అది స్పష్టమయిందా? ఇప్పుడు అపసవ్యతను నిరాకరించడమే మౌనం.

ఏ ఆలోచనా కదలికయినా మరికొంత అపసవ్యతనే పెంచుతుంది. మీరప్పుడ డుగుతారు-ఆలోచన ఎలా అంతానికొస్తుంది? రాత్రింబవళ్ళు సాగుతూ ఉన్న ఈ నిరంతర కదలిక నెవరాపుతారు? అని.

ఆలోచనే తనను కాదనాలి. తానేమి చేస్తున్నదీ ఆలోచనే చూడగలదు. అంతేనా? కాబట్టి తానంతమవాలని గ్రహించేది ఆలోచనే తప్ప మరొకటి లేదక్కడ. కాబట్టి తానేమి చేసినా, తన కదలిక ఎలా వున్నా అది అపసవ్యమేనన్నది గ్రహించినప్పుడు మనం దాన్నొక్క ఉదాహరణంగా తీసుకుంటున్నాము. అక్కడ మౌనముంటుంది. అపసవ్యత నుండి వచ్చిన మార్పు స్వభావం మౌనం. మనసు, శరీరం అసాధారణంగా నిశ్చల మైనప్పుడు ఉన్న మౌన లక్షణాన్ని ఎప్పుడయినా చూశారో, అనుభూతి చెందారో నాకు తెలియదు. అంటే మీరేదయినా చాలా స్పష్టంగా చూడాలనుకుంటే చెప్తున్న దానిని మీహృదయం మనసు మొత్తంతో దేనినయినా వినాలనుకుంటే మీ శరీరం నిశ్చలమవు తుంది. మీ మనసూ నిశ్చలమవుతుంది. ఇదొక ఉపాయంగాదు. అదేవిధంగా అపసవ్యత, అది మారే విధంగూడా పూర్తి మౌనం ఉన్నప్పుడే పరిష్కరించబడతాయి. సవ్యతను తెచ్చేది మౌనం. ఆలోచన కాదు.

ప్రా: తనకు సుఖాన్నిచ్చే దానిని సొంతం చేసుకోవాలని మనిషి ఎప్పుడూ ప్రయత్నిస్తూ ఉంటాడా?

కృ: మనమంతా చేస్తున్నది అదేగదా? మనకు సుఖాన్నిచ్చే గోడమీద బొమ్మనో, భవనాన్నో, స్త్రీనో, పురుషుడినో సొంతం చేసుకోవాలని మనమనుకోవడంలేదా? ఇష్టమయిన ఒకింత సామాను మనకుంటే మనమే ఆ సామాను. ఆ సొంతం చేసుకోవడంలో అది పోతుందేమోనన్న బాధ ఉన్నది. అందుకే మన భర్తనో, భార్యనో, కుటుంబాన్నో పట్టుకు వేలాడతాము. కుటుంబం చుట్టూ ఒక అద్భుత వలయమల్లబడి మిగిలిన ప్రపంచమంతా పోరు తెస్తుంది. వలయం గోడ లేకుండా కుటుంబముంటుందా - అనడుగుతాడు. మీలో కుటుంబమున్న వారెవరయినా ఇది ప్రయత్నించండి. పూర్తిగా భిన్నమైనదేదో జరగడం చూస్తారు. బహుశా అప్పుడు ప్రేమంటే ఏమిటో తెలుసుకుంటారు. ఆ ప్రేమ తెచ్చే మార్పు స్వభావాన్ని మీ కళ్ళతోనే చూస్తారు.

# 3

మనం కలిసి మాట్లాడుకోవలసిన చాలావిషయాలలో మనం ఎందుకు మారమనేది ప్రధానము. ఇక్కడా, అక్కడా అతుకులు వేసినట్లుగా, కొంత భాగం మారతారే గాని మన ప్రవర్తన మొత్తం, మన జీవిత విధానము, మన రోజువారీ స్వభావము మొత్తం సమూలంగా ఎందుకు మారదు? అంతరంగంలో హెచ్చుతగ్గులుగా వందలకొద్దీ సంవత్సరాలుగా ఎలా వున్నామో అలాగే వుండగా మన చుట్టూ ఉన్న ప్రపంచం సాంకేతికంగా అసాధారణ వేగంతో ముందుకు వెళ్తున్నది. ఈ ఉచ్చులో చిక్కుకున్న మనం ఈ భయానకమయిన ఉచ్చును ఎందుకు ఛేదించుకోమా అని; ఎందుకు భారంగా, మూర్ఖంగా, శూన్యంగా, లోతులేని మనసుతో, కృత్రిమంగా, పైగా నిరుత్సాహంగా ఉంటామా అని ఆశ్చర్యంగా ఉంటుంది. ఈ ఆశ్చర్యం మన గురించి మనకు తెలియకపోవడం వలనా? వివిధ నిపుణుల భావాలను, వారి ప్రత్యేక నిశ్చిత వాక్యాలను, పిడివాదాలతో సహా పక్కనుంచి, నిజంగా మననెప్పుడూ పరిశోధించుకోలేదని నిజంగా మనమేమిటో తెలుసుకునేందుకు మనలోకి లోతుగా వెళ్ళలేదని చూస్తాము. మనం మారకపోవడానికి కారణం అదా? లేక తనకు మారే శక్తి లేకపోవడమా? లేక మనమన్నా, ప్రపంచమన్నా విసుగు పుట్టడము వలనా? మోటారు కార్లు, పెద్దపెద్ద స్నానాల గదులు వంటివి కొన్నీ తప్ప ఈ ప్రపంచం మనకి ఇచ్చేది ఏమున్నది అనుకోవడం వలనా?

కాబట్టి బాహ్యాపరంగా మనం విసిగిపోయాము. బహుశా మనమంటే గూడా విసుగే. ఎందుకంటే మనం ఉచ్చులో చిక్కుకున్నాము. అందులోనుండి బయటికెలా రావాలో తెలియదు. మనకు చాలా బద్ధకముండడముగూడా గావచ్చు. ఇంకా చెప్పాలంటే మనగురించి తెలుసుకోవడంలో లాభంగాని, చివరికొచ్చే బహుమానంగాని లేవు. మనలో చాలామందిమి ఈ లాభదృష్టికి నిబద్ధులమయాము.

ఇవి మనమెందుకు మారలేదన్న దానికి కొన్ని కారణాలుగావచ్చు. ఉచ్చు ఏదో మనకు తెలుసు. జీవితమేమిటో తెలుసు. తెలిసీ అదేవిధంగా మరణము వరకూ నిస్సత్తువగా నడుస్తూ పోతుంటాము. మన మొత్తం అలాగే కన్పిస్తున్నది. అయినా మనలోనికి బహులోతుగా వెళ్ళడము, మార్చుకోవడము, చాలా కష్టమన్పిస్తుందా? ఎప్పుడయినా తనవంక చూసుకుని తనను తెలుసుకున్నాడా? అని నాకు ఆశ్చర్యము. పురాతన కాలాన్నుండీ మళ్ళీ మళ్ళీ పునరుద్ఘాటించుతూ వచ్చింది. 'నిన్ను నీవు తెలుసుకో' అని భారతదేశంలో గూడా దీనిని మౌలిక సూత్రం చేశారు. పురాతన గ్రీకులూ తిరిగి అదే సూచించారు. నవీన తత్త్వవేత్తలుగూడా దీనినే చెప్పాలని ప్రయత్నిస్తూ వారి పరిభాషలో సిద్ధాంతాలతో కష్టతరం చేశారు.

తనను తాను చేతనా స్థాయిలోనే గాక మనసులోనిలోతు, రహస్యపొరల్లో వున్నవాటిని గూడా తెలుసుకోగలడా? స్వీయ జ్ఞానం లేకుండా నిజమైన, గంభీరమైన చర్యను దేనిని చేపట్టాలన్నా పునాది వుండదు, ఆధారముండదు. స్పష్టమైనదానిని నిర్మించాలంటే ఒక ఆధారభూతమైనది ఉండి తీరాలి, తనను తాను తెలుసుకోకపోతే అటువంటి కృత్రిమ

జీవితాన్నే జీవిస్తాము. మీరు తెలివిగలవారుగావచ్చు. ప్రపంచంలోని పుస్తకాలన్నీ తెలియడంతో వాటినుండి ఉదాహరణలను యిస్తుండవచ్చు. కాని మీ గురించి తెలియకుంటే పైపైనున్నదానిని మించి ఎలా పోగలరు? తనను సంపూర్ణంగా తెలుసుకోవడము, సంపూర్ణంగా పరిశీలించడంతో దాని నుండి విడుదలవడం సాధ్యమా? బహుశా మన మీ మధ్యాహ్నం కలిసి ఆ ప్రశ్నలోనికి వెళదాం. అలా చేయడంలో ప్రేమంటే ఏమిటో, మరణమంటే ఏమిటో గూడా రావచ్చును.

మానవులుగా మనమింకా జీవిస్తున్నప్పటికీ మరణమంటే ఏమిటో, ప్రేమంటే ఏమిటో గూడా తెలుసుకోవాలనుకుంటాను. ఎందుకంటే అది జీవితంలో, నిత్య జీవితంలో ఒక భాగం. మన గురించి ఎటువంటి భయము, పక్షపాతమూ లేకుండా ఎటువంటి సూత్రమూ, నిర్ణయమూలేకుండా మనమేమిటో తెలుసుకోడానికి విచారణ చేయగలమా? అటువంటి విచారణ స్వేచ్ఛను కోరుతుంది. స్వేచ్ఛలేకుంటే, పరికల్పనలు, సిద్ధాంతాలు, నిర్ణయాల నుండి, పక్షపాతాన్నుండి స్వేచ్ఛ లేకుంటే తనగురించో లేదా తాను భాగమయిన విశ్వాన్నిగురించో విచారణ చేయలేడు. విచారణ చేయాలంటే తనకు పదునయిన మనసు కావాలి. సున్నితంగా తయారయిన మనసు కావాలి. కాని ఏ రకమైన పక్షపాతమున్నా మనసు సున్నితంగా ఉండదు. దానితో ఈ తాననే మొత్తం ఆకృతిని గురించి నిజమైన విచారణ జరపడానికి అశక్తురాలవుతుంది. కాబట్టి మనం కలసి యీ ప్రశ్నలోనికి కేవలం మాటలతోను భావప్రసారం చేసుకుంటూనే గాక మాటలు లేకుండాగూడా వెళదాము. అది మరింత ఉత్సాహంగా ఉంటుంది. అయితే దీనికి ఎక్కువ సావధానతా శక్తి అవసరం. విచారణ చేసే స్వేచ్ఛ ఉంటే శక్తి ఉంటుంది. అప్పటికే ఒక నిర్ణయానికి, సూత్రానికి చేరిఉంటే శక్తి , చొరవ, అవసరమయిన తీవ్రత ఉండవు. కాబట్టి ఇప్పటికీ, మన గురించి ఉన్న సూత్రాలను, నిర్ణయాలను, పక్షపాతాలను ఆవలపెట్టగలమా? మనమేమిటి? ఎలా ఉండాలి? ఎలా ఉండకూడదు? ఇత్యాదివన్నీ ప్రక్కన ఉంచి యదార్థంగా పరిశీలించగలమా?

తనను తనకున్న సంబంధంలోనే పరిశీలించుకోగలడు. చూడడానికి మనకితర మార్గాలేమీ లేవు. పూర్తి నాడీరుగ్మతతో ఉన్న వారైతే తప్ప మనం ఒంటరి, ద్వీపాలలాంటి మనుషులం గాదు. కాకపోగా మనకు సంబంధించిన వాటన్నింటితోనూ సంబంధాలున్నాయి. ఆ సంబంధంలో తన ప్రతిస్పందనలను, ఆలోచనలను, ప్రేరణలను మాటలు లేకుండా పరిశీలిస్తే ఈ మనమేమిటన్నది చూడగలము.

ఇప్పుడు పరిశీలిస్తున్న పరికరమేది? పరిశీలించే వస్తువేది? దీని గురించి మనం చాలా స్పష్టంగా ఉండాలి. దుకాణపు కిటికీల దగ్గర చూసినట్లు ఇది కిటికీనుండి లోనికి చూడడమా? లేక బయటినుండి గాక లోపలనుండే మిమ్మల్ని గమనించుకోవడమా? మిమ్మల్ని బయటినుండి గమనిస్తే 'ఉన్నదానితో' సంబంధముండదు. ఇది చాలా స్పష్టంగా చూసి గ్రహించుకోవాలి. గోడపైనుండి చూస్తున్న తనని తనే పరిశీలించుకోవచ్చు. అయితే అటువంటి పరిశీలన పైపైనగా ఉండి సంబంధం లేకుండా ఉంటుంది. దానివలన

లాభంలేదు. బాధ్యతగల పనికాదు అది. తనను తానెప్పుడు విశ్లేషించుకున్నా విశ్లేషకుడు, విశ్లేషింపబడేదీ ఉంటాయి. గోడపై నుండిచూస్తూ, తీర్పునిస్తూ, అంచనావేస్తూ, నియంత్రిస్తూ, అణచివేస్తూ, ఇంకా అటువంటివి చేస్తున్నది పరిశీలకుడు. అయితే, తనను తాను అతి సన్నిహితంగా, నిజంగా తనని తాను ఉన్నట్లుగా గమనించగలడా; అంటే ఆలోచించేవాడు, పరిశీలకుడు, అనే ఒకరు బయటేవుంటూ దోషనిర్ణేతగా అంచనా వేసేస్తూ నిజంగా జరుగుతున్నదానిని ఎంపికలేని ఎరుకతో ఏ సూచనలూ అందివ్వకుండా ఏం చేయాలి, ఏం చేయకూడదు అని నిర్ణయించకుండా 'ఇది ఒప్పు, 'ఇది తప్పు' 'ఇది ఇలా ఉండాలి', 'ఇది యిలా ఉండకూడదు' అంటూ ఎవరుంటారో ఆ పరిశీలకుడు లేకుండా తనను పరిశీలించు కోగలడా? ఇదంతా పరిశీలనను పరిమితం చేస్తుంది. పరిశీలన కేవలం సామాజిక, పరిసర, సాంస్కృతిక నిబద్ధతకులోనయి మాత్రమే వుంటుంది.

కాబట్టి 'పరిశీలించేదెలా' అన్న అసలయిన సమస్య ఉన్నది. బయటి పరిశీలకునిగా తానప్పటికీ తనని గురించి కొన్ని ఖచ్చితమయిన నిర్ణయాలకు వచ్చి ఉండి పరిశీలించడం గాదు. ఊరికే పరిశీలన చేయడం. అది చేయాలంటే అక్కడ ప్రతి నిర్ణయాన్నుండీ నిబద్ధత నుండీ స్వేచ్ఛ ఉండాలి. కాబట్టి మాటల్లేకుండా పరిశీలించాలంటే లోపలికెవరు చూస్తున్నారు. ఆ బయటివాని అడ్డు లేకుండా పరిశీలించాలంటే భయాలన్నింటినుండి, సరిదిద్దుకోవడమనే భావాన్నుండి స్వేచ్ఛగావాలి, తెలుసుకోవడానికి అటువంటి పరికరముంటే ముందుకు సాగవచ్చు. కాని పరిశీలకుడు పరిశీలించే దాన్నెక్కడినుండి చూస్తారో ఆ కేంద్రాన్ని తయారుచేసే వాటన్నింటిని బహిష్కరించడంతో అక్కడ తెలుసుకునే దేముంటుంది?

నిజానికి, ఇది నీతి అని అనలేని ఆ సంప్రదాయం గౌరవనీయ సామాజికనీతి యొక్క జోక్యం లేకుండా స్పష్టమైన, మచ్చలు లేకుండా ఉన్న దృష్టితో తనను తాను చూసుకోవాలని మీరు కోరుకుంటారు. నిర్ణయాన్ని, సూత్రాన్ని, భయాన్ని మరొకలాగా అవాలనే కోరికను ప్రక్కకు తొలగించాక అక్కడ ఏముంటుంది. మనమేమిటంటే ఒకదాని తర్వాత ఒకటిగా వచ్చే ఒక నిర్ణయాల వరుస. మనమేమిటంటే సుఖం, బాధ, జ్ఞాపకాలు, గతం మీద ఆధారపడిన అనుభవాల వరుస. మనము గతం. మనలో కొత్తదేమీలేదు. అలా స్వేచ్ఛగా పరిశీలించి నప్పుడు నిజానికి తానేమిటి? స్వేచ్ఛగా ఉండాలంటే ఈ విషయాలన్నీ పక్కనుంచాలి. మీకు మీరెప్పుడయినా ఆ ప్రశ్న వేసుకున్నారా? అని అనుకుంటున్నాను. జీవించడమనే యీ మొత్తం వ్యవహారంలో తనకున్న సంబంధమేమిటి? అసలు జీవితమంటే ఏమిటి? అంతులేని పోరాటం, జీవించడమని మనం అంటున్న యుద్ధరంగం, మరొకరితోనేగాక, మనసులో ఉన్న ఘర్షణ, బాధ వచ్చిపోయే గొప్ప ఆనంద క్షణాలు. భయం, అసంతృప్తుల వరుస, తన చేతనా స్థాయిలోనే, లోలోతుల్లో ఉన్న వైరుధ్యాలు, సంబంధంలేని స్థితి, గొప్ప దుఃఖం అంటే సాధారణంగా తనపై తనకే కలిగే జాలి, ఒంటరితనం విసుగు - అదేమిటో వెంటనే చూడగలడు. అప్పుడు వీటన్నింటినుండి మత నమ్మకాలలోకి మీ దైవం, నా దైవం అంటూ పారిపోవడం

జరుగుతుంది. నిజంగా మనకున్న జీవితమది, నలభయి సంవత్సరాలపాటు ఆఫీసుకు వెళ్ళడము, జగడమాడుతూ పోటీతో, మూఢంగా ఉండడము. వీటన్నింటి గురించి ఎంతో గర్వపడుతూ ఉంటామని మీకు తెలుసు. అదీ మన జీవితం. మనం జీవించడమని దాన్నంటాము. ఇదెలా మార్చాలో తెలియదు. సామాజిక స్వరూపాన్ని, పైపైన మార్పాలని మనకెంతో కుతూహలము, పాత అధికార యంత్రాంగం స్థానంలో క్రొత్తదాన్ని నిలపడం ఏమయినా లోతయిన ఆంతరంగ విప్లవమున్నప్పుడే బాహ్యామైన మార్పుకు అర్థముంటుంది. అప్పుడు బాహ్య, అంతరంగాలలో చలనం ఒక్కటే అవుతుంది. వేర్వేరుగా రెండుగా వుండవు.

కాబట్టి ఇదంతా చూసి అందులోని ఉన్మాదాన్ని చూసి ఎందుకు మార్చడము? అసలు దీన్నంతటినీ మన జీవితాన్ని, ఉన్నదున్నట్లుగా నిజంగా చూస్తున్నామా?అని యోచిస్తున్నాను. చేస్తున్నది మాటల్లోనేనా? వర్ణన వర్ణింపబడిన విషయం గాదని, వివరణ వివరింపబడిన విషయంగాదని గ్రహించాలి. ఇదంతా తెలుసుకునీ విపరీతమయిన యీ గందరగోళాన్ని, క్లేశాన్ని, వేదనను చూస్తూ ఎందుకు దీన్ని ఆమోదిస్తున్నాము? ఎందుకు దానితోనే ఉండడము? దీనినుండి బయటపడడంకోసం మరొకరు సహాయ పడాలని ఎదురుచూస్తూ ఉంటామా? ఆచార్యులు, గురువులు, రక్షకులు-అబ్బో యిలాంటివాళ్ళు లెక్కలేనంతమంది ఉన్నారు. అయినా మనం యిక్కడే ఉండిపోయాం. అందుచేత ఇతరులపైన నమ్మకాన్ని పూర్తిగా పోగొట్టుకోవచ్చు. లేదా ఈ పాటికి పోగొట్టుకునే ఉంటారు. మీరు పోగొట్టుకున్నారని ఆశిస్తాను. అంటే, నిరాశావాదులుగానో, పరుషంగా కఠినంగా తయారు అవుతారని గాదు, కాని అంతరంగంలో మనకు ఏ ఒక్కరూ సహాయపడరన్న యదార్థాన్ని చూడడమని దీనర్థం. ఇదంతా గుర్తించి ప్రతి రోజులోనూ, మనం జీవిస్తున్న తీరులో వున్న హింసను, బాధిస్తున్న క్లేశాన్ని మొత్తం గుర్తించాక, అది అర్థం చేసుకుని బయటపడడంకోసం ఎందుకు గాఢంగా దీక్ష వహించరు? మనమిది చేయకపోతే విద్య ఎందుకు? ఇది సమూలంగా మార్చుకోకపోతే మీరు పి.హెచ్.డి. అవడము, మరేదో అవడంలో ఉండే మంచేమిటి?

తానెందులో చిక్కుకున్నాడో ఆయీ ఉచ్చులోనుండి ఈ విషవలయాన్నుండి ఛేదించుకుని బయటపడడానికి కావలసిన శక్తికున్న స్వభావేమిటి అని మనమిప్పుడు ప్రశ్నించాలి. కావలిసిన ఉత్సాహాన్నేదిస్తుంది? మాటలతో,మరొకరి నిర్దేశాలు నిర్ణయాలతో రాదన్నది స్పష్టము. ఈ శక్తి స్వభావం స్వేచ్ఛ. స్వేచ్ఛ కావాలనడము అంటే మీకు నచ్చింది చేయడం, పోకిరిగా ఎదురు తిరిగి క్రమశిక్షణా రహితంగా చేయడం యిత్యాదివి కాదు స్వేచ్ఛకి అర్థం. స్వేచ్ఛంటే క్రమశిక్షణ లేకపోవడం గాదు. అందుకు భిన్నంగా స్వేచ్ఛకి గొప్ప క్రమశిక్షణ అవసరం. 'క్రమశిక్షణ' అన్న పదం కొందరికి వికృతమయినా దీనర్థం నిజానికి 'నేర్చుకోవడము' అని దయచేసి గమనించండి. ఆంగ్లంలో ఆ పదానికి మూలార్థం నేర్చుకోవడము. కట్టుబడి ఉండడము, అనుకరించడము గాదు, నేర్చు కోవడము. ఒప్పుకోవడంగాదు. కనుగొనడము నేర్చుకోవడంతో తెలుసుకోవడము తనదయిన క్రమశిక్షణనిస్తుంది. కాబట్టి క్రమశిక్షణ అంటే నేర్చుకోవడం, నిరంతర చలనము, కేవలం

ఏదో నమూనాకు కట్టుబడి ఉండడంగాదు. తానది అర్థం చేసుకుంటే మాటల్లోగాక నిజంగా, దాని సత్యాన్ని చూసి, మీ నరాలలో అనుభూతి చెందుతుంటే అప్పుడీ భయమనే నిబద్ధతనుండి ఈ ఆందోళన, బాధించే యీ దుఃఖాలనుండి మీకు బయటపడే శక్తి వుంటుంది.

ఈ మానసిక స్వరూపం మొత్తాన్ని అర్థం చేసుకోవడంలో ప్రధానమయిన యీ రెండు ప్రశ్నలూ వున్నాయి. జీవించడమంటే ఏమిటో మనం తెలుసుకునే ప్రయత్నం చేశాము. ప్రేమంటే ఏమిటి, మరణమంటే ఏమిటి అన్నవి ఉన్నాయి. ఎందుకంటే, మన జీవితాలలో అదొక భాగం. ప్రేమంటే ఏమిటో, మరణమంటే ఏమిటో తెలుసుకోవడంలో జీవితం యొక్క పవిత్రత వున్నది. అటువంటి పవిత్రత ఇప్పుడు (ఈ క్షణం)జీవించడంలో మాత్రమే వస్తుంది. గానీ జీవించినదానిలో భవిష్యత్తులో జీవించబోయే దానిలో రాదు. వర్తమానంలో మాత్రమే బహుశా ప్రేమ, మరణం అంటే ఏమిటో తెలుసుకోగలము. ప్రేమంటే ఏమిటో మరణమంటే ఏమిటో తెలుసుకోకుండా జీవించడమంటే ఏమిటో తెలుసుకోలేము.

మనలో చాలామంది భయపడే మరణం అంటే ఏమిటి? జీవిస్తున్న మనిషి స్వస్థచిత్తంతో, హేతుబద్ధంగా ఆరోగ్యంగా మందబుద్ధిలేని మనిషి మరణమంటే ఏమిటో అర్థం చేసుకోగలడా? తానెప్పుడు ముసలివాడవుతాడో, వ్యాధిగ్రస్తుడవుతాడో తెలియక, ఏ క్షణంలో జారిపోతాడో నన్నట్లుండమని అర్థం గాదు. ఈ ప్రశ్నే మాత్రమయినా ఆసక్తిగా వున్నదా? బహుశా పెద్దతరం వారికెక్కువ వుండదు. మన సమయమెంతో గడిచి పోయింది కాబట్టి. అయితే ఈ ప్రశ్న పిన్నలకు, పెద్దలకు మధ్య వయసులవారికి, మరణిస్తున్నవారికి, అందరికీ వర్తిస్తుంది. జీవించడమంటే ఏమిటో ఈ యుద్ధరంగం, ఘర్షణ వేదన కానిదేదో తెలుసుకోవడానికి ప్రయత్నించడం అసాధారణ పవిత్రతతో ఉన్నదవుతుంది. ఆ మాటను మీరు కించపరచడానికి ప్రయత్నించమంటే ఆ మాట నుపయోగిస్తాను. అదేవిధంగా మరణమంటే ఏమిటో తెలుసుకోవడం గూడా.

ఈ ప్రశ్నకు మీ ప్రతిస్పందనేమిటీ అని నాకు ఆసక్తిగా వున్నది. మీరు భయపడి ఉండొచ్చు. మీకు సిద్ధాంతాలుండొచ్చు. నమ్మకముండొచ్చు. మరణానంతరం జీవితాన్ని నమ్మడము. ఉదాహరణకు తూర్పుదేశీయులంతా నమ్ముతున్న పునర్జన్మను నమ్మడము. వారు పునర్జన్మను నమ్ముతారు గానీ యీ జన్మలో సరిగా ప్రవర్తించరు. ఇది చాలా సౌకర్యవంతమయిన ఒక సిద్ధాంతం మాత్రమే. మీకందులో మరో అవకాశ ముంటుంది. కాని దాన్నంతా ఒక ప్రక్కనుండి, యిప్పుడున్నది అర్థం చేసుకోవాలంటే మీరు గతాన్ని అర్థంచేసుకోవాలి. "నేను వర్తమానంలో జీవించబోతున్నాను" అనలేరు. దాని కర్థం లేదు. ఇప్పుడు అన్నది భవిష్యత్తులోకి గతం పోయేదారి. 'నేను వర్తమానంలో జీవించబోతున్నానన్నప్పుడు ఎవరు జీవించబోతున్నారో ఆ మీరు గత ఫలితం. మీ చుట్టూ ఓ వలయాన్ని గీసుకుని 'ఇప్పుడు లేదా వర్తమానం అంటే యిది' అనవచ్చు. కాని ఇప్పుడు జీవిస్తున్న ఆ జీవి గత ఫలితము. అతడు పూర్తిగా గతమే. ఇప్పుడు

వర్తమానంలో జీవించడం అంటే సైద్ధాంతికంగా కాదు, ఒక నిర్ణయంతో గాదు, ఒక నిర్ధారణకు వచ్చిగాదు. కాని వర్తమానంలో సంపూర్ణంగా జీవించడమంటే నిబద్ధత లేకుండా, స్వేచ్ఛగా ఉండాలని అర్థం.

మరణించడమంటే అర్థమేమిటి? మరణమంటే ఏమిటి? అని అడగడము నరాల జబ్బు ఉన్నవారు వేస్తున్న ప్రశ్న గాదు. కాకపోగా ఆ ప్రశ్నని అడిగేవారు చాలా ఆరోగ్యంగా, స్వస్థచిత్తంతో, సమతుల్యతతో ఉన్నట్లు. లేకుంటే అటువంటి ప్రశ్న అడుగరు. అంటే అది తెలుసుకోవడానికి ఏ మాత్రం భయపడడం లేదని అర్థం. దేహం పోకతప్పదు. నిరంతరం వాడుక అరుగుదల వలన జీవి అశక్తమయిపోకా తప్పదు. విపరీతమయిన వత్తిడి, శ్రమ, ఉద్రేకం లేకుండా కొంత స్వస్థచిత్తంతో జీవించగల్గితే మరికొంతకాలమది ఉండేటట్లు చేయగలము. లేదా డాక్టర్లు, శాస్త్రవేత్తలు మరో నలభై ఏభయి సంవత్సరాలుండేందుకు ఒక మాత్రనో మరొకటో కనుక్కోవచ్చు. అయినా యీ ఉచ్చులో ఉండి మరో ఏభయి సంవత్సరాలు జీవించడంలోని ఉద్దేశమేమిటో తోచదు. మరణించడమేమిటో నిజానికి జీవించడమేమిటో గూడా అడగాలి. చిక్కులేవీ లేకుండా అలా జీవించగల్గడము-మనకు తెలిసిన జీవితాన్ని అంతం చేయడము. ఎందుకంటే, తాను మరణించినప్పుడు జరుగబోయేదదే. ప్రతిదీ అంతమవడము. హిందువులు అంటూ వుండే ఆత్మ కేవలము ఒక పదం. అక్కడ ఆత్మ అన్న శాశ్వతమయినదేదో ఉన్నట్లు మనకి తెలియదు. శాశ్వతమయినది మనలో ఏదయినా ఉన్నదా? లేక శాశ్వతమైంది ఉన్నదనుకుంటున్నామా? తనను తాను పరిశీలించుకుంటే అక్కడ శాశ్వతమైనదేదీ లేదు. ప్రతి ఒక్కటీ చలనంలోనే అస్థిరస్థితిలోనే వున్నది. తాను మరణిస్తే తన కుటుంబానికి, పిల్లలకు, ఉద్యోగానికి, తాను వ్రాయాలనుకున్న లేదా వ్రాసిన పుస్తకాలు, అనుభవాలు, తాను గుట్టలుగాచేసిన ఆర్జనలు బాధ్యతలన్నింటిపట్లా మరణముంటుంది. మానసికంగా, భౌతికంగా తెలిసినవాటన్నింటి అంతం వుంటుంది. మరణమంటే అదీ. మనలో చాలామంది దీనిని అంగీకరిస్తారనుకుంటాను.

ఇప్పుడు ప్రతిరోజూ తనకు తెలిసిన ప్రతి ఒక్కదానికి మరణించగలడా; మీ యింటికి దారేదో ఆ దిశ యిత్యాది సాంకేతిక విజ్ఞానాన్నికాకుండా, మానసికంగా ఉన్నదాన్ని ప్రతిరోజూ అంతం చేయడంతో మనసు స్వచ్ఛంగా, లేతగా, అమాయకంగా అవదూ? అది మరణము. దానికి చేరాలంటే భయపు ఛాయగూడా ఉండగూడదు. ఏ తర్కం, ప్రతిఘటన లేకుండా యిచ్చేయాలి. అదీమరణము. దీనిని మీరెప్పుడయినా ప్రయత్నించారా? గొణుగుడు, అడ్డు, ప్రతిఘటనలేకుండా మీకెంతో ఆనందాన్నిచ్చే ఒక విషయాన్ని వదిలేయడం తనకు బాధాకరంగా వున్న విషయాలను ఎట్లాగూ వదిలేయాలని అనుకుంటాము. నిజంగా పోనీయడము ప్రయత్నించండి. మీరిది చేస్తే మనసు అసాధారణ చురుకుదనంతో, సజీవమై, సున్నితంగా, స్వేచ్ఛగా, భారంలేకుండా ఉంటుంది. వృద్ధాప్యం పూర్తిగా భిన్న అర్థాన్ని పొందుతుంది. ఏదో భయపడవలసినది ఉండదు.

ప్రేమంటే ఏమిటో గూడా తెలుసుకోవాలి. గొప్ప అర్థమున్న పదాలలో అదొకటి. ప్రతి ఒక్కరూ ఆ పదం వాడుతున్నారు. అతి కపటినుండి, అతి సాధువువరకూ దాని వాడుక విస్తరించి వున్నది. అది నిజానికి ఏమిటి? ప్రేమిస్తున్న హృదయం మనసుల స్థితేమిటి? ప్రేమ సుఖమా? దయచేసి మిమ్మల్ని మీరే ప్రశ్నించుకోండి. ప్రేమంటే కోరికా? ఇది సుఖమయితే దానితోపాటే బాధ ఉంటుంది. ప్రేమతోపాటు సుఖం, బాధ ఉంటే ఇదెంతమాత్రం ప్రేమగాదు. మీరు గుర్తు తెచ్చుకోండి. సుఖం ఆలోచనతో తయారయినట్లు మనం చూశాము. మీకు కలిగిన లైంగికానుభవాన్ని గురించి ఆలోచించడము, నెమరు వేస్తూ ఊహాబింబాన్ని తయారుచేసుకోవడమూ, మళ్ళీ ఆ అనుభవసుఖాన్ని కూడా మోయడం కోసమే. ఆలోచన సుఖాన్ని కలుగచేస్తుంది. భయాన్నిగూడా పెంచుతుంది. రేపటి భయం, గత భయం, తాను చేసినదానిగురించి, తా ననుభవించిన భౌతికబాధగురించి అది తిరిగి వస్తుందేమోనని భయం. కాబట్టి ఆలోచన సుఖాన్ని, భయాన్ని బాధను పెంచుతుంది. వాటన్నింటినీ ప్రేమనాలా? అయితే మనకు తెలిసిందదే. దానినే మనం ప్రేమంటాము. నా భార్యను ప్రేమిస్తాను. ఎవరి మీద లైంగికానుభవంకోసం, నా భోజన తయారీకోసం నా కుటుంబాన్ని నడపడంకోసం ఆధారపడతానో ఆ భార్య మరొకరి వంక తిరిగి చూస్తే నాకు కోపం, ఈర్ష్య. దేనిని ప్రేమంటాను? మనిషప్పుడు మననుండి దేనినీ ఆశించని మనలను సదా వెన్నంటి వుండే ఒక దైవప్రేమను కనిపెడతారు. ఆ దైవాన్ని జేబులో ఉంచుకునీ, అసూయలలో, ఆందోళనలలో మిమ్మల్ని కాపాడడానికి అక్కడ ఉన్నాడని నమ్ముతూ, యింకా క్రూరంగా తయారవుతారు.

ఇదంతా ప్రేమంటాము. కాని అది ప్రేమా? ఏ మాత్రం కాదు. ఎందుకంటే ఆలోచన తయారు చేసింది ప్రేమగాదు. పెంచగల్గేది ప్రేమ గాదు. ప్రేమ సుఖంతో తీసుకురాబడలేదు. జగడమాడుతూ అత్యాశతో, పోటీపడే మనిషి ఎలా ప్రేమించగలడు? అదేమిటో తెలుసుకోవాలంటే నిజంగా - బౌద్ధికంగా గాదు-అతని అత్యాశో, దురాశో మరొకరిని ద్వేషించడం, ప్రేమకానిదానంతటినీ పూర్తిగా ప్రక్కకు పెట్టాలి. కాని, చూడండి మనం వీటన్నింటితో ఆడుకుని అప్పుడు ప్రేమగురించి మాట్లాడుతాము. మనం నిజానికి అంత శ్రద్ధతో ఉండము. అలా ఉండకపోవడంతో మన జీవితమిట్లా ఉంది. కనుక మరణం లేకుండా ప్రేమించడము ఉండదు. ఎందుకంటే ప్రేమ ఎప్పుడూ కొత్తదే. లైంగికత, సుఖాలవలె రోజువారీ దినచర్యకాదు. ప్రపంచమంతటా మనలో చాలా మందికి లైంగికత ఒక అసాధారణ సమస్య. యిది ఎందుకిలా ఉందని మీకాశ్చర్యంగా లేదా? మొదటిసారి అప్పుడే తెలుసుకున్నట్లు ప్రతి పత్రికలో రాస్తుంటారు. దాని సంబంధంగా మిగిలినవన్నీ. ఇది పట్టి విడువకుండా కొనసాగుతున్న సమస్యెందుకయింది? దానితో ప్రేమనే పదమెలా ముడిపడింది? బహుశా తెలివైన వారు ఈ ఒక్క విషయం పట్ల మనిషెందుకింత ఉద్రేకపడతాడో రకరకాలుగా వివరిస్తారు. నిపుణులను, మేధావులను ఆ రకమైన గురువులనూ అందరినీ వదిలేయండి. ఇందులో మీరెందుకు చిక్కుకుపోయిందీ మీరు చూడగలరా?

ఈ ప్రశ్నకు సమాధానం మీరే యివ్వాలి. దీనినో ప్రక్కకు తోసివేయలేరు. ఎందుకంటే యిది మన జీవితంలో ఒక భాగం. ఒక్క భాగమయిన యిదే జీవితమయి పోయి ఎటువంటి యుద్ధంగా, వేదనగా తయారయిందో, లైంగికత ఎందుకు సమస్యయిందో? చూస్తే మనిషి స్వేచ్ఛగా ఉండేది ఈ ఒక్కదానిలోనే ఎందుకు అనేది మనం ప్రశ్నించాలా? అందులో అతడు పూర్తిగా తనను తాను కోల్పోతాడు. ఆ క్షణంలో అతడికున్న అన్ని వేదనలు, స్మృతులు, హింసించడాలు, పోటీలు, జగడము, హింస, యుద్ధము ఏవీ వుండవు. అతడసలు లేడక్కడ. కాబట్టి అతడంటూ లేకపోవడంతో లైంగికత ప్రధానమయిపోయింది. అప్పుడక్కడ 'నా', 'మీ' 'మా' 'వారి' మధ్య విభజన వుండదు. అటువంటి విభజన అంతమవుతుంది. బహుశా ఆ క్షణంలో మీకు గొప్ప స్వేచ్ఛ తెలుస్తుంది. బహుశా అటువంటి స్వేచ్ఛను పొందగలిగేది మిగిలిన మీ ఒక్క దానిలోనే గాబట్టి అంతటి ప్రాధాన్యత పొంది వుండవచ్చు. యితరంగా మరెందులోనూ, మనసుకు స్వేచ్ఛ కన్పించదు. బౌద్ధికంగా, ఉద్వేగపరంగా, భౌతికంగా మనం సాంకేతిక సమాజంలో మూసపోయబడి, అవరోధ ప్రతిబంధాలతోనున్న నకలు మనుషులము కాబట్టి లైంగికంగా తప్ప దేనిలోనూ స్వేచ్ఛ లేకపోవడంతో లైంగికత ప్రధానమయి పోయింది. దానితో సమస్యయింది. లైంగికత లేకుండా ఉండమనడం లేదు. అది అసంబద్ధము. బానిసగా నిజంగా ముఖ్యమవని విషయాలను చెప్పగా వల్లెవేస్తున్న నకలు మనుషులమవకుండా ఉండగలమా? నిరంతరం సైద్ధాంతిక ప్రపంచంలో సూత్రాలతో జీవిస్తూ దానితో అసలు జీవించకుండా ఉంటున్నామా? చుట్టూ ఉన్న వాటన్నిటినుండి స్వేచ్ఛగా ఉన్నప్పుడు, బుద్ధి, హృదయాలు రెంటిలో తాను స్వేచ్ఛగా ఉన్నప్పుడు ఈ సమస్యంత తీవ్రంగా ఉండబోదు.

ఇదంతా ఆదినుండి పరిశీలిస్తూ, మనమేమాత్రం మారమని గుర్తిస్తూ, మారడానికి కావలసిన శక్తి మనకెందుకు లేదా అని ప్రశ్నించుకోవాలి. చంద్రమండలానికి వెళ్ళే అమిత అసాధారణ శక్తి మనకున్నా మననది మార్చడానికి సరిపోనట్లు కన్పిస్తున్నది. అయినా ఇది చేయడం అన్నిటికంటే సులభమయిన వాటిలో ఒకటని, ఎలా చూడాలో తెలిస్తే సులభ మవుతుందని నేను హామీ యిస్తున్నాను. ఉన్నదానిని మార్చడానికి, అణచడానికి, దాటడానికి దానిని దాటి పారిపోవడానికి ప్రయత్నించకుండా మీరు యదార్థంగా చూడగల్గినప్పుడే 'ఉన్నది' మార్పుకు లోనవడము చూస్తారు. అంటే మనసు పరిశీలనలో, పూర్తి మౌనంలో ఉంటే అప్పుడక్కడ సమూల మార్పు సంభవిస్తుంది. ఇదంతా పరిశీలించడము తనలో లోతుగా దీనిని పరిశీలించడము మనకు మరో ప్రశ్నను తెస్తుంది. అదేమంటే ధ్యానమంటే ఏమిటి? అనేది.

ఎందుకంటే ధ్యానించని మనసు మన జీవిత స్వరూపం మొత్తాన్ని, ఆ గొలుసును, అర్థం చేసుకోలేదు. బహుశా రేపు ధార్మికమయిన మానసిక స్థితిని, ఏదో ఒక మూర్ఖ సంస్థకు చెందకుండా స్వేచ్ఛగా ఉండడము ద్వారా ధార్మికమయినదానిని, ధ్యాన చర్యలోనున్న మానసికస్థితిని చర్చించుకుందాము. అంటే మిమ్మల్ని రేపు రమ్మని ఆహ్వానించడం గాదు (నవ్వులు).

ఎవరయినా అడగాలనుకుంటే ఇప్పుడు కొన్ని ప్రశ్నలు చూద్దాం.

ప్రా: మనలో ప్రతి ఒక్కరికీ 'నేను' అనే నిర్మాణ స్వరూపం ఎందుకు ఉంటుంది? దానికి మూలమేది?

కృ: వేరుగా 'నేను' అనేది ఎందుకున్నదని ఒకరు అడుగుతున్నారు. మిగిలినవారి నుండి ఎంతో వేరుగా వున్నాననుకుంటున్న ఈ ప్రత్యేక ఉనికి అక్కడెందుకుండాలి? తన సమస్యలన్నింటితో ఉన్న మీ నేను, మీ సమస్యలన్నింటిలో ఉన్న మీరు అది గూడా 'నా' అన్నదే అక్కడెందుకుండాలి? 'నా' అన్నది 'మీ' అన్నదానికి భిన్నంగాలేదు. ఎందుకంటే 'మీ' అన్నదానికుండే సమస్యలూ యివే. తేడా ఒక్కటే. భిన్నమైన పద్ధతులనుపయోగించి వాటిని మాటలతో కప్పుతారు. వ్యక్తీకరిస్తారు. అయితే అదింకా తనను భిన్నంగా వ్యక్తం చేసుకుంటున్న 'నా' అన్నదే. నేను భారతదేశంలో పుట్టి, విదేశాలలో చదివి, మీరిక్కడ పుట్టి, చదివి మీ సమస్యలతో మీరుంటే నాకూ సమస్యలుంటే మీకూ నాకూ మధ్య తేడా ఏమున్నది? భౌతికంగా కానేకాదు. మీ బ్యాంకు ఖాతా పెద్దది కావచ్చు, పెద్దయిల్లు, అందమయిన కారు ఉండొచ్చు. మిగిలినవారి కంటే మీకు పుష్కలంగా ఉండొచ్చు. అయితే మెరుగయిన పైపై చదువు, దానిని వ్యక్తం చేసుకునే అవకాశము మెరుగైన ఉద్యోగము - అలాంటివి తప్ప మరో మౌలిక భేదమేదయినా ఉన్నదా? ఆ భేద మక్కడ లేకపోతే దాని గురించి 'మీ', 'నా' వారు - నేను మనము - వారు నలుపు - తెలుపు, పసుపుపచ్చ - మట్టిరంగు అంటూ వాటిగురించి యింత రగడెందుకు? నేను వేరుగా ఉండడంలో ఎంతోఆనందమున్నది. ప్రప్రథమము, ప్రత్యేకము, అద్భుతము అనుకునే నిరుపయోగ మయిన అహంకారమంతా ఉన్నది. మీరూ అచ్చంగా అదే చెప్తారు. మీరు ఇంకొంచెం మంద్రస్థాయిలో వ్యక్తంచేస్తారేమో. ప్రతిఒక్కరిలోనూ అసాధారణమైన వాడిని అని ప్రత్యేకమయినవాడిని అని ఉండే యీ అహంభావం గొప్ప సుఖాన్నీ, సంతోషాన్నీ ఇస్తుంది.

మనం విలక్షణంగా ఉంటామా? మీకు దుఃఖమున్నది. మరొకరికీ వున్నది. మరొకరు వున్నట్టే మీరూ గందరగోళంలో, అస్పష్టంగా, ఆందోళనగా, దుడుకుగా, క్రూరంగా, అనుమానిస్తూ, దోషభావంతో ఉన్నారు. కాబట్టి మనం, నేను, మీరు మనము-వారు అనే యీ మౌలిక విభజననుండి విడుదల చేసుకుంటే అసలప్పుడు విభజన అనే ~ుంటుందా? అప్పుడు పరిశీలకుడు, పరిశీలింపబడేది మీరే గాదా? అందులో ఎంతో ~ు ఉంటుంది. ఎప్పుడు నా చుట్టూ నేనొక గోడను, మీచుట్టూ మీరొక గోడను కట్టుకుని ~ఘటనకు దారితీస్తామో అప్పుడు వేదనంతా ఆరంభమవుతుంది. సామాజిక స్వరూపం ~ాడా, 'నా' 'మీ'లను ప్రోత్సహిస్తున్నది. మన ఆలోచనల్లో మన సమాజంలో ఉన్న అహంభావాన్నీ, పెంచి పోషించిన ఈ విభజన నుండీ మనం విముక్తి పొందలేమా? అప్పుడు మీరంత దూరం వెళితే బహుశా ప్రేమంటే ఏమిటో తెలుసుకోవచ్చు.

ప్రా: తాను ఎరుకతో ఉండాలని ప్రయత్నిస్తున్నప్పుడు ఆ ప్రయత్నం కొన్నిసార్లు అడ్డుపడడం గురించి కొంత చెప్తారా?

కృ: ప్రయత్నమంటే ఏమిటి? మనం ఎందుకు ప్రయత్నం చేయాలి? అది ఆమోద యోగ్యమయిన సంప్రదాయ మని తెలుసు. మీరు తప్పక ప్రయత్నించాలని చేయకుంటే మీరేమీ కాదని అంటారు. మీరేమిటో దేవుడికే తెలియాలి. కాబట్టి అన్ని రకాలుగా ప్రయత్నంచేయడం మన నిబద్ధత, సంప్రదాయము, ఆమోదించిన ప్రమాణము, ఇప్పుడు ప్రయత్నమంటే ఏమిటండీ? మనమెందుకు ప్రయత్నం చేయాలని? ఇది చాలా ముఖ్యమైన ప్రశ్న. వైరుధ్యమే లేకపోతే ప్రయత్నముంటుందా? దయచేసి దీనిని గ్రహించండి. 'నేనే' 'మీర'యినప్పుడు అందుకు నిజంగా అత్యంత లోతయిన అనుభూతి అవగాహన కావాలి. 'నా' యే 'నీ' అని ఊరికే చెప్పలేదు. ఎందుకంటే ఆ ప్రకటనలో అర్థముండదు. మీరు సంబంధంలో ఒక్కటే అయితే, వైరుధ్యం లేకపోతే ప్రయత్నముండవలసిన అవసర మేమున్నది? అక్కడ ప్రయత్నమే లేదు. మానసిక వైరుధ్యమున్నప్పుడే ప్రయత్న ముంటుంది. అంటే ఉన్నదేదో అన్నదానికి 'ఏది ఉండాలో'నన్నది విరుద్ధంగా ఉంటుంది. ఆ వ్యతిరేకతే వైరుధ్యము. ఉన్నది ఉండవలసినది గావడానికి ప్రయత్నిస్తుంది. హింస అహింసవడానికి ప్రయత్నిస్తుంది. ఇందులో వైరుధ్యం, దానితో ప్రయత్నము అంటే ఏదిలేదో అదిగావడానికి చేసే ప్రయత్నం ఉంటుంది. కాబట్టి మౌలికంగా ప్రయత్నమంటే వైరుధ్యమని అర్థం. నేను యిదిగాక అదవుతాను. నేను విఫలమయాను. కాని విజయం సాధిస్తానని ఒట్టు పెట్టుకుంటున్నాను. నేను కోపంగా వున్నాను. కాని కోపంగా ఉండడమాపేస్తాను. యిత్యాదివి వ్యతిరేకమయిన విషయ పరంపరలు, దానితో ఘర్షణ.

మనసు పరంగా మాట్లాడితే అక్కడ వ్యతిరేకమయింది ఉన్నదా? లేక ఉన్నదేదో అది మాత్రమే వుంటుందా? ఎందుకంటే ఉన్నదానిలో ఎలా వ్యవహరించాలో మనసుకు తెలియక, వ్యతిరేకమయినది అంటే, 'ఏది ఉండాలోనన్న దానిని తెలుసుకుంటుంది' 'ఉన్నదానితో' ఎలా మెలగాలో తెలుసుంటే ఘర్షణ ఉండదు. పరిపూర్ణుడు ఉన్నతుడు అయిన నాయకునితో పోల్చి అంచనా వేసుకోవడం మనసు ఆపేయగల్గితే అప్పుడు పోలిక, వ్యతిరేకత లేకుండా ఉన్నదున్నట్లు ఉండగలదు. విముక్తమవడంతో ఉన్నది ఏదో అది పూర్తి భిన్నంగా ఉంటుంది. అందులో ప్రయత్నమన్నది ఎంతమాత్రం లేదు. ప్రయత్నమంటే వక్రత. ప్రయత్నం సంకల్పంలో భాగం. అది వక్రీకరిస్తుంది. కాని మనకు సంకల్పము, ప్రయత్నము రొట్టె, వెన్నవంటి ముఖ్య ఆహారం. మనం వాటితోనే పెంచబడ్డాము - పరీక్షలు ఆ పిల్లవానికంటే నీవు గొప్పగా ఉండాలి ఇత్యాదివి. అలా పెంచబడడంతో గొప్ప ఆపదా, వేదనా ఉంటాయి. కాబట్టి, ఉన్నదేదో చూడడానికి, దాని గురించి ఎటువంటి ఎంపికాలేని ఎరుకతో ఉండడము, వైరుధ్యాలనుండి వ్యతిరిక్తముల నుండి మనసును విడుదల చేస్తుంది.

ప్రా: కుటుంబం చుట్టూ వున్న వలయాన్ని వదిలించుకోగల్గితే అసాధారణమయింది జరుగుతుందన్నారు నిన్న. నేనది అర్థం చేసుకోవాలనుకుంటున్నాను.

ప్రా: ముందుగా తనచుట్టూ ఒక గోడ వున్నదన్న ఎరుక ఉన్నదా? మాటల్లో గాదు. మనలో ప్రతి ఒక్కరిచుట్టూ ఒక గోడ వున్నది. ప్రతిఘటనా, భయము, ఆందోళన అనే

గోడ వున్నది. 'నా చుట్టూ కట్టుకున్న 'నేను' గోడ అయింది. ఈ నేను కుటుంబము. దానిలో ప్రతిసభ్యుడిచుట్టూ ఆవరించిన సొంతగోడ వున్నది. అప్పుడు మొత్తం కుటుంబం చుట్టూ, అదే విధంగా వర్గంచుట్టూ, సమాజంచుట్టూ గూడా గోడ వున్నది. తనకిది తెలుసా? ఈ ప్రపంచంలో అలా బ్రతకడమవసరమని, లేకుంటే 'నా' అన్నది నశిస్తుందని, అలాగే కుటుంబమూ నశిస్తుందని మనమనుకోమా? కాబట్టి ఆ గోడ చాలా పవిత్ర మయిందన్నట్లు నిర్వహిస్తాము. తనకిది తెలిస్తే ఏమవుతుంది? తనచుట్టూ, తన కుటుంబంచుట్టూ ఈ గోడను తీసేస్తే కుటుంబం అంతమవుతుందా? నాకు, కుటుంబానికి మిగిలిన ప్రపంచానికి మధ్య ఉండే పోటీ ఏమవుతుంది? గోడ అంటే ఏమి జరుగుతుందో మనకు బాగా తెలుసు. అప్పుడు ప్రతిఘటన, ఘర్షణ, అంతులేని యుద్ధం, బాధ వుంటాయి. ఎందుకంటే వేరు చేసే ఉద్యమం ఏదయినా, స్వకేంద్రంగా వున్న కార్యమేదయినా, ఘర్షణను, బాధను పెంపొందిస్తుంది. ఈ వృత్తంయొక్క గోడయొక్క సంపూర్ణ స్వభావాన్ని, స్వరూపాన్ని తెలుసుకుంటే అదెలా వచ్చిందో అర్థం చేసుకుంటే – అంటే విషయం మొత్తాన్ని గ్రహిస్తే ఏమవుతుంది? 'నా' 'మీ'లకు మనము - వారులకు మధ్య విభజనను తీసివేసినప్పుడు ఏమవుతుంది? ఇప్పుడే. ముందెన్నడో గాదు. బహుశా ప్రేమన్న పదాన్ని ఉపయోగించగలుగుతారు. వలయం లేదా గోడతో కూడిన 'నా' అన్నది లేనప్పుడు ఎంతో అసాధారణమయిన ప్రేమ కలుగుతుంది.

ప్రా: నన్ను నేను పరిశీలించుకునేందుకు ప్రయత్నించినప్పుడు నన్ను అంటే ఉన్నదానిని వెలుపలినుండి గమనిస్తున్నట్లు అనిపిస్తున్నది?

కృ: ఒక మేఘాన్నెప్పుడయినా పరిశీలించారా? దానిని గమనించిఉంటే అప్పుడక్కడ దానినుండి భౌతికంగా దూరం, కాలం వేర్పాటు ఉండడమే గాకుండా అంతరంగంలో ఒక విభజన ఉండడం కనిపిస్తుంది. మిగిలిన విషయాలలో మీ మనసు ఆక్రమింపబడి ఉండడంతో దానిపట్ల నిజమైన అవధానతతో ఉండరని చెప్పాలి. తాను ఉపయోగించే 'ఎంత అందం', 'ఎంత మనోహరం' వంటి మాటలన్నీ మీకు తెలుసు. అయితే, యీ మాటలతోచేసే ప్రకటనలన్నీ అవరోధాలుగా పనిచేసి నిజంగా మేఘాలవంక చూడ నీయకుండా అడ్డుకుంటాయి. అంతేనా? ఆ మేఘం వంక ఒక్క మాట గూడా లేకుండా అంటే ఒక్క ఊహారూపం కూడా లేకుండా చూడగలరా? మేఘం అక్కడ నిర్దిష్టంగా ఉండే వస్తువు గాబట్టి బహుశా తానది సులభంగా చూడగలడేమో, కాని తనవంక తాను మాటలేకుండా చూడగలడా? దీనర్థం విమర్శ, తీర్పు, ఖండన వంటి అవరోధాలను తొలగించి ఊరక చూడడము. ఖండన, నిర్ణయం మిగిలినవేవీ లేకుండా మనసు స్వేచ్ఛగా ఉన్నప్పుడు, మీకు పరిశీలిస్తున్నదానికి మధ్యదూరం కన్పించకుండా పోతుంది. మీరప్పుడు గోడమీదుగా చూడడంలేదు. మీరే ఆ గోడ. మీరే అదయినప్పుడు అక్కడొక కష్టమొస్తుంది. అంతకు ముందు దానిని మీ నుండి వేరుగా చూశారు. ఇప్పుడేమో ఈ వేర్పాటు లేకుండా చూస్తున్నారు. దాని సంబంధంగా మీరు చేసే కదలికేదయినా అదింకా బయటినుండి జరుగుతున్న కదలికే. దానివంక ఎటువంటి కదలికా లేకుండా చూస్తే అంటే పూర్తి మౌనంతో చూస్తే అప్పుడు మౌనంలో నుండి చూసింది గోడపైనుండి చూసినదానిలాగా ఉండదు.

ప్రా: (వినిపించలేదు)

కృ: ఓ పేదవాడు రోజుకు పదిగంటలు కష్టపడడానికి నిబద్ధుడవుతాడన్నది స్పష్టము. కొంత మారవచ్చునేమో గాని అక్కడ అంతరంగ విప్లవముండదు. సమాజంలో నివసిస్తుండడంతో దాని ముద్ర ఉంటుంది. కనుక యిప్పుడతడేమి చేస్తాడు? మీ ప్రశ్న అదేనాండీ?

ప్రా: ఆ మనిషితో ఉన్న సంబంధంలో నేనేమి చేయాలి?

కృ: ఆ మనిషితో మీకున్న సంబంధమేమిటని అడుగుతున్నారు. దానినింకొకలా చెప్పనా? మీకు నాకు మధ్య ఉండే సంబంధమేమిటి? నేను మాట్లాడాను గదా? ఇంతకు ముందు నా జీవితంలో నేనెక్కువ భాగం చేసింది అదే. ఎల్లుండి నేను వెళ్ళిపోతాను. ఇప్పుడు మన సంబంధమేమిటి? మనకేదయినా సంబంధమున్నదా? మీ వక్తగురించి తప్పక ఒక ఊహారూపముండి ఉంటుంది. అతడేమి చెప్పాడు. ఏమి చెప్పలేదు. మీరది ఆమోదించారు - లేదు - యిత్యాదివి. అక్కడ సంబంధమేమయినా ఉన్నదా? సజీవమై, అప్రమత్తమై, చురుకుగా, అంతరంగంలోని వెలుగులో వున్న ఒక మనిషికీ, దయచేసి నన్ను ఒంటరిగా వదలండి. బాబోయ్, ఒక సామాజిక ఉచ్చులో చిక్కుకున్నాను. మారలేను! అనే మనిషికి మధ్య నిజమయిన సంబంధముంటుందా? అటువంటి మనిషితో సంబంధం వాత్సల్యంతోనో, దయతోనో ఉండవచ్చుగానీ అతనిని వుద్ధరిస్తున్నానని మాత్రం గాదు. తాను సజీవమై, అంతరంగంలోనూ, బాహ్యంగానూ జరుగుతున్న యీవిషయాలన్నింటిపట్ల ఎరుకతో ఉంటే తనకు తాను మార్చుకుంటాడు. సమాజ, ప్రపంచ స్వరూపాన్ని మార్చేది ఎప్పుడూ ప్రజ్ఞావంతమయిన కొద్దిమందే. బహుశా అప్పుడే మరొకరికి కూడా అవకాశం కలగవచ్చు.

ప్రా: మీరు మాట్లాడిన ఈ అంతరంగ మానసిక విప్లవం నాలో జరుగలేదు. మా స్నేహితులెవరిలోనూ జరగలేదు. చరిత్రలో నేను చూసినంత వరకు చాలామందిలో జరుగలేదు. ఉన్నదేదో చూసినప్పుడు ఇదింకా సంభవించలేదు. అయినా అది జరుగగలదన్న ఆశను నిలుపుతున్నారు. ఈ మీ ఆశ 'ఉన్నదానికి' విరుద్ధంగా ఉన్నట్లు కన్పిస్తున్నది.

కృ: నేనెవరికీ ఏ ఆశలూ కల్పించడం లేదని ఆశిస్తున్నాను(నవ్వులు). అతి భయంకర విషయమది. మీరు నానుండిగానీ మరొకరినుండిగానీ ఏదో ఆశిస్తూ ఎదురు చూస్తుంటే అప్పుడక్కడ నిజంగా ఉన్న నిస్పృహను తప్పించుకోవడానికే.'దయచేసి దీనిని గ్రహించాలి. నిజంగా ఉన్న ఆ నిస్పృహ వంక చూడగలరా? ఆశను చూడడంగాదు. ఎందుకంటే, ఆశ కేవలం కల్పితమైనది. వాస్తవంలో ఉన్న నిస్పృహ వంక, చూడగలరా? నిజంగా ఆశ వంక కాదు - అది కేవలం ఒక ఊహ. మీరు కోరుకుంటున్న-నిజంగా భయాన్ని, నిస్పృహను చూడగలరా? దీనిని ఏ ఆశా, ఖండన లేకుండా చూడగలరా? ఉన్నదానిని ఉన్నట్లు చూడగలరా? నిజంగా చూసి, దీనితో సూటిగా సంబంధంలోకి రాగలరా? అంటే దీని వంక మాటలు లేకుండా, ఏ భయమూ లేకుండా ఏటువంటి వక్రీకరణ చేయకుండా

చూడడమని అర్థం. మీరిది చేయగలరా? ఉన్నదేదో సంపూర్ణంగా, ఎటువంటి వక్రీకరణ చేయకుండా చూడగల్గితే విషయం మొత్తం అపరిమితమయిన మార్పుకు లోనవడం చూస్తారు. ఇక అదెంత మాత్రం నిస్పృహగా ఉండదు. అది పూర్తిగా భిన్నంగా వుంటుంది. అయితే దురదృష్టవశాత్తూ మనలో చాలామంది నిబద్ధులు. మనమెప్పుడూ ఆశయంకోసం ఆశపడతాము. అదొక పలాయనము. అన్ని పలాయనాలను, ఆశలను కఠినత్వంతోనో లేదా నిరాశావాదంతోనో గాక అక్కడున్నది యీ భయం, నిస్పృహలు అని మాత్రమే గ్రహిస్తే అప్పుడు చూడడంలో స్వేచ్ఛ ఉంటుంది. మనసు స్వేచ్ఛగా ఉంటే నిస్పృహ ఉంటుందా?

ప్రా: లైంగికత ఎప్పుడూ ఒక పలాయనమేనా?

కృ: నాకు తెలియదు (నవ్వులు). మీకది పలాయనమేనా? చూడండి, అది అంతే. మీ రోజువారీ వేదన నుండి ప్రయత్నాన్నుండి, వైరుధ్యాలనుండి స్వేచ్ఛగా ఉండగలిగే విషయమదొక్కటే. అయితే పారిపోవడానికి ఇదొక ద్వారమవుతుంది. అలా పారిపోవడం కోసం చేస్తే ఆ పలాయనమే భయాన్ని పెంచుతుంది. అది పలాయనమే అని తెలిస్తే అప్పుడంతా మారిపోతుంది.

## 4

ఇది మన చివరి ప్రసంగం. ఇంతకుముందు సూచించినట్లు ధ్యానం గురించే యింకా మాట్లాడుకుందా మనుకుంటున్నారా?

**శ్రోతలు:** అవును.

కృ: దీనిలోకి వెళ్ళకముందే గాఢానుభూతి సౌందర్యం అన్న ప్రశ్నల గురించి మనం యోచించాలి. ఆంగ్లంలో గాఢానుభూతి అన్న పదం బాధపడడమని అర్థమున్న పదాన్నుండి గ్రహింపబడింది. కాని మనం దుఃఖానికి, మోహానికి, భిన్న భావంలో ఆ పదాన్ని వాడుతున్నాము. గాఢానుభూతి లేకుండా మనిషి చేయగలిగింది తక్కువ. ధ్యానమనే క్లిష్టమైన ప్రశ్నలోనికి వెళ్ళడానికి గాఢానుభూతి అవసరము. మనం అనుకునే అర్థం – బహుశా దానికి భిన్నమైన ప్రాధాన్యత నిస్తూ ఉండొచ్చు. 'నా' మీ 'మన' 'వారి' అన్నవి మొత్తం త్యజించినప్పుడు మనం అనుకుంటున్న భావంలో గాఢానుభూతి కలుగుతుంది. త్యజించి వేయడంలో ఒక లోతైన నిరాడంబరత ఉంటుంది. దానర్థం మతాచార్యులకుండే నిరాడంబరత లేక సన్యాసికుండే నిరాడంబరతో గాదు. నియంత్రణవల్ల, అణచి వేయడంవల్ల వారి నిరాడంబరత కఠినమైపోయి ఒక దిశగా కొనసాగుతూ ఉంటుంది. కఠినతలేని నిరాడంబరతలోనుండి వచ్చిన గాఢానుభూతి గురించి మనం మాట్లాడుకుంటున్నాము. నిరాడంబరమయిన మనసు నిజానికి అందమైన మనసు. అందం మళ్ళీ మరో జటిల ప్రశ్న. అది మన జీవితాల్లో ఉండేదే బహు తక్కువ. మేమిక్కడ చుట్టూ అద్భుతంగా, చిరకాలంగా ఉన్న చెట్లతో, నీలి ఆకాశంతోఅందమైన సూర్యాస్తమయాలతో ఉన్న వనంలోని ఒక అందమైన భవనంలో ఉంటున్నాము, కాని

అందం అనుభవసారం గాదు. మనిషి కల్పించిన వస్తువులో వుండదు. అందాన్ని ప్రత్యక్షంగా గ్రహించాలంటే మనసు మౌనంలో ఉండడమేగాక అందులో ఎంతో విశాలమైన స్థలం గూడా వుండాలి. ఇదంతా అసంబద్ధ మన్పించదని ఆశిస్తాను. కాని, మనం వెళ్తున్న కొద్దీ ప్రజ్ఞావంతమవుతుందనుకుంటాను.

మనలోనున్న స్థలం చాలా తక్కువ. మన మనసులు పరిమితంగా, యిరుగ్గా లోతు లేకుండా, మన గురించే ఆలోచిస్తూ వివిధ రకాల సామాజిక, వ్యక్తిగత, ఆదర్శపూరిత కార్యకలాపాల కంకితమయి ఉంటాయి. పరిశీలకునికి, పరిశీలింపబడే దానికి మధ్య కొంత స్థలం ఉంటుంది. అంతేకాకుండా నా అన్న దానితో ఏర్పడిన ప్రతిఘటన అనే గోడచుట్టూరా గోడలోపల కొంత స్థలముంటుంది. ఇదికాక కేంద్రంతోగాని లేక ప్రతిఘటన అనే గోడతోగాని బంధింపబడని మరొక స్థలం గూడా ఉన్నది. ధ్యానాన్ని అర్థం చేసుకోవాలంటే సౌందర్యం గాఢానుభూతులతో పాటు ఆ స్థలం గావాలి. మీరు ఇష్టపడితే అందులోకి వెళ్దాము.

పాశ్చాత్యులకు ప్రగాఢమయిన పరిశీలన అనే పదమున్నది. కాని పాశ్చాత్యులు దీనినర్థంచేసుకున్న తీరులో యిది ధ్యానము ఒకటే అన్పించదు. ముందు ధ్యానమన్న పదాన్ని సాధారణంగా అర్థం చేసుకుంటున్న విధానాన్ని అంటే ధ్యానం చేస్తే ఒక గొప్ప ఫలితము, ఒక గొప్ప అనుభవము పొందుతారన్న విషయం వదిలేయాలి. ఆ భావానికున్న సత్యాసత్యాలను మనమా తర్వాత పరీక్షించవచ్చు. ధ్యానానికి లోతుగా విచారించడము, ఆలోచించడము, తర్కించడము, లోతయిన భావంలో పరీక్షించడము, పూర్తిగా అర్థం చేసుకొని దేనిలోకో తన మార్గాన్ని అనుభూతి చెందడము. మార్మికంగా రహస్య మూలాలతో వెల్లడింపబడకుండా ఉన్న తన మనసులోనికి లోతైన అనుభూతులలోకి వెళ్ళడం అని అర్థం. నిజమైన అర్థంలో ధ్యానానికి ఒక ప్రత్యేక సౌందర్యమున్నది. దీని పూర్తి అర్థం తెలుసుకోవడం జీవితంలోని అసాధారణ విషయంలో ఒకటని కూడా చెప్పు కుంటున్నాము. అటువంటి ధ్యానం అనుభవాలకు అతీతంగా వుంటుంది. ఇది మార్మికమయిన కాల్పనికమయిన హృదయ దౌర్బల్యానికి చెందిన సన్నివేశం గాదు. ధ్యానానికి సత్ప్రవర్తన, సౌశీల్యత, సక్రమతఅనే బ్రహ్మాండమయిన పునాది అవసరము. అనుభవమనే ప్రశ్నను గూడ పూర్తిగా అర్థం చేసుకోవాలి. దానిలోనికి కేవలం మాటలతో గాక, మాటలు అందించలేని దానిలోనికి కూడాపోయి అనుభూతి చెందాలి. ఇది ఆలోచన చేత ప్రవేశపెట్టబడిన ఏ దర్శనమో, మార్మికస్థితో గాదు. సత్ప్రవర్తనమనే పునాదిని వేసినప్పుడు సహజంగా, సులభంగా వచ్చేది. ఆ పునాదిలేకుండా ధ్యానం కేవలమొక పలాయనము. ఒక పగటికల. అద్భుత దృశ్యాలకూ, అనుభవాలకూ ఒక సాధనామార్గంగా తీసుకుని సంతోషిస్తుంటాము.

కాబట్టి ఈ ధ్యానమనే ప్రశ్నలోనికి మనం వెళ్ళబోతున్నాము. మనం వెళ్ళి తీరాలి. ఎందుకంటే యిది ప్రేమ, మరణము, జీవించడము అంతటి ప్రధానమయినది. బహుశా యింకా ఎక్కువేమో! ఎందుకంటే, ధ్యానించే ఆ మనసునుండే సత్యమేదో

అవగాహనలోని కొస్తుంది. తూర్పుదేశానగాని యీ మధ్యనే యిక్కడ, యీ దేశంలో పరిచయమయిన విధానం గురించి, సాధారణంగా ధ్యానం అంటున్నదాని సత్యాసత్యాల గురించి మనం బహుస్పష్టంగా ఉండాలని భావిస్తున్నాను. తూర్పుదేశంలో ధ్యానమంటే ఆలోచనను నియంత్రించడము, అటువంటి నియంత్రణ కోసం ఒక ప్రత్యేక పద్ధతిమీదో లేదా విధానం మీదో ఆధారపడడ ముంటుందో ఆ సాధన అని అర్థం చేసుకున్నారు. భారతదేశంలో బౌద్ధుల ప్రపంచంలో, జెన్‌తో సహా యీ విధానాలెన్నో వున్నాయి. విధానాలు, పద్ధతులు ప్రవేశపెట్టి, వాటి సాధనద్వారా నిజం గోచరమయ్యే మౌనస్థితి వస్తుందన్నారు. ఇదీ రకరకాల ధ్యాన పద్ధతులన్నప్పుడు సాధారణంగా అర్థం చేసుకున్నది.

దీనంతటిలో మీకు అభిరుచి ఉన్నదా? నేననుకోను. ఎందుకంటే ఇందులో నిజానికి నాకే అభిరుచీ లేదు(నవ్వులు).

స్వాములు, యోగులు, మహర్షులు, మిగిలిన అందరిచేత కనుగొనబడిన విధానాలెన్నో ఉన్నాయి. పదాల వరుసమీద, వాటి అర్థాలమీద పదబంధాలు, ఒక చిత్రం, ఒక ఊహాబింబం లేక గొప్ప అర్థం ఉన్నదనుకున్న ఏదో ఉల్లేఖనమీద ధ్యానాలుంటాయి, ఈ దేశానికి పరిచయం చేయబడిన మంత్రయోగమనేది గూడా ఉన్నది. అందులో రహస్యంగా గురువు, శిష్యుని కిచ్చిన కొన్ని సంస్కృత పదాలను రోజుకు మూడు నాలుగు సార్లులేదా వందసార్లు, వెయ్యిసార్లు వల్లెవేస్తారు. ఏదేమయినా మనసునది నెమ్మదింప జేసి ఈ ప్రపంచాన్ని భిన్నంగా మార్చుకునే సామర్థ్యాన్నిస్తుంది. సంస్కృతంలోనయినా, లాటిన్‌లోనయినా ఆంగ్లంలోనయినా, మీకిష్టముంటే గ్రీకులోనయినా చైనా భాషలో నయినా పదాలవరుసను వల్లెవేస్తే అప్పటికే మందంగా ఉన్న మనసు యింకా మంద మవడంతో మనసులో కొంత ప్రశాంతతను కలుగజేస్తుంది. కాదండీ, దయచేసి నవ్వొద్దు, ఇది చాలా గంభీరమయింది. ఎందుకంటే కొన్ని తేడాలతో తూర్పుదేశాలలో అమితంగా సాధన చేస్తున్న వాటిలో ఇదొకటి. దీని భావం అంతులేకుండా తిరుగుతున్న మనసును వల్లెవేతతో నెమ్మదింప చేయడము, అదీ ప్రత్యేకంగా సంస్కృతంలో ఉంటే శబ్దం చాలా ప్రధానమవుతుంది. ఎందుకంటే నిశ్చితధ్వని, లక్షణమున్న ఆ భాష అసాధారణమయింది. దానితో మీరేదో సాధిస్తారన్న ఆశా వుంటుంది. మీరిప్పుడు 'కోకాకోలా' లేక 'పెప్సికోలా' వంటి మీకిష్టమయిన పదం వల్లెవేసినాగూడా మీకు అసాధారణ అనుభూతి కలుగుతుంది. (నవ్వులు) తూర్పు దేశాలలోనేగాక కాథలిక్కు చర్చీలలోనూ, సన్యాసుల ఆశ్రమాలలోను స్తున్న అటువంటి పునరుక్తి మనసును లోతు లేకుండా, శూన్యంగా, మందంగా జేస్తుంది. సున్నితత్వాన్ని ప్రత్యక్ష వీక్షణ గుణాన్ని తీసుకురాదు. ఆ మనిషి తాను చూడాలనుకున్న దానినే చూస్తాడు. ధ్యాన మంటున్న ఆ ప్రత్యేకరకాన్ని మనం వదిలేయగలగాలి. ఎందుకంటే ఎవరో చెప్పారనీగాదు. పునరుక్తితో మనసు తప్పక మందమయి బండబారిపోతుందని మీరు చూడడం వలన ప్రజ్ఞతో వదిలేయాలి. దయచేసి వక్త ఏ ఒక్క ప్రత్యేక ధ్యాన విధానానికి, పద్ధతికి పురికొల్పడం లేదని తెలుసుకోండి. అతడి కందులో నమ్మకం లేదు. ధ్యానానికి ఒక పద్ధతి లేదు. మీరిప్పుడు చూస్తారు.

సరే, అన్ని ధ్యాన విధానాలూ ఒక భంగిమల వరుసను ప్రతిపాదించడము దానితో మీరు సరిగ్గా పద్మాసనంలో కూర్చుని లోతుగా గాలి పీల్చి వదులుతుంటే మనసు మౌనంగా ఉండగలగడము వుంటాయి. ఒక గొప్ప గురువుగారి కథ ఉన్నది. వీరు తోటలో తిరుగుతూ ఉంటే ఒక శిష్యుడు దగ్గరికెళ్ళి కూర్చొని దీక్ష తీసుకునే భంగిమలో కూర్చుని తర్వాత ఏమిటో చెప్పమన్నట్లు గురువుగారి వంక చూస్తున్నాడు. గురువు గారప్పుడు అతని పక్కనే కూర్చున్నారు. కూర్చుంటూ శిష్యుడిని చూస్తే అప్పటికే కళ్ళు మూసుకుని గాఢంగా గాలి పీల్చి వదలడమారంభించాడు. దానితో 'మిత్రమా, నీవేం చేస్తున్నావు?' అని గురువుగారడిగారు. 'అత్యున్నత చైతన్యాన్ని చేరుకోవడానికి ప్రయత్నిస్తున్నాను' అన్నాడట శిష్యుడు. అప్పుడు గురువుగారు రెండు గులకరాళ్ళనేరి వాటిని రుద్దనారంభించారుట. రుద్దుతున్నప్పుడు ఉన్నతస్థాయి మీదున్న శిష్యుడు కళ్ళుతెరిచి, తన గురువుగారు చేస్తున్నది పరిశీలించి 'గురువుగారూ, మీరేం చేస్తున్నారు' అని అడిగారుట. 'ఒకదాన్ని అద్దంగా చేద్దామని యీ రెండురాళ్ళను రుద్దుతున్నా'నని గురువు బదులిచ్చారట. శిష్యుడప్పుడు నవ్వి 'గురువు గారూ, మీరది మరో పదివేల సంవత్సరాల పాటుచేసినా ఆ రాతినుండి అద్దాన్ని చెయ్యలేరెప్పటికీ' అన్నాడట. దాని మీదట గురువు గారు 'నీవిలా వచ్చే పదివేల సంవత్సరాలపాటు కూర్చున్నా అనుకున్నది సాధించలేవు' అని వెంటనే ప్రత్యుత్తర మిచ్చారట.

ఈ ఉచ్ఛ్వాశ నిశ్వాస విధానాలు, సరైన భంగిమలు ఉన్న పద్ధతులు వున్నాయి. నిటారుగా కూర్చుంటే లేక వెల్లకిలా పడుకుంటే తలకు ఎక్కువ రక్తం ప్రవహిస్తుంది. అలాగే అతిగా వంగడము ఆ ప్రసారాన్ని అదుపు చేస్తుందన్నది స్పష్టం. నిటారుగా కూర్చోవడంలోని భావమిది. సక్రమంగా శ్వాసించడము రక్తానికెక్కువ ప్రాణవాయువును తెస్తుంది. శరీరాన్ని నిశ్చలం చేస్తుంది. దీనికున్న ప్రాధాన్యతను, ప్రాధాన్యత లేకపోవడాన్ని మనమే సుమారుగా తెలుసుకోగలము. గురువుగారు, చెప్పిన పద్ధతిలో ప్రతిరోజు సాధన చేస్తే మీరింకా గొప్ప అవగాహనను లేదా మౌనాన్ని సాధిస్తారని, స్వర్గానికి మరింత దగ్గరవుతారని, భూమ్మీదో దానిని దాటో వున్న ఔన్నత్యానికి దగ్గరవుతారని అర్థం. గురువుగారికి జ్ఞానోదయమయి శిష్యునికంటే ఎక్కువ తెలుసుండాలనుకుంటారు. సంస్కృతంలో 'గురువు' అన్న పదానికి అర్థం సూచించే వ్యక్తి. దారి గుర్తులు తెలిపే రాతి స్థంభంలాగా అతడు ఊరికే సూచిస్తారు. ఏమి చేయాలో చెప్పరు. మిమ్మల్ని చేత్తోపట్టుకుని తీసుకువెళ్ళరు. ఊరికే మార్గాన్ని సూచిస్తారు. దానితో మీరు చేయాలను కున్నది చేయమని వదిలేస్తారు. అయితే వాటిని తమకోసం వాడుకుంటున్న వారివలన ఆ పదం కలుషితమయింది. ఎందుకంటే, అటువంటి గురువులు పద్ధతులనందిస్తున్నారు.

ఒక పద్ధతి, ఒక విధానం అంటే ఏమిటి? దయచేసి దగ్గరగా చూడండి. ఎందుకంటే, అసత్యమయినదానిని నిరాకరించడంలో, వదిలేయడంలో తాను సత్యాన్ని తెలుసుకో గలడు. మనం చేస్తున్నదది. స్పష్టమయిన అబద్ధాన్ని పూర్తిగా నిరాకరించకపోతే ఎటువంటి అవగాహనకూ రాలేము. కొన్ని ధ్యాన విధానాలను, ధ్యానరూపాలను, సాధన చేస్తున్న

వారు మీలోఉంటే మిమ్ములను మీరే ప్రశ్నించుకోగలరు. కాథలిక్కు ప్రపంచంలో సన్యాసులు చేసినట్లు లేదా రోజూ కొంత సమయం మౌనంగా కూర్చొని ఉదయాన్నే, నిత్యం, రెండు గంటలకో మూడు గంటలకో లేచి ఒక విధానం, ఒక పద్ధతి ప్రకారం మీ ఆలోచనలను నియంత్రిస్తూ తీర్చిదిద్దుతూ సాధన చేస్తుంటే సాధించేదేమిటి? మిమ్మల్ని మీరు ప్రశ్నించుకోండి. నిజానికి బహుమానాన్ని వాగ్దానం చేస్తున్న ఒక పద్ధతిని అనుసరిస్తున్నారు. దినదినం ఆ పద్ధతినెప్పుడయితే సాధనచేస్తారో మీ మనసు యాంత్రిక మవక తప్పదు. అందులో స్వేచ్ఛ ఉండదు. ఒక పద్ధతంటే తానేమి చేస్తున్నదీ తెలుసనుకునే వానిచేత వేయబడే మార్గం. నేనలా చెప్పవచ్చునంటే దానినిచూడడానికి తగినంత ప్రజ్ఞ లేకపోతే మీరు యాంత్రిక విధానంలో చిక్కుకుంటారు. అంటే దినదిన సాధన, సానబెట్టడము, మీ జీవితంలో దానినొక దినచర్యగా చేస్తుంటే, ఐదో, పదో లేక కొన్ని సంవత్సరాలలో పట్టవచ్చేమో. అయితే క్రమంగా, చిట్టచివరికి సత్యమంటే, ఏమిటో జ్ఞానోదయమంటే ఏమిటో, యదార్థ తత్వమంటే ఏమిటో- ఇత్యాదివి తెలుసుకునేస్థితిలో వుంటారు. ఏ పద్ధతీ అలా చేయడం లేదన్నది రూఢియే. ఎందుకంటే, పద్ధతి అంటేనే సాధన. దినదినమూ సాధనచేసే మనసు యాంత్రికమయి, తన సున్నితత్వాన్ని తన తాజాదనాన్ని పోగొట్టుకుంటుంది. కాబట్టి ఇటువంటి విధానాలు అసత్యమనేదీ చూడగలడు.

మరికొన్ని రకాలవిధానాలు ఉన్నాయి. జెన్‌లోను, తాంత్రికవిధానాలు కొన్నింటిలోనూ ఈ పద్ధతులను కొద్దిమందికే జెప్పి, రహస్యంగా ఉంచుతారు. అటువంటివారిని కలుసుకున్న వక్త మొట్టమొదటినుండి వాటిలోఅర్థం లేదని వదిలి పెట్టేశాడు. కాబట్టి క్షుణ్ణంగా పరీక్షించి, అవగాహన చేసుకుని ప్రజ్ఞతో ఉండడంవల్ల వల్లెవేతను వదిలేయవచ్చు. అధికార స్థానంలో నిలిచే, తెలియదనే వారికెదురుగా నిలబడి తెలుసు అనే ఆ గురువును కూడా వదిలేస్తారు అప్పుడు. 'నాకు తెలుసు' అనే గురువుకు ఆ మనిషికి తెలియదు. సత్యమేమిటో మీరెప్పటికీ తెలుసుకోలేరు. ఎందుకంటే, అది సజీవమయినది. సత్యం ఏదో స్థిరంగా, శాశ్వతంగా, మీ సౌకర్యం కోసమే కట్టి ఉంచినట్లు! ఒక పద్ధతయినా, మార్గమయినా సత్యాన్ని చేరడానికి వేయవలసిన అడుగులు. కాబట్టి అధికారాన్ని పాక్షికంగాగాక పూర్తిగా ఈ అధికారాన్ని కూడా వదిలేస్తే అప్పుడెంతో సహజంగా విధానాలన్నింటినీ, వట్టి మాటలను వల్లించడాన్ని గూడ వదిలేస్తారు.

అవన్నీ వదిలేయడంతో, బహుశా ధ్యానంలోని మనసును తెలుసుకునుందుకు ముందుకు సాగగలము. మేము చెప్పినట్లు అక్కడ సత్ప్రవర్తన అన్న పునాది ఉండాలి. సద్ధర్మమనే భావనను వెన్నాడడం గాదది. నిత్యజీవితంలో దానిని సాధనచేస్తే కేవలం గౌరవ ప్రదమవడంతో సద్ధర్మానికి అదెంతో దూరమవుతుంది. గౌరవింపబడేదీ, సమాజం అంగీకరించిన నీతీ నీతిగాదు. అది అధర్మము. ఇదంతా మీరు ఒప్పుకుంటారా?

నీతిగా, సచ్ఛీలురై ఉండడమంటే ఏమిటో మీకు తెలుసాండి? మీకీ రెండు పదాల పట్ల అయిష్టత ఉండి ఉండొచ్చు. కాని నిజంగా నీతిగా ఉండడమంటే గౌరవనీయత

కంతటికీ, సమాజం నీతి అంటూ గుర్తిస్తున్న గౌరవనీయతకు స్వస్తి చెప్పడము. ఆకాంక్షలతో, దురాశతో, ఈర్ష్యాసూయలతో, హింసతో నిండిపోయి పోటీబడుతూ వినాశనం చేస్తూ, చంపాలన్న ప్రేరణతో మీరు ఉంటే, సమాజం దీనంతటినీ నీతి అని అందుచేత ఎంతో గౌరవనీయమని అంటుంది. అయితే, దీనికి పూర్తిగా భిన్నమైన నీతి, సచ్ఛీలతల గురించి, సామాజిక నీతితో సంబంధంలేని దానిగురించి మనం మాట్లాడు కుంటున్నాము. సచ్ఛీలతంటే సవ్యత. సవ్యతంటే ఒక చిత్రణ ప్రకారం, ప్రణాళికా బద్ధమై ఉండేది. చర్చితో, సమాజంతో మీ సైద్ధాంతిక సూత్రాలతో కలిసివున్నది గాదు. సచ్ఛీలత అంటే సవ్యత అని అర్థం. సవ్యత అంటే అపసవ్యమయిన దానిని అర్థం చేసుకోవడము. మనసును, ఆ అపసవ్యతనుండి అంటే, ప్రతిఘటన, దురాశ, అసూయ. మూఢత, భయాలనుండి విడుదల చేస్తుండడము. ఆలోచనతో నమ్రతను ఎలా పెంపొందించలేమో అలా ఆలోచనతో పెంపొందింపలేని దానిలో నుండి సచ్ఛీలత వస్తుంది. వ్యర్థమయిన మనసు నమ్రతను పెంపొందించడానికి గూడా ప్రయత్నించగలదు. అలా చేసి తన అహంభావాన్ని కప్పిపుచ్చుకోవాలని ఆశిస్తుంటుంది. కాని అటువంటి మనసుకు నమ్రత ఉండదు. అదే విధంగా సచ్ఛీలత సజీవమయింది. సాధనా ఫలితంగాదు. పరిసరాల ప్రభావం మీద ఆధారపడి ఉండదు. ఇది ధర్మసంగతమయిన, సత్యమయిన లోతయిన సచ్ఛీల ప్రవర్తన. మనలో చాలామందికి నిజాయితీ లేదు. ఆశయాలు పెట్టుకుని వాటిని అందుకోవాలని ప్రయత్నించేవారు తప్పకుండా నిజాయితీలేనివారే. ఎందుకంటే వారు నటిస్తున్నారు. కాబట్టి తానీ పునాదిని వేయ వలసిందే. ధ్యానమంటే ఏమిటో అర్థం చేసుకోవడంకంటే ఈ పునాదినేవిధంగా వేశారన్నది చాలా ప్రధానం. నిజానికి ఈ వేసే విధానమే ధ్యానం. ఆ వేయడంలో ఎటువంటి ప్రతిఘటన, అణచివేత లేక నియంత్రణ ఉన్నా అప్పుడది సచ్ఛీలమవదు. ఎందుకంటే దానంతటిలో ప్రయత్నం యిమిడి వుంటుంది. నిన్న మనం చెప్పుకున్నట్లు తనలో వైరుధ్యమున్నప్పుడే ప్రయత్నం వస్తుంది.

కాబట్టి ప్రపంచంలో నీతి అంటూ అవలంబిస్తున్నది నిజానికి ఏ మాత్రం నీతి గాదని గుర్తించి, దానినర్థం చేసుకోవడంలోను, అసూయను, దురాశను ప్రోగుచేసుకోవడాన్ని చూడడంలోను, దానిమండి ప్రయత్నం లేకుండానే స్వేచ్ఛ నొందడం సాధ్యమా? నేను చెప్పింది స్పష్టంగా ఉన్నదా? అంటే అసూయ మొత్తాన్ని చూడడము. ఊరికే దాన్నొక ప్రత్యేక రూపంగాగాక దాని అర్థం మొత్తాన్ని, ఒక భావాన్ని చూసినట్లు చూడక నిజంగా చూస్తే, చూడడమనే ఆ చర్యే మనసును అసూయనుండి విడుదల చేస్తుంది. కాబట్టి, ఆ స్వేచ్ఛలో ఘర్షణ లేదు. అప్పుడు సచ్ఛీలత సంఘర్షణలో నుండి వచ్చేదో, అభ్యాసం చేసిన మనసుకు దక్కే ఫలమో గాదు. తానేమి నేర్చుకోవాలో అర్థం చేసుకునే మనసుతో (ఉన్నదేదో అర్థం చేసుకుంటున్న మనసు)నేర్చుకోవడమే తనదయిన క్రమశిక్షణను తెస్తుంది. అటువంటి క్రమశిక్షణ అసాధారణమైన నిరాడంబరతతో ఉంటుంది. కాబట్టి అక్కడది ఉంటుంది. మీరీ విధమయిన పునాది వేస్తేనే ముందుకు వెళ్ళగలము. కాని మీరు సచ్ఛీలురవకపోతే ఆ పదానికున్న లోతయిన అర్థంలో సచ్ఛీలురు గాకుంటే అప్పుడు

ధ్యానం ఒక పలాయనము. అనైతిక కార్యక్రమము. మూర్ఖమైన, మందమైన మనసు గూడా మాదకద్రవ్యాలతోనూ లేక పదాల వల్లెవేతతోను తనను నిశ్చలంగా ఉంచుకో గలదు. కాని సచ్ఛీలత గొప్ప సున్నితత్వాన్ని, అందువలన గొప్ప నిరాడంబరతను కోరుతుంది. విభూది, కాషాయవస్త్రపు రకం నిరాడంబరత గాదు. మళ్ళీ అదొక నటన, ప్రదర్శన అవుతుంది. కాబట్టి అంతరంగంలో, లోతులలో నిరాడంబరంగా ఉండడము. అటువంటి నిరాడంబరతకు గొప్ప సౌందర్యముంటుంది. ఇది మేలురకం ఉక్కువంటిది.

ధ్యానానికి ఆరంభం మనలను అర్థం చేసుకోవడంలో ఉంటుంది. తనను తాను అర్థం చేసుకోవడం ఎంతో క్లిష్టమయిన విషయము. అక్కడ చేతన, అంతశ్చేతన అంటే లోతుగా రహస్యంగా ఉండే మనసు ఉన్నాయి, అంతశ్చేతనకు అంతటి ప్రాధాన్యత నెందుకిచ్చారో తెలియదు. ఇది గతం తాలూకు నిధి. నిధి అనవచ్చునంటే - జాతి సంక్రమణలు, సంప్రదాయము, స్మృతులు, ప్రేరణలు కప్పిపెట్టిన కాంక్షలు, ఆరాటాలు, కోరికలు, ప్రయత్నాలు, నిర్బంధాలు. చేతనా మనసు విశ్లేషించి అంతశ్చేతన మొత్తాన్ని, ఆ లోతయిన దాగిన రహస్య పొరలను అన్వేషించలేదు. ఎందుకంటే అందుకు కొన్ని సంవత్సరాలు పడుతుంది. ఆ పైన ఏ చేతనా మానసం అంతశ్చేతనను పరీక్షించేందుకు పూనుకున్నదో అది అసాధారణ చురుకుదనంతో, నిబద్ధతలేకుండా పదునుగా పక్షపాతం లేకుండా దర్శించాలి కాబట్టి అదొక సమస్యవుతుంది. కలలు, సమాచారాలద్వారా అంతశ్చేతన తనను తాను వెల్లడించుకుంటుందని, మీరు కలలుగనాలని లేకుంటే పిచ్చివారవుతారని, చెప్పడం జరిగింది. అసలెప్పుడయినా తానెందుకు కలలుగనాలో అడిగారా? కలలుగనాలని మనం ఒప్పుకున్నాము. మనమెంత సంప్రదాయ బద్ధులమో తెలిసిందే. ఎంతో నవీనంగా, ఆధునాతనంగా ఉంటున్నప్పటికీ, సంప్రదాయన్నంగీకరిస్తూ సరేనంటూ ఉంటాము. 'కాదు' అని ఎప్పటికీ చెప్పము., సందేహించము, ప్రశ్నించము. ఒక అధికారో, నిపుణుడో వచ్చి 'ఇది', 'అది' అని చెప్తే వెంటనే అంగీకరిస్తాము. 'సరేనండీ, మేం చేసేదానికంటే మీకు బాగా తెలుసు' అంటాము. ఈ అంతశ్చేతన, చేతన కలలు అనే విషయం మొత్తాన్ని మనం ప్రశ్నించబోతున్నాము.

మీరసలెందుకు కలలు గనాలి? పగటిపూట మీ చేతనా మనసు ఉద్వేగంతో, జగడాలతో, కుటుంబంతో సాధ్యమయినన్ని వినోదాలనిచ్చే రకరకాల అంశాలతో ఆక్రమితమై ఉంటుంది. కాబట్టి అది స్పష్టము. పిచ్చాపాటీ మాట్లాడుతూ, తనలోతానే అంతులేకుండా మాట్లాడుకుంటూ, లెక్కించుకుంటూ అది కాలక్షేపం చేయడమంతా మీకు తెలుసు. కాబట్టి రాత్రివేళ మెదడు ఎంతోకొంత శాంతంగా ఉన్నప్పుడు శరీరం మొత్తం మరింత విరామంలో వున్నప్పుడు, లోతుపొరలు తమ విషయాలను మనసు లోనికి ప్రక్షేపిస్తూ సూచనలు, సమాచారాలుయిస్తూ వాటిని మీరర్థం చేసుకుంటారనో, మరేదో ఆశిస్తూ ఉంటాయి. పగటివేళ సరిదిద్దకుండా గమనిస్తూ ఎంపికలేని ఎరుకతో - మీ ఆలోచనలను ప్రేరణలను గమనిస్తూ -మీరేమి చెప్తున్నారో ఎలా కూర్చుంటున్నారో మాటలు, సైగలు మీరెలా వాడుతున్నారో, గమనించడాని కెప్పుడయినా ప్రయత్నించారా?

పగటివేళ సరిదిద్దే ప్రయత్నం చేయకుండా, గమనిస్తుంటే, ఆ ఆలోచన ఎంత భయంకరమైనది నా కది రాగూడదు'అని మీకు మీరు చెప్పుకోకుండా కేవలం గమనిస్తుంటే, దానితో పగటిపూట మీ ప్రేరణలు, ఆకాంక్షలు, ఆరాటాల ముసుగు తొలగింపబడడంతో, వాటిని మీరు గమనించడంతో రాత్రివేళ మీరు నిద్రపోయేటప్పుడు మీ మనసుగూడా తెలుసు కుంటారు. దానితో మేల్కొన్నప్పుడు మనసు అసాధారణంగా సజీవమై, చురుగ్గా, స్వచ్ఛంగా నిష్కపటంగా ఉందని తెలుసుకుంటారు. వీటన్నింటినీ చేయాలని ప్రయత్నిస్తారో లేక ఇదంతా వట్టి మాటలోనని నాకు సందేహం.

ఇక్కడ మరొక సమస్యగూడా ఉన్నది మన మనసు ఎప్పుడూ లెక్కలువేస్తూ పోలుస్తూ వెంటబడుతూ, తరుముతూ తనలోతాను అంతులేకుండా మాట్లాడుకుంటూ లేక మరొకరి గురించి ఊసులాడుతూ ప్రతిరోజూ, రోజంతా ఏమి చేస్తూ ఉంటుందో మీకు తెలుసు. సత్యాన్ని చూడడము. అసత్యాన్ని ప్రత్యక్షంగా గ్రహించడము అటువంటి మనసుకు సాధ్యపడదు. మనసెప్పుడు శాంతంగా ఉంటే అప్పుడటువంటి ప్రత్యక్ష గ్రహింపు సాధ్యమవుతుంది. మీకు అభిరుచి ఉండి, వక్త చెప్తున్నదేమిటో వినాలని ఎప్పుడను కుంటారో అప్పుడు మీ మనసు సహజంగా నిశ్శబ్దమయి గొణుగుడాపేస్తుంది. లేదా దేని గురించో ఆలోచించడ మాపేస్తుంది. మీరేదో స్పష్టంగా చూడాలనుకుంటే మీ భార్యనో, భర్తనో అర్థం చేసుకోవాలనుకుంటే లేక ఒక మేఘాన్ని, దాని పూర్తి వెలుగులో సౌందర్యంలో చూడాలనుకుంటే చూడండి. ఆ చూడడం మీ మౌనంలోనుండి గావాలి. లేకుంటే మీరు చూడలేరు. కాబట్టి అంతులేకుండా మాట్లాడే, తిరిగే, గొణిగే ప్రయత్నించే వెంటాడే, భయపడే మనసు అసలెప్పటికయినా నిశ్శబ్దంగా ఉండగలదా? అభ్యాసంతో అణచివేతతో లేక నియంత్రణతో గాదు ఊరికే నిశ్శబ్దమవడము.

ధ్యానాన్ని వృత్తిగా పెట్టుకున్నవారు నియంత్రించమంటారు. నియంత్రణలో నియంత్రించే తానేగాక నియంత్రింపబడే వస్తువుగూడా వున్నది. మీ మనసును గమనిస్తుంటే ఆలోచన కదిలిపోతూ వుంటుంది. మీరు వెనక్కు లాగుతారు. అప్పుడు మళ్ళీమళ్ళీ తిరుగుతుంది. వెనక్కు లాగుతారు. ఆ ఆట అంతులేకుండా సాగుతుంది. పది సంవత్సరాల తర్వాతనో ఏమో మీ మనసును పూర్తిగా నియంత్రించడంతో అదెక్కడికీ తిరగదు. దానితో ఎటువంటి ఆలోచనారాదు. మీరు చెప్పినట్లు, చాలా అసాధారణ స్థితిని సాధించగలిగా ననుకుంటారు. అందుకు భిన్నంగా వాస్తవంలో ఏమీ సాధించరు. నియంత్రణలో ప్రతిఘటన ఉన్నది. దయచేసి కొంచెమిది గ్రహించండి. ఏకాగ్రత ఒక రకమయిన ప్రతిఘటన. ఒక ప్రత్యేక అంశము వయిపు ఆలోచనను మళ్ళించడము. ఒక విషయం మీద పూర్తి ఏకాగ్రత కోసం మనసుకు శిక్షణనిస్తుంటే తన సాగేగుణాన్ని సున్నితత్వాన్ని పోగొట్టుకుని, జీవితరంగం మొత్తాన్ని గ్రహించడానికి అశక్తురాలవుతుంది.

త్రోసివేయకుండా, నియంత్రించే ఉద్దేశంతో లోచరుచుకోవడానికి, కట్టుబడివుండ డానికి, లేదా అణచడానికి దిగకుండా మనసుకు ఈ ఏకాగ్ర భావముండడము సాధ్యమా? ఏకాగ్రతలో ఉండడము చాలా సులభము. ప్రతి పాఠశాల విద్యార్థి నేర్చుకుంటాడు.

అలా ఉండడమతనికి యిష్టం లేకపోయినా ఏకాగ్రతలో ఉండే ప్రయత్నం చేయమని వత్తిడి చేయబడతాడు. మీరు ఏకాగ్రతతో ఉంటే తప్పక ప్రతిఘటిస్తున్నట్లు మీ మనసు మొత్తం దేనిమీదో కేంద్రీకృతమవుతుంది. దినదినమూ ఒకదానిమీద ఏకాగ్రతకోసం దానికి శిక్షణనిస్తుంటే సహజంగా తన పదునును, విశాలతను, లోతును కోల్పోతుంది. దానికి స్థలము ఉండదు. కాబట్టి అప్పుడున్న సమస్యేమిటంటే మనసు ఈ ఏకాగ్రతనే గుణంతో ఉండగలదా? వాస్తవానికి అది సరయిన మాటగాకపోయిన - సంపూర్ణ అవధానతని అంటే ఎందులో భయం, బాధ, లాభదృష్టి సుఖంలేదో ఆ మీ మనసు మొత్తంలో ఉండే అవధానత, ఎందుకంటే సుఖంలో ఉండేదేమిటో మీరిప్పటికే అర్థం చేసుకున్నారు. కాబట్టి ఆవిధంగా మనసు సంపూర్ణ సావధానతనిస్తే అంటే మీ హృదయంతో, నరాలతో, కళ్ళతో, మీ మొత్తంతో సావధానమయి ఉంటే అటువంటి సావధానతలో ఒకచిన్న అంశంపట్ల గూడా శ్రద్ధ చూపడముంటుంది. సాధారణమైన ఏకాగ్రతకు సంబంధించిన ఈ ప్రతిఘటన సంకుచితపరచడం లేనప్పుడు మీరు పాత్రలు కడుగుతున్నా పూర్తి అవధానతతో ఉండగలుగుతారు.

కాబట్టి పునాది వేయవలసిన అవసరాన్ని చూసిన మీదట సహజంగా, ఎటువంటి వక్రీకరణ ప్రయత్నము లేకుండా అధికారాన్నంతా వదిలేసి చూసినప్పుడు మనసు అనుభవం కోసం వెతకడం గురించీ యోచిద్దాం. అత్యల్ప అర్థమున్న, మందమైన రోజువారీ జీవితాన్ని మనలో చాలా మందిమి గడుపుతున్నామనేది స్పష్టమే. రకరకాల ఉద్దీపనలతో మాదకద్రవ్యాలతో విస్తారమైన లోతైన అనుభవాలకోసం నిరంతరం అన్వేషిస్తున్నాము. ఇప్పుడు తనకొక అనుభవం గల్గితే దానినొక అనుభవంగా గుర్తించడం ఆ అనుభవం మీ కిప్పటికే వున్నదని సూచిస్తుంది. లేకుంటే మీరు దానిని గుర్తించరు. కాబట్టి ఒక క్రైస్తవుడు తన ప్రత్యేక రక్షకుని పూజించడానికి నిబద్ధమవడంతో మాదక ద్రవ్యాలను తీసుకున్నప్పుడో లేదో రకరకాల మార్గాల్లో గొప్ప అనుభవాన్నేదో కోరుకున్నప్పుడు తన నిబద్ధత రంగులద్దిన దృశ్యాన్నే తప్పకచూస్తాడు. కాబట్టి జీవితానికి ప్రాధాన్యాన్ని, అర్థాన్ని యిచ్చే అనుభవాన్ని కోరుకుంటున్న మనసు వాస్తవానికి తన పూర్వ రంగాన్ని ప్రక్షేపిస్తున్నది. కాబట్టి అతడు చూస్తున్నది అతడి చేత ప్రక్షేపింపబడిందే. అదెంత గొప్ప దీప్తితో లోతున్నదయి, సౌందర్యంతో అసాధారణంగా ఉన్నప్పటికీ అతడి పూర్వ రంగాన్నే యింకా ప్రక్షేపిస్తున్నది. కోరుకోని మనసు స్వేచ్ఛవలన పూర్తిగా భిన్న లక్షణంతో ఉంటుంది.

ఈ ప్రసంగం ఆరంభాన్నుండి యిప్పటి దాకా పరిశీలించినదంతా ధ్యానంలో భాగము. మనం యిలాగే వెళ్తున్నప్పుడు సత్యాన్ని చూడడము, గురువు, సాధికారకత, ఒక విధానము, ఎంత అబద్ధమో చూడడం, ఏది కేవలం పరిసరాల ఫలితంగానో, ఎందులో ప్రయత్నమే ఉండదో ఆ ప్రవర్తనకు పునాది వేయడము ధ్యానంలో ఒక భాగం. దాని అంతరార్థమంతా ధ్యాన లక్షణమే. ఎప్పుడు ఆ బిందువు దగ్గరుంటాడో, ఎందులో ఘర్షణ ఉండదో, ఆ జీవిత వ్యవహారం మొత్తాన్ని అర్థం చేసుకున్న మీదట మౌనమంటే ఏమిటో విచారణ చేయనారంభించ గలుగుతారు. ఇవన్నీ ముందు చేయకుండా, విచారణ చేయనారంభిస్తే ఏదేమయినా మీ మౌనానికి అర్థముండదు. ఎందుకంటే సౌందర్యాన్ని

ప్రేమను, మరణాన్ని, సచ్ఛీలతను నిజంగా అర్థం చేసుకోకుంటే మనసు లోతు లేనిదవుతుంది. అది ఉత్పన్నం చేసే మౌనం మరణమౌనమే అవుతుంది. వక్తతో పాటు మీరీ సాయంకాలం ప్రయాణించి ఉంటే చేసి ఉంటారని ఆశిస్తాను. మౌనమంటే ఏమిటి? ఆ మౌనంలో ఉన్న లక్షణమేమిటి? అని మనం అడగాలి. దేనినయినా ఎటువంటి ప్రయత్నము, వక్రీకరణ లేకుండా బహు స్పష్టంగా చూడాలనుకుంటే మనసు నిశ్శబ్దంగా ఉండాలని గుర్తుంచుకోండి. మీ ముఖాన్ని చూడాలనుకుంటే మీ స్వరంలో సౌందర్యాన్ని వినాలనుకుంటే నిశ్శబ్దంగా ఉండాలి. నా మనసు వదురుతూ అంతటా తిరుగుతుంటే మీ అందాన్ని చూడలేను. కురూపాన్ని చూడలేను. కాబట్టి పగటికి రాత్రి అవసరమయినట్లు అటువంటి చూపుకు మౌనము అవసరము. ఆ మౌనం శబ్దాన్నుండో, శబ్దం ఆగిపోవడంతో ఉత్పన్నమయిందోగాదు. మిగిలిన లక్షణాలన్నీ తనలోకి వచ్చినప్పుడు ఆ మౌనం సహజంగా వస్తుంది.

సర్, ఆ మౌనంలో స్థలముంటుందని తెలుసుకోండి. కాని ఆ స్థలం పరిశీలకునికి పరిశీలింపబడే వస్తువుకు మధ్యనుండే, ఉదాహరణకు నాకు మైక్రోఫోనుకు మధ్యనున్న స్థలంగాదు. అది, ఆ స్థలం లేకుంటే నేను చూడలేను. మౌనమయిన మనసున గొప్ప స్థలముంటుంది. అది వస్తువుతో, పరిశీలకునితో సృష్టింపబడిన స్థలంగాదు. స్థలమేమిటో మీరెప్పుడయినా గమనించారేమో నాకు తెలియదు. స్థలం మైక్రోఫోనుచేత ఆక్రమింపబడి, మైక్రోఫోను చుట్టూ ఉన్నది. నా చుట్టూ మీ చుట్టూ ఉన్నది. 'మేము' - 'వారు' అని ఎప్పుడు చెప్పినా మనచుట్టూ మనమే సృష్టించుకున్న యీ స్థలమున్నది. మీరు క్రైస్తవులని, కాథలిక్కులని, ప్రొటెస్టంటనీ, లేదా కమ్యూనిస్టనీ చెప్పినప్పుడు మిమ్మల్ని మీరు ఎలా పరిమితం చేసుకుంటే ఆ విధంగా స్థలమున్నది. అటువంటి స్థలం తప్పనిసరిగా ఘర్షణను పెంచుతుంది. ఎందుకంటే అది పరిమితమయింది. విభజిస్తుంది కాని మౌనమున్నప్పుడుండే స్థలం విభాజ్యమైనదిగాదు. పూర్తిగా విభిన్న లక్షణమున్న స్థలమిది. అక్కడ అటువంటి స్థలముండాలి. అప్పుడే ఆలోచనతో కొలవలేని అపరిమితత్వం, ఆ ఔన్నత్యం, ఆహ్వానింపలేని అది వస్తుంది. అల్పమైన మనసు అంతులేకుండా సాధనచేస్తూ యింకా అల్పంగానే ఉండిపోతుంది. సత్యాన్ని కోరుకుంటున్న మనుషులు ఎందరో యదార్థంగా సత్యాన్ని ఆహ్వానిస్తున్నారు. కాని సత్యాన్ని ఆహ్వానింపలేము.

మనసుకు తగినంత స్థలంలేదు. తగినంత నిశ్శబ్దంగా లేదు. కాబట్టి ధ్యానం ఆరంభాన్నుండి అంతం వరకూ వున్నది. ధ్యానంలో క్రియలోని నైపుణ్యమున్నది.

కాబట్టి ఇదంతా ధ్యానం. మీరిది చేయగల్గితే తలుపు తెరుచుకుంటుంది. అందులోకి రావలసింది మీరు. ఆవల ఉన్నదేమంటే కాల్పనికమైనది గాదు. లేక ఉద్వేగ పూరితమయినది కాదు. మీరు కోరుకుంటున్నదేదో గాదు. మీరెందులోనికి పారిపోతారో అదిగాదు. కాని ప్రజ్ఞావంతము, సున్నితము, ఎటువంటి వక్రతా లేనిదేదో ఆ మనసుతో మీరందులోకి వస్తారు. గొప్ప ప్రేమతో లోపలికొస్తారు. అట్లా కాకపోతే ధ్యానానికి అర్థం లేదు.

ప్రా: మాట్లాతున్నది కూడా ధ్యానం గురించి గాకపోయినా ప్రసంగం మధ్యలో దాని గురించి మాట్లాడవలసిన అవసరమున్నదని ప్రస్తావించారు. ఇదిగాక మరొక విషయ మేదయినా ఉన్నదా?

కృ: ప్రత్యక్షంగా, స్పష్టంగా వ్యక్తమయ్యే వాటి వివరణలలో నాకభిరుచిలేదు. స్పష్టమయినవి అంటే పద్ధతులు, విధానాలు, మాటల వల్లింపులు, గురువులు, అన్నీ స్పష్టమే. ఎవరినీ అనుకరించకపోవడం ముఖ్యం కాదు. తనను తాను అర్థం చేసుకోవడం ముఖ్యం. ఎటువంటి ప్రయత్నం, భయం, అడ్డు లేకుండా నిజంగా మీ లోతుల్లోనికి మీరు త్రవ్వుకుంటూపోతే అసాధారణమైన విషయాలను తెలుసుకుంటారు. తత్వశాస్త్రం, మనస్తత్వశాస్త్రం, పవిత్ర గ్రంథాలు - వీటిలో ఏ ఒక్క పుస్తకం వక్త చదువలేదు. తనలో ప్రపంచం మొత్తం ఉన్నది. ఎలా చూడాలో గ్రహించాలో తెలిస్తే తలుపు అక్కడే వున్నది. తాళం చెవి నీ చేతిలో ఉన్నది. భూమి మీద వున్నవారెవరూ నీకా తాళం చెవినీ యివ్వలేరు. తలుపు తెరువలేరు - నీవు తప్ప.

ప్రా: అస్తిత్వానికి ఓ కారణమంటూ ఉన్నదా?

కృ: అస్తిత్వానికి కారణమెందుకు? (నవ్వులు.) మీరు వున్నారు. ఉండీ అర్థం చేసుకో లేదు గాబట్టి ఒక కారణాన్ని కనుక్కోవాలనుకుంటారు. ఒక చెట్టు వంక, మేఘాలవంక, నీటి మీద కాంతి వంక చూస్తున్నప్పుడు ప్రేమించడమంటే ఏమిటో మీకు తెలిసినప్పుడు అస్తిత్వానికి కారణమవసరం లేదు. మీరున్నారు. అదీ ఉన్నదక్కడ. అప్పుడు ప్రపంచంలోని వస్తు ప్రదర్శనశాలలు, సంగీత సమ్మేళనాలు - వీటన్నింటికీ వుండే ప్రాధాన్యత వీటి తర్వాతే చూసే మనసు, హృదయం మీకుంటే చూడడానికి సౌందర్యముంటుంది. అక్కడ, బయట, మేఘంలోనో, చెట్టులోనో, నీటిలోనో, వస్తువులోనో గాదు మీలో.

★ ★ ★

# శాంతాక్రుజ్, కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో చేసిన ప్రసంగం

ఈ సాయంకాలం పరస్పర సంబంధమున్న ఎన్నో విషయాల గురించి, మానవ సమస్యలన్నీ పరస్పర సంబంధమున్నవే గనుక వాటిని గురించి మాట్లాడాలనుకుంటున్నాను. ఒకే ఒక్క సమస్యను వేరుచేసి దానినే పరిష్కరించే ప్రయత్నం చేయలేము. అందులోనికి ఎలా లోతుగా, క్షుణ్ణంగా గ్రహిస్తూ పోవాలో తెలిస్తే ప్రతి సమస్యలో అన్ని సమస్యలూ వున్నాయని తెలుసుకుంటాం.

ముందుగా, మనం యువకులు, వృద్ధులు అందరమూ ఏమి గాబోతున్నాము? మన జీవితాలనేమి చేయదలుచుకున్నాము. అని అడగదలుచుకున్నాను. సామాజిక, ఆర్థిక నీతంటూ ఆమోదింపబడిన యీ మర్యాద అనే సుడిగుండంలోనికి మనను మనం లాక్కుపోనిద్దామా? ఈ సామాజిక, సంస్కృతంటున్న దానిలో దాని సమస్యల్లో, గందరగోళంలో, వైరుధ్యమంతటిలో భాగమవబోతున్నామా? లేక మన జీవితాన్ని పూర్తి భిన్నంగా చేయబోతున్నామా? చాలామంది ఈ సమస్యనెదుర్కుంటున్నారు. తాను విద్యావంతుడవడం వల్ల సమాజాన్ని, జీవితాన్ని మొత్తంగా అర్థం చేసుకోవటానికి బదులు ఈ ఉనికి మొత్తంలో ఒక ప్రత్యేక పాత్రను పోషించడానికే ననుకుంటాడు. చిన్ననాటి నుండి ఈ సమాజంలో ఏదోసాధించడంకోసం, విజయంకోసం పూర్తిగా బూర్జువాలవడం కోసం అమితంగా నిబద్ధులమయ్యాము. సాధారణంగా అతి సున్నితమైన మేధావి అటువంటి జీవితనమూనాకు విరుద్ధంగా తిరుగుబాటు చేస్తాడు. అతను తిరుగుబాటులు ఎన్నో చేస్తాడు. సంఘ విరోధో, రాజకీయవ్యతిరేకో అవుతాడు. మాదక ద్రవ్యాలను తీసుకుంటాడు. ఒక గురువునో, ఒక మతాచార్యుడినో లేదా ఒక తత్వవేత్తనో అనుసరిస్తూ సంకుచిత శాఖా దురభిమాన మతనమ్మకాన్నేదో వెన్నాడతాడు. లేదా క్రియాశీలుడో, కమ్యూనిస్టో అవుతాడు. లేదా బౌద్ధమతం, హిందూమతం వంటి విలక్షణ మతానికి పూర్తిగా తననర్పించుకుంటాడు. ఒక సామాజికవేత్తో, ఒక శాస్త్రవేత్తో, ఒక కళాకారుడో, ఒక రచయితో లేదా శక్తి వుంటే ఒక తత్వవేత్తో అయి, దానితో తన నొక వలయంలో యిముడ్చుకుని సమస్యను పరిష్కరించామనుకుంటాడు. జీవితం మొత్తాన్ని అర్థం చేసుకున్నామని ఊహించుకుని మనకున్న ప్రత్యేక ఆశయాలు, చాదస్తాల ప్రకారం, మనకున్న ప్రత్యేక జ్ఞానాన్నుండి జీవితం ఎలా ఉండవలసిందీ ఇతరులను శాసిస్తాము.

జీవితమంటే ఏమిటో చూస్తే కేవలం ఆర్థిక సామాజిక రంగాల్లోనే గాక మానసిక రంగంలో దాని లెక్కలేనన్ని జటిలతలను, సంకటాలను చూస్తే తనలో తీవ్ర తీక్షణత ఉంటే, దీనంతటిలో తానే పాత్ర నిర్వహించాలని అడుగుతాడు. ఈ ప్రపంచంలో జీవిస్తున్న మానవునిగా, కాల్పనిక జగత్తులోకో లేదా ఒక ఆరామంలోకో పారిపోకుండా నేనేం చేయాలి?

ఈ నమూనా మొత్తాన్ని చాలా స్పష్టంగా చూస్తూ తానేం చేయాలి? తన జీవితాన్నేం చేయాలి? ఒక సంస్థలో ఒక స్థానంలో ఉన్నా లేదా అందులోకి ప్రవేశించబోతున్నా ఈ ప్రశ్న ఎప్పుడూ ఉంటూనే ఉన్నది. కాబట్టి నాకేమనిపిస్తున్నదంటే 'జీవిత లక్ష్యమేమిటి?' ఎంతో కొంత మానసిక ఆరోగ్యం బాగా వుండి, పూర్తి నాడీ రుగ్మత లేకుండా, సజీవమైన చురుకైన మనిషిగా నేనేం చేయాలి? అని ప్రశ్నించాలి. నేనాకర్షింపబడింది ఏ పాత్రకు, ఏ అంశానికి? నేనొక ప్రత్యేక ఖండికకో, విభాగానికో ఆకర్షితుడినయితే, ఆ ఆకర్షణలో ఉన్న ప్రమాదాన్ని తెలుసుకోవాలి. ఎందుకంటే మనం మళ్ళీ ప్రయత్నాన్నీ, వైరుధ్యాన్నీ, యుద్ధాన్నీ పెంచే ఆ పాత విభజనలోకే వచ్చాం. కేవలం ఒక ప్రత్యేక విభాగంలో పాల్గొనడంగాక జీవితం మొత్తంలో పాల్గొనగలనా? జీవితం మొత్తంలో పాల్గొనడమంటే అర్థం విజ్ఞాన శాస్త్రం, సామాజిక శాస్త్రం, తత్వశాస్త్రం, గణితం యిత్యాది వాటిగురించి పూర్తి విజ్ఞానం గావాలని గాదు. తానో మేధావి అయితే తప్ప అది అసాధ్యం గదా!

కాబట్టి మానసికంగా, అంతరంగంలో పూర్తిగా విభిన్న జీవిత విధానాన్ని తీసుకు రాగలడా? అంటే బాహ్యావిషయాలన్నింటిలో ఆసక్తి చూపుతాడు. అయితే మూలాధారము మౌలికము అయిన మార్పు మానసిక రంగంలోనిది. తనలో లోతుగా జరిగే అటువంటి మార్పు గురించి తానేమి చేయగలడు? ఎందుకంటే తానే సమాజం, ప్రపంచం, గత విషయమంతా. కాబట్టి సమస్యేమంటే మీరు, నేను మనం జీవితంలోని ఒక్క విభాగంలో గాక జీవితం మొత్తంలో ఎలా పాల్గొనగలము? అదొక సమస్య. నడవడి, ప్రవర్తన, సౌశీల్యత అన్న సమస్యలు, ప్రేమ అనే సమస్య గూడా ఉన్నాయి. ప్రేమంటే ఏమిటి? మరణమంటే ఏమిటి? అన్న సమస్యలు అవి. మనం యువకులు, వృద్ధులు అడగవలసిన ప్రశ్నలు. ఎందుకంటే జీవితంలో అవొక భాగం, మన ఉనికిలో భాగం, మీరంగీకరిస్తే ఈ సాయంకాలం కలిసి యీ సమస్యలగురించి మాట్లాడుకుందాము. ఈ సమస్యలలోకి కలిసి వెళదాము. ఒక బయటి ప్రేక్షకునిలా కుతూహలంగా చూస్తూ, వింటూ ఏదో ఆసక్తి చూపుతున్నట్లుగాదు. మనకిష్టమున్నా లేకున్నా మన జీవితాన్నేమి చేయాలి? ప్రవర్తనంటే ఏమిటి? ప్రేమంటే ఏమిటి? అసలటువంటి దుంటే చాలామంది అసలు [illegible]ంచకుండా ఉండే, మరణం అంటున్న ఈ అసాధారణ విషయానికున్న [illegible]ర్థమేమిటి? అన్న విచారణలో పాల్గొంటున్నాము. కాబట్టి ఇదంతా చూసి ఈ ఉనికి అంతటికీ వున్న ఉద్దేశమేమిటో అడగాలి.

ప్రస్తుతం మనం జీవిస్తున్న జీవితానికి, కొన్ని పరీక్షలలో విజయాన్ని సాధించి, ఒక డిగ్రీ పొంది, మంచి ఉద్యోగం సంపాదించి మిగిలిన జీవితాన్నంతా మరణం పర్యంతమూ పోరాడే జీవితానికున్న అర్థం బహు తక్కువ. ఈ అమిత అపసవ్యతకు అర్థాన్ని కనుక్కోవడమూ అంతే దారుణము. ఇప్పుడు మనకేది సాధ్యం? ఇదంతా చూసి తెలుసుకున్న మీదట పూర్తిగా భిన్నమైన సవ్యతను, భిన్నమైన సమాజాన్ని తీసుకురావడం కోసం లోతైన ఒక మానసిక విప్లవం జరగడమా? అదే సమయంలో మనకు జ్ఞానోదయంలో స్పష్టత కలుగజేస్తారంటూ ఎవరిపైనా ఆధారపడకపోవడమూ సాధ్యమా? ఏది సాధ్యమో తెలుసుకునే ముందు ఏది సాధ్యంగాదో తెలుసుకోవాలి. ఇప్పుడు

అసాధ్యమైనది ఏది? అసాధ్యంగా కనిపిస్తున్నదేది? సంపూర్ణ మార్పు. అసాధ్యంగా కన్పిస్తున్నదేదంటే, తక్షణమే సంపూర్ణ మానసిక విప్లవం రావడము. అంటే మీరు రేపు లేచేసరికే సంపూర్ణంగా భిన్నమై వుండడం. మీరు చూసే తీరు, ఆలోచించడము, అనుభూతి చెందడమూ ఎంతో క్రొత్తగా, బహు సజీవవంతమై, ఎంతో గాఢానుభూతితో సత్యమై అందులో ఏమాత్రం ఘర్షణ నీడగానీ, నటనగానీలేకుండా వుండడం. మానసిక పరిణామానికి క్రమక్రమంగా దాదాపు ఏభయి సంవత్సరాలు పట్టొచ్చునన్న భావన నంగీకరించి, అలవాటు పడటంవలన అది అసాధ్యమని, సమయం అవసరమని, కేవలం నిముషాలు, గంటల కాలంలోనే గాక మానసిక కాలం గూడా అవసరమని చెప్తారు. మార్పును, సమూల మానసిక విప్లవాన్నీ తీసుకురావడానికి కాలం అవసరమని ఆమోదించిన సంప్రదాయక ఆలోచనా విధానముంటుంది. వక్త అన్నట్లు ఎవరయినా రేపటికే పూర్తిగా మారడం సాధ్యం అంటే - మీరు అది అసాధ్యమంటారు. అనరా? కాబట్టి మీకది అసాధ్యం. ఇప్పుడు అసాధ్యమయినదేదో తెలుసుకోవడంతో సాధ్యమేదో మీరు తెలుసుకోగలరు. అప్పుడు సాధ్యత ఇప్పుడున్నట్లుండదు. పూర్తి భిన్నంగా వుంటుంది. మనం ఒకరినొకరము అర్థం చేసుకుంటున్నామా?

మనం ఇది సాధ్యం, ఇది సాధ్యంకాదు అన్నప్పుడు సాధ్యత కొలతకందేదయి వుంటుంది. అయితే ఏదయినా అసాధ్యం అని గ్రహిస్తే అసాధ్యమయిన దానికి సంబంధించిన సాధ్యమైనదేదో చూస్తాము. ఆ సాధ్యత యింతకుముందుగా సాధ్యం అనుకున్నదానికి పూర్తి భిన్నంగా ఉంటుంది. దయచేసి శ్రద్ధగా వినండి. ఎవరో చెప్పిన దానితో దీనిని పోల్చవద్దు. మీలో దీనిని ఊరికే గమనించండి. అసాధారణమయింది జరగడం చూస్తారు. మనం ఇప్పుడున్నట్లే ఉంటే బహు స్వల్పంగా మాత్రమే సాధ్యమవుతుంది. చంద్రమండలానికి వెళ్ళడము, ధనవంతుడో, ఆచార్యుడో అవడము, ఏదయినా అవడము సాధ్యమే కానీ ఆ సాధ్యత చాలా అల్పమైనది. రేపటికి మీరు పూర్తిగా మారాలి. దీనితో పూర్తిగా భిన్నమయిన మనిషవుతారు అనే సమస్యనెదుర్కొంటున్నప్పుడు అసాధ్యమయింది మీకెదురయినట్లు. దాని అసాధ్యతను మీరు గ్రహించినప్పుడు అసాధ్యమయిన దానితో గల సంబంధంలో సాధ్యమేదో తెలుసుకుంటారు. అదేదో పూర్తిగా భిన్నమయినదవుతుంది. కాబట్టి మీ మనసులో పూర్తిగా భిన్నమైంది జరుగుతుంది. మనం మాట్లాడుకుంటున్నది ఈ సాధ్యత గురించి, స్వల్పంగా సాధ్యమయ్యే దాని గురించి కాదు. అసాధ్యము, అసాధ్యమయిన దానికి సంబంధించిన సాధ్యత - ఇదంతా మనసులో వుంచుకుని ఈ ఉనికి యొక్క నమూనా మొత్తాన్ని చూస్తూ నేనేం చేయగలను? అసాధ్యమయినదేమంటే అసూయ, ద్వేషాల నీడ సోకని ప్రేమ.

మనలో చాలామంది ఈర్ష్య, అసూయలతో స్వంతం చేసుకోవాలి అనే భావంతో ఉన్నారేమోననిపిస్తుంది. మీరెవరినయినా మీ స్నేహితురాలినో, భార్యనో లేదా భర్తనో ప్రేమిస్తున్నప్పుడు మిగిలిన మీ జీవితమంతా వారినే పట్టుకుని ఉండాలన్న నిర్ణయంతో ఉంటారు. కనీసం అందుకు ప్రయత్నిస్తారు. దీనిని ప్రేమంటారు. అతడు నావాడు, ఆమె నాది. ఆ 'నాది' ఎక్కడో చూస్తుంటే లేదా మరొకరిని చూస్తుంటే స్వతంత్ర

మయినదేదో అవుతుంది. అప్పుడు ఆగ్రహం, అసూయ, ఆందోళన ఉంటాయి. అప్పుడు ప్రేమ అంటున్న దాని దుర్దశ మొత్తం ప్రారంభమవుతుంది.

ఇప్పుడు దీనంతటి నీడ పడకుండా ప్రేమించడం అంటే ఏమిటి? అది అసాధ్యం. మానవ మాత్రుడికి తెలియదు. ఇంకా చెప్పాలంటే మానవాతీతం అని మీరంటారు. కాబట్టి అది మీకు అసాధ్యం. దీని అసాధ్యతను చూడడంతో సంబంధ బాంధవ్యాలలో ఏది సాధ్యమవుతుందో తెలుసుకుంటారు. నన్ను నేను స్పష్టం చేసుకుంటున్నానను కుంటాను. అది ప్రప్రథమ అంశం.

రెండవది మన జీవితం. ఇప్పుడు ఉన్నదున్నట్లుగా జీవితమంటే పోరాటం, బాధ, సుఖం, భయం, ఆందోళన, అస్పష్టత, నిరాశ, యుద్ధం, ద్వేషం - వాస్తవానికి మన నిత్యజీవితమేమిటో తెలుసు. పోటీ, వినాశనము, అపసవ్యతలని మీకు తెలుసు. నిజంగా జరుగుతున్నదిది. ఉండవలసినదేదో లేదా ఏముండాలో గాదు. మనకు కావలసింది ఉన్నది ఏదో అదే. ఇదంతా చూస్తూ మనకు మనం 'అతి భయంకరమిది, దీని నుండి పారిపోవాలి. నాకు విశాలమయిన, లోతైన, మరింత విస్తారమయిన దృష్టిగావాలి. నేనింకా సున్నితంగా ఉండాలి' అనుకుంటాము. కాబట్టి మాదకద్రవ్యాలు సేవిస్తాము.

ఈ మాదకద్రవ్యాల ప్రశ్న చాలా పాతదే. భారతదేశీయులు వేల సంవత్సరాలుగా తీసుకుంటున్నారు. దీనినొకప్పుడు సోమరస మనేవారు. ఇదే యిప్పుడు హాషిష్ జర్దా కిళ్ళీ. అతి నాగరికమయిన ఎల్.ఎస్.డి కి వారింకా చేరుకోలేదు. కాని బహుశా ఇప్పుడు త్వరలోనే చేరుకుంటారు. మనుషులు హాషిష్ జర్దా కిళ్ళీలను తీసుకునేది సున్నితత్వం తగ్గడానికి. దాని సువాసనతో అది కల్పించే, తీక్షణంగా చేసే విభిన్న దృశ్యాలలో వారిని వారు మరిచిపోతారు. కష్టించి పనిచేసేవారు, శారీరక శ్రమ చేసేవారు సాధారణంగా యీ మాదక ద్రవ్యాలను తీసుకుంటారు. భారతదేశంలో ఉన్నట్లు అస్పృశ్యులనబడేవారు మీకిక్కడ లేరు. వారి జీవితాలు ఘోర నిరుత్సాహంతో ఉండడంతో వారు తీసుకుంటారు. వారికి తగినంత ఆహారముండదు. కాబట్టి ఎక్కువ శక్తీ వుండదు. వారికుండే రెండే రెండు ఏమంటే లైంగిక సుఖం, మాదక ద్రవ్యాలు.

నిజమయిన ధార్మికునికి, సత్యమేమిటో, జీవితమేమిటో తెలుసుకోవాలనుకునే మనిషికి పుస్తకాల నుండో, మతాన్ని ఒక వినోద కార్యక్రమంగా చేసిన వారినుండో మేధను మాత్రమే వుద్రిక్తపరిచే తత్వవేత్తల నుండో గాక నిజంగా తెలుసుకోవాలనే మనిషికి, అటువంటి వానికి ఏమి చేయాలన్నా మాదకద్రవ్యాలతో పనుండదు. ఎందుకంటే మనసునవి వక్రంచేసి, సత్యమేదో తెలుసుకోవడంలో అశక్తుని చేస్తాయన్నది చాలా బాగా వెల్లడి అయింది.

ఇక్కడ, ఈ పాశ్చాత్య ప్రపంచంలో ఎందరో మాదకద్రవ్యాలకు లోనవుతున్నారు. బహుశా కొన్ని సంవత్సరాలు గంభీర స్వభావులూ ప్రయోగాత్మకంగా తీసుకున్నారు. వారిలో కొందరు నన్ను చూడడానికి వచ్చారు. పుస్తకాలలో చదివినట్లు అంతిమ సత్యాన్ని పోలి, సత్యపు నీడలా కనపడే అనుభవాలు వచ్చినట్లు చెప్పారు.

వక్తలాగా వారూ గంభీర స్వభావులు గాబట్టి ఈ సమస్యనులోతుగా చర్చించారు. చివరికది కృత్రిమ అనుభవమేనని అంతిమ సత్యంతో, అపరిమితమయిన దాని సౌందర్యం మొత్తంతో దీనికి సంబంధం లేదనీ ఒప్పుకోక తప్పలేదు. మనసు స్పష్టంగా, సంపూర్ణంగా పూర్తి ఆరోగ్యంతో ఉండకపోతే ఆలోచనకు, కోరికకు అంతటికీ ఆవలగావున్న దానిని కనుగొనేందుకు తప్పక అవసరమయిన ధార్మిక, ధ్యాన స్థితిలో ఉండడానికి సాధ్యమవదు. మానసిక పరాధీనత, పలాయనం ఏమాత్రం వున్నా, మనసును ఇంకా సున్నితం చేయాలని ప్రయత్నించినా తాగుడుతో, మాదకద్రవ్యాలతో దానినింకా నిరుత్సాహంగా, వక్రంగా మాత్రమే చేస్తుంది.

దానినంతా వదలివేస్తే, తనలో తీవ్రత ఉంటే వదిలేయాలి - అంతరంగంలో ఏకాంత జీవితం ఎదురవుతుంది. అప్పుడు దేనిమీదా, ఎవరిమీదా, ఏ మాదకద్రవ్యం మీదా ఏ గ్రంథంమీదా, ఏ నమ్మకంమీదా ఆధారపడడం వుండదు. అప్పుడే మనకు భయ ముండదు. అప్పుడే జీవితానికర్థమేమిటని అడగగలిగేది. మీరంతదాకా వస్తే ఆ ప్రశ్నడుగుతారా? జీవితానికర్థం జీవించడమే - అమిత అస్తవ్యస్థతలో, గందరగోళంలో జీవించడంగాదు. పూర్తి భిన్న రీతిలో జీవించడం. జీవితానికది నిజమైన అర్థ శౌర్యవంతంగా జీవించడం కాదు. అంతరంగంలో భయంలేకుండా, పోరాటం, మనోక్లేశ ఏమీ లేకుండా అంత పూర్ణంగా జీవించడం.

అసాధ్యమేదో తెలుసుకున్నప్పుడే అది సాధ్యమవుతుంది. కాబట్టి కోపం, ద్వేష ఈర్ష్యలను మీరు వెంటనే మార్చుకోగలరా అని చూడండి. అప్పుడు యింకేమాత్ర ఈర్ష్య పడరు. అంటే మరొకరితో పోలిక తీసుకురావడమనే ఆ ఈర్ష్య, అసూయ లుండవు. ఆ అసూయ మిమ్మల్ని స్పృశించకుండా ఉండగల్గినంత సంపూర్ణంగా మారడం సాధ్యమా? పరిశీలకుడు, పరిశీలింపబడేదన్న ద్వంద్వ విభజన లేనట్లు. అసూయ పట్ల మీకు ఎరుక ఉన్నప్పుడే సాధ్యమిది. అప్పుడు మీరే అసూయ. మీరదే. మీనుండి వేరుగా మీరు, అసూయ ఉండడం గాదు. కాబట్టి ఇదంతా సంపూర్ణంగా చూసినప్పుడు దాని గురించి మీరు చేసేదేమీ వుండదు. ఎందులో విభజన, ఘర్షణ వుండవో ఆ అసూ అనే యీ పూర్తి స్థితిలో ఉన్నప్పుడు అదెంతమాత్రం అసూయగా వుండదు. అ భిన్నమైనదేదో. ప్రేమంటే ఏమిటి? అని అప్పుడడుగగలదు. ప్రేమంటే సుఖమా? ( కోరికా? భయంలాగా, సుఖం లాగా ప్రేమ ఆలోచన ఫలితమా? ప్రేమను పెంచ కాలంతో పాటు ప్రేమ వస్తుందా? నాకు ప్రేమంటే ఏమిటో తెలియకపోతే ద నేనందుకోగలనా?

ప్రేమంటే హృదయ దుర్బలతో, ఉద్వేగపూరితమో కానేకాదు. వాటిని తక్షణం ప్రక్కకు తోసేయవచ్చు. ఎందుకంటే, హృదయదుర్బలత, ఉద్వేగపూరత్వం కాల్పనికాలు. ప్రేమ కల్పనకాదు. సుఖం, భయం ఆలోచన కదలికలు. మనలో చాలామందికి జీవితంలో గొప్ప విషయం సుఖమే. లైంగిక సుఖం, దాని స్మృతి, అటువంటి సుఖం గురించిన ఆలోచన మళ్ళీ మళ్ళీ దానినే ఆలోచించడము, రేపు తిరిగి కావాలనుకోవడము, సుఖం

మీదనే సామాజిక నీతి ఆధారపడింది కాబట్టి సుఖం ప్రేమగాకపోతే ప్రేమ ఏదవుతుంది? దయచేసి దీనినర్థం చేసుకోండి. ఎందుకంటే మీరు ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పాలి. వక్తో లేదా ఎవరో చెప్తారని ఊరికే ఎదురుచూడలేము. మీరంతా సమాధానమీయవలసిన మౌలిక ప్రశ్న యిది. ఒక గురువో, తత్వవేత్తో ఇదీ ప్రేమ అని చెప్తే అదే ప్రేమగాదు.

ఈర్ష్య, అసూయ ప్రేమగాదు. అవునా? మీరంతా మౌనంగా వున్నారే! మీరు ప్రేమిస్తూ అదే సమయాన దురాశతో, అత్యాశతో, పోటీతో ఉండగలరా? జంతువులనేకాక యితరులను గూడా మీరు చంపుతుంటే ప్రేమించగలరా? ప్రేమంటే ఏదిగాదో ఆ యీర్ష్యను, అసూయను, ద్వేషాన్ని 'నా', 'మీ' అనే వ్యక్తి కేంద్రీకృతమయిన పనిని, కురూపమయిన పోటీని, దైనందిన జీవితపు మూఢత, హింసలను కాదన్నప్పుడు ప్రేమంటే ఏమిటో మీకు తెలుస్తుంది.

వీటన్నిటినీ బౌద్ధికంగా గాక నిజంగా ప్రక్కనుంచినప్పుడు మీ హృదయంతో, మనసుతో, స్థైర్యంతో గూడా అనబోతున్నాను. ఎందుకంటే ఇదంతా ప్రేమ గాదన్నది స్పష్టం. ప్రేమనే దానికి అప్పుడు చేరతారు. ప్రేమ తెలిసినప్పుడు ప్రేమ ఉన్నప్పుడు సరయినది చేసే స్వేచ్ఛ మీకుంటుంది. అప్పుడేది చేసినా అది సవ్యమైనదే.

అయితే ఆ స్థితికి రావడానికి, ప్రేమను తెచ్చే ఆ సౌందర్య దయాభావాలుండడానికి నిన్నటిదాని మరణముండాలి. నిన్నటిదాని మరణమంటే అంతరంగంలో ప్రతిదానికీ, అత్యాశకంతటికీ, మానసికంగా ప్రోగుచేసుకున్న దానికంతటికీ మరణించడము. మరణమొచ్చినప్పుడు - ఏదేమయినా జరుగబోయేదదే. మీ కుటుంబాన్ని యింటినీ వస్తువులను, విలువైన వాటిని, మీకున్న వాటినన్నింటినీ వదిలేయబోతున్నారు. జరుగబోయేదదే. మీరు జ్ఞానాన్నంతా దేని నుండి పొందారో, ఆ పుస్తకాలన్నింటినీ, మీరు రాయాలనుకున్న, రాసిన పుస్తకాలను, చిత్రించాలనుకున్న చిత్రాలను అన్నీ వదిలేయబోతున్నారు. వీటన్నింటికీ మీరు మరణిస్తే మనసప్పుడు పూర్తిగా నూతనమై స్వచ్ఛంగా, అమాయకంగా వుంటుంది. బహుశా మీకది అసాధ్యమని చెప్తారేమో.

మీరిది అసాధ్యమన్నప్పుడు మరణానంతర జీవితం ఉండి ఉంటుందని సిద్ధాంతాలను కనిపెట్టనారంభిస్తారు. క్రైస్తవుల ప్రకారం పునరుజ్జీవనమున్నది. ఆసియా మొత్తం పునర్జన్మను నమ్ముతుంది. హిందువులు జీవితం, ఆరోగ్యం, సౌందర్యం యింకా ఉన్నప్పుడే ప్రతిదానికీ మరణించడమసాధ్యమంటారు. కాబట్టి మరణభయంతో పునర్జన్మ అనబడే యీ అద్భుత విషయాన్ని కనుగొని తర్వాత జీవితం యింతకంటే బాగుంటుందన్న ఆశ కల్పిస్తారు. ఏదేమయినా మరింత బాగా అంటే, అది మరొకదానితో ముడిపడి ఉంటుంది. నా తర్వాత జన్మలో బాగుండాలంటే ఈ జన్మలో మంచిగా వుండాలి. కాబట్టి సరిగా ప్రవర్తించాలి. ధార్మికంగా జీవించాలి. ఇతరులను బాధించగూడదు. ఆందోళన, హింస ఉండగూడదు. కానీ దురదృష్టవశాత్తూ పునర్జన్మను నమ్మేవాళ్ళు ఆవిధంగా జీవించరు. అందుకు విరుద్ధంగా పోట్లాడుతూ,

అందరివలెనే హింసాపూరితులయి ఉంటారు. కాబట్టి మృతమయిన 'నిన్న'లవలె వారి నమ్మకం గూడా వ్యర్థం.

ఇప్పుడు మీరేమిటి-అన్నది ప్రధానం. మీకు నమ్మకం వున్నదా లేదా అనేవి కావు. మీ అనుభవాలు భ్రమోత్పాతాలా, సాధారణమైనవా అనీగాదు. అసలు విషయం ఉత్తమోత్తమ సౌశీల్యతతో జీవించడము. (ఆ మాట మీరిష్టపడరని తెలుసు) సచ్ఛీలత సద్ధర్మమూ అన్న పదాలు రెండూ అర్థరహితమయిపోయాయి. వీటిని ప్రతి మతాచార్యుడూ ఉపయోగిస్తాడు. ప్రతి నీతిమంతుడూ, ఆశయాత్మకుడూ ప్రయోగిస్తాడు. కానీ అసలు సౌశీల్యత ఇదే సద్గుణం అంటూ సాధన చేస్తున్నదానికి పూర్తి భిన్నంగా ఉంటుంది. దాని సౌందర్యమందులోనే వున్నది. సాధనచేసే ప్రయత్నంచేస్తే అదెంత మాత్రం సౌశీల్యతగా ఉండదు. సౌశీల్యత కాలానుగుణంగా వుండదు. కాబట్టి దీనిని సాధన చేయలేము. ఆ ప్రవర్తన పరిసరాల మీద ఆధారపడదు. పరిసరానుగుణ ప్రవర్తన దాని రీతిలో సరయిందే. కాని అది సౌశీల్యత కాదు. సౌశీల్యతంటే ప్రేమించడం, భయంలేకపోవడం, ఉత్తమోత్తమంగా జీవించడం. అంటే అంతరంగంలో ప్రతిదానికీ మృతమవడము, గతానికి మృతమవడము. ఆవిధంగా మనసు స్పష్టంగా, నిష్కపటంగా ఉండడము. అటువంటి మనసే అసాధారణమైన అపరిమితత్వంతో ఉండగలుగుతుంది. అది మీరో, ఒక తత్వవేత్తో, ఒక గురువో తయారుచేసుకున్నది కాదు.

ప్రా: దయచేసి ఆలోచనకు అంతర్దృష్టికి గల భేదాన్ని వివరిస్తారా?

కృ: అంతర్దృష్టి అంటే అవగాహనని మీ అర్థమా? చాలా స్పష్టంగా, గందరగోళం లేకుండా, ఎంపికలేకుండా దేనినో చూడడమా? అంతర్దృష్టి అన్న పదాన్ని మీరెలా ప్రయోగిస్తున్నదీ నేనర్థం చేసుకోవాలి. అంతేనాండీ?

ప్రా: అవును.

కృ: ఆలోచనంటే ఏమిటి? దయచేసి దీనిలోనికి వెళదాము. ఆలోచనంటే ఏమిటి? అని ప్రశ్నిస్తున్నప్పుడు మీ మనసులో ఏమి జరుగుతున్నది?

ప్రా: ఆలోచన.

కృ: నెమ్మదిగా వెళ్ళండీ. ఒకదాని తర్వాత ఒకదానికి. దీని దగ్గర త్వరపడొద్దు! ఏమి జరుగుతుంది? నేనో ప్రశ్నడుగుతాను. మీరెక్కడుంటారు - మీ పేరేమిటి అనడుగుతాను. మీ సమాధానం తక్షణమే వస్తుంది. కాదా? ఎందుకు?

ప్రా: ఎందుకంటే గతానికి సంబంధించిన దేనితోనో మీరు వ్యవహరిస్తున్నారు.

కృ: దయచేసి విషయాన్ని క్లిష్టం చేయొద్దు. ఊరికే దీనివంకే చూడండి. దీనిని ఎట్లాగూ నేను క్లిష్టం చేయబోతున్నాను. కాబట్టి దీనివంక ఊరికే చూడండి (నవ్వులు). మీ పేరు, మీ చిరునామా, మీరెక్కడ నివసించేది యిత్యాదివడుగుతాను. తక్షణ సమాధానముంటుంది. ఎందుకంటే మీకిది పరిచితమయినది. దీనిగురించి ఆలోచనక్కర లేదు. బహుశా మొదట దీనిగురించి ఆలోచించివుంటారు. చిన్ననాటి నుండి మీ పేరు

తెలిసి ఉండేటట్లు మిమ్మల్ని పెంచి వుంటారు. అందులో ఎటువంటి ఆలోచనా యిమిడిలేదు. ఇప్పుడు, తర్వాతసారి, మరికొంత కష్టమైన ప్రశ్నేదో అడిగినప్పుడు ప్రశ్నకు, సమాధానానికి నడుమ కాలపు నడక ఉన్నది. నడుమనున్న ఆ సమయంలో ఏమి జరుగుతుంది? నెమ్మదిగా వెళ్ళండి. నాకు సమాధానం చెప్పొద్దు. మీకు మీరు తెలుసుకోండి. అది సరే మిమ్మల్ని ఒక ప్రశ్నడుగుతాను. ఇక్కడి నుండి చంద్రుడి దగ్గరకు లేదా అంగారక గ్రహానికి లేదా న్యూయార్కుకు మధ్య దూరమెంత? ఆ విరామంలో ఏమి జరుగుతుంది?

ప్రా: అన్వేషించడం.

కృ: మీరు అన్వేషిస్తున్నారు. కాదా అన్వేషిస్తున్నదెక్కడ?

ప్రా: నా స్మృతుల్లో ...

కృ: మీరు అన్వేషిస్తున్నది మీ స్మృతి పధాన. అంటే మీకెవరు చెప్పారు? దీని గురించి చదివారు. కాబట్టి మీ అల్మయిరాలో చూస్తున్నారు (నవ్వులు). అప్పుడు మీకు సమాధానమొస్తుంది. మొదటి ప్రశ్నకు తక్షణ సమాధానమొచ్చింది. అయితే రెండవప్రశ్న గురించి అస్పష్టంగా ఉన్నారు. అందుకని ఎక్కువ సమయం తీసుకున్నారు. మీరా విరామంలో ఆలోచిస్తూ, లోనికి చూస్తూ, శోధిస్తూ వుండడంతో సరైన సమాధానాన్ని తెలుసుకుంటారు. 'దేవుడంటే ఏమిటి?' అనే క్లిష్టమయిన ప్రశ్న ఇప్పుడు మిమ్మల్నడిగితే?

**ఒకటవ ప్రాశ్నికుడు** : దేవుడంటే ప్రేమ.

**రెండవ ప్రాశ్నికుడు** : దేవుడంటే ప్రతి ఒక్కటీ

**మూడవ ప్రాశ్నికుడు** : నా స్మృతిలో సమాధానం లేదు.

కృ: ఊరికే వినండి. 'దేవుడంటే ప్రేమ', 'దేవుడంటే ప్రతి ఒక్కటీ'

ప్రా: దేవుడంటే (సామానులు) మోసే ఒక మనిషి (నవ్వులు).

కృ: ఇలాంటివి ఇప్పుడు గమనించండి. ఊరికే జరిగిన దానిని చూడండి. మాకు తెలియదని మీరెవరూ చెప్పలేదు. సరయిన సమాధానం అదీ. దయచేసి దీని నర్థం చేసుకోండి. ఇది చాలా ముఖ్యం. తెలియకపోవడంవల్ల మీరు నమ్మకంలో పడతారు! జరిగిందేమిటో చూడండి. మిమ్మల్ని ఆలోచన మోసపుచ్చింది. మొదటి ప్రశ్న తెలిసినది. తర్వాత ప్రశ్న కొంచెం కష్టం. చివరి ప్రశ్నకు సమాధానంగా దైవాన్ని నమ్మడానికి అలవాటు పడ్డానుగాబట్టి నాకు సమాధానమున్నది అని మీ మనసంటున్నది. మీరు కమ్యూనిస్టు అయి వుంటే 'మీరేమి మాట్లాడుతున్నారు? మూర్ఖంగా ఉండొద్దు. దేవుడనేదేమీ లేదు. మతాచార్యులు కనిపెట్టిన బూర్జువా నమ్మకం' (నవ్వులు) అంటారు. ఇప్పుడు మనం ఆలోచన గురించి మాట్లాడుకున్నాము - అన్నిటికంటే ముందుగా అసలు దేవుడున్నాడా? లేదా? అని మనం తెలుసుకోవాలి. లేకుంటే మనం సంపూర్ణ మానవులముగాము. అది తెలుసుకోవడానికి నమ్మకమంతా, అంటే మనిషి ఆలోచనతో తీసుకువచ్చిన

నిబద్ధతంతా భయంలో నుండి ఉత్పన్నమయినది అంతా కూడా అంతమవాలి. మనమప్పుడు ఆలోచించడమంటే ఏమిటో చూస్తాము. స్మృతి నుండి వచ్చే సమాధానమే ఆలోచన. అది మీరు ప్రోగుచేసుకున్న జ్ఞానం, అనుభవం, వెనుకనున్నదీ. ఒక ప్రశ్న వేస్తే మీకు కొన్ని ప్రకంపనలు గలగడంతో స్మృతి నుండి సమాధానమిస్తారు. అది ఆలోచన. దయచేసి దీనిని మీలో గమనించండి! అలోచనెప్పుడూ తప్పకుండా పాతదే. ఎందుకంటే ఆ సమాధానమిచ్చేది గతాన్నుండి. అందుచేత ఆలోచనెప్పటికీ స్వేచ్ఛగా ఉండలేదు (ఆగి) ఇది మీకు మింగుడు పడదు. అవునా! (నవ్వులు). 'ఆలోచన నుండి విముక్తి' దయచేసి దీనివంక చాలా శ్రద్ధగా చూడండి. నవ్వేసేయొద్దు. మనం ఆలోచనను ఆరాధిస్తాము. ఆరాధించమా? జీవితంలో ఆలోచన గొప్పది. దానిని మేధావులు ఆరాధిస్తారు. ఆలోచనా ప్రక్రియవంక చాలా దగ్గరగా చూస్తే - అదెంత హేతుబద్ధమూ, తర్క సమ్మతమూ అయినప్పటికీ ఎప్పటికీ పాతదే అయిన స్మృతికి యిచ్చే సమాధానమే. కాబట్టి ఆలోచనే పాతది. అదెప్పటికీ స్వేచ్ఛను తీసుకురాలేదు. దేని గురించి వక్త ఏమి చెప్పినా దయచేసి ఆమోదించవద్దు!

కాబట్టి అప్పుడు ఆలోచన గందరగోళాన్ని తెస్తుంది. ప్రశ్నేమిటంటే ఆలోచనకు అంతర్దృష్టికి ఉన్న తేడా ఏమిటి? అని. విషయాలను ఎటువంటి గందరగోళం లేకుండా స్పష్టంగా చూడడము అంటే అవగాహన అని మనం ఒప్పుకున్నాము. మీరేదయినా చాలా స్పష్టంగా చూసినప్పుడు ఎంపిక ఉండదు. మనం మాట్లాడుకుంటున్నది మానసికమైనది. గందరగోళమున్నప్పుడే ఎంపిక ఉంటుంది. ఎంపిక చేసే స్వేచ్ఛ అంటే నిజానికి గందరగోళపడడానికి ఉండే స్వేచ్ఛ అని అర్థం. ఎందుకంటే మీరు గందరగోళపడకపోతే దేనినో తక్షణమే స్పష్టంగా చూస్తే ఎంపిక చేసే అవసరమెక్కడుంటుంది. ఎంపిక లేనప్పుడు స్పష్టత వుంటుంది.

స్పష్టత, అంతర్దృష్టి అవగాహన అన్నవి ఆలోచన ఆగిపోయినప్పుడు మనసు నిశ్చలంగా ఉన్నప్పుడు సాధ్యం. మీరు స్పష్టంగా చూడగల్గేది అప్పుడే. మీ మనసేమాత్రం గందరగోళపడటంలేదు గాబట్టి మనం మాట్లాడుకుంటున్నది మొత్తం నిజంగా అర్థం చేసుకుంటున్నట్లు చెప్పగలరు. గందరగోళపడడమంటే ఎంపిక చేయడము. ఆలోచన వలన ఎంపిక జరుగుతుంది. నేను ఇది చేయనా, అది చేయనా? నాది - కాదు, మీరు - కాదు, 'మేము'-'వారు', ఇత్యాదివి. ఆలోచన మూలంగా ఇదంతా వుంటుంది. దీనినుండి గందరగోళం బయలుదేరుతుంది. ఆ గందరగోళాన్నుండి మనం ఎంచు కుంటాము. రాజకీయవేత్తలను, గురువులను, మిగిలిన విషయాలెన్నింటినో ఎన్నుకుంటాము. కాని అక్కడ స్పష్టత ఉంటే అప్పుడు నేరుగా వీక్షించడముంటుంది. స్పష్టంగా ఉండాలంటే మనసు పూర్తి నిశ్శబ్దంగా, నిశ్చలంగా ఉండాలి. నిజమయిన అవగాహన అప్పుడుంటుంది కాబట్టి ఆ అవగాహనే క్రియ. మరొక విధంగా జరగదు.

ప్రా: మనుషులు మనోరుగ్మతకెలా లోనవుతారు?

కృ: మనోరుగ్మత గలవారని నాకెలా తెలుస్తుంది? ఇది చాలా గంభీరమయిన ప్రశ్న

గాబట్టి దయచేసి వినండి! వారు మనోరుగ్మత గలవారని నాకెలా తెలుస్తుంది? నాకూ మనోరుగ్మత ఉండడంతో వారిని గుర్తించగల్గుతున్నానా?

ప్రా: అవును.

కృ: అంత వెంటనే 'అవును' అనొద్దు! దానిని ఊరికే చూడండి. వినండి. మనోరుగ్మతంటే అర్థమేమిటి? కొంచెం అసాధారణంగా, స్పష్టత లేకుండా, గందరగోళ పడుతూ కొంచెం వశం తప్పినట్లుండడము. దురదృష్టవశాత్తూ మనలో చాలామందిమి కొంత సమతుల్యత కోల్పోయే వున్నాం. కాదా? మీకు గట్టిగా అన్పిస్తున్నట్లులేదే ! (నవ్వులు) నీవు క్రైస్తవుడివో, బుద్ధుడివో, కమ్యూనిస్టువో అయితే సమతుల్యతను కోల్పోయినట్లు గాదా? మీ సమస్యలతో మిమ్మల్ని కప్పి ఉంచుకుంటే, మరొకరికంటే మీరెంతో మెరుగనుకుంటూ మీ చుట్టూ ఒక గోడ కట్టుకుని ఉంటే మనోరుగ్మత గల్గినవారుగారా? నా, నీ, మేము, వారు యితరత్రా విభజనలన్నీ చేయడంతో మీ జీవితం మొత్తం ప్రతిఘటనే అయితే మీరు సమతుల్యతను పోగొట్టుకోలేదా? ఆఫీసులో తోటివానికంటే ముందుకు పోవాలనుకుంటే అది మనోరుగ్మత గాదా? కాబట్టి ఎవరయినా మనోరుగ్మత గలవారెలా అవుతారు? సమాజం మిమ్మల్నలా చేస్తుందా? మా నాన్న, మా అమ్మ, మాపొరుగువారు ప్రభుత్వం, సైన్యం, ప్రతి ఒక్కరూ నన్ను మనోరుగ్మతకు లోనుచేశారన్న వివరణ సులభమైనది. నేను సమతుల్యతను కోల్పోవడానికి వారంతా బాధ్యులు. సహాయంకోసం విశ్లేషకుని దగ్గరకెళ్తే పాపం ఆయన గూడా నాలాగే మనోరుగ్మత గలవాడే (నవ్వులు). దయచేసి నవ్వకండి. ప్రపంచంలో సరిగ్గా యిదే జరుగుతున్నది. ఇప్పుడు నేనెందుకు మనోరుగ్మత గలవాడినయ్యాను? ప్రపంచంలో యిప్పుడున్న ప్రతిదీ - సమాజం, కుటుంబం, తల్లిదండ్రులు, పిల్లలు, వారికెవరికీ ప్రేమ లేదు. వారికే ప్రేమ వుండి వుంటే యుద్ధాలుంటాయనుకుంటున్నారా? చంపబడడమే సరయినదనుకునే ప్రభుత్వాలుంటాయనుకుంటున్నారా? మీ అమ్మా, నాన్నా మిమ్మల్ని నిజంగా ప్రేమించి ఉంటే మీ పట్ల శ్రద్ధచూపి వుంటే మిమ్మల్ని చూసుకుని ఉంటే మనుషుల పట్ల దయతో ఎలా ఉండాలో, ఎలా బ్రతకాలో, ఎలా ప్రేమించాలో నేర్పి వుంటే అటువంటి సమాజం ఎప్పటికీ వుండదు. ఇవి మానసిక రుగ్మత గల సమాజాన్ని తీసుకువచ్చే బాహ్యమైన వత్తిళ్ళు, పీడనాలు. మనలోని ఆంతరంగిక నిర్బంధాలు, కాంక్షలు, ఈ మనోరుగ్మతకు, నిలకడలేనితనానికి దారితీసేందుకు దోహదం చేస్తున్నవి. గతాన్నుండి సంక్రమించిన ఆంతరంగిక హింస గూడా వున్నది. కాబట్టి యిది వాస్తవము. మనలో చాలా మందిమి కొంతో ఎక్కువో సమతుల్యతను పోగొట్టుకున్నాము. ఇందుకెవరిని నిందించీ ప్రయోజనంలేదు. మానసికంగా, బౌద్ధికంగా లేదా లైంగికంగా తాను సమతుల్యతలో లేడన్నది నిజం. ప్రతి విషయంలోనూ మనం సమతుల్యతను పోగొట్టుకున్నాము. ఇప్పుడేది ముఖ్యమంటే సమతుల్యతలేదని తెలుసుకోవడము. ఎలా సమతుల్యమవ్వాలన్నది కాదు. మనోరుగ్మత మరీ విపరీతంగా మించిపోకపోతే, కొంత సమతుల్యతను యింకా నిలుపుకుని ఉంటే తనను తాను గమనించుకోగలడు. తానేం చేసేదీ, ఏం చెప్పేదీ, ఏమాలోచించేదీ, ఎలా కదిలేదీ, ఎలా కూర్చునేదీ, ఎలా తినేదీ

